# చంద్రునికో నూలుపోగు

( నవల )

రచన :

శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ



ప్రచురణ
1960

మూల్యము : రూ. 3/-

సంపాదకుడు : 'ఛాయేశ్వర్'

ముద్రణ : వెంకటరత్నా ప్రింటర్సు, విజయవాడ-2.

# జైనేంద్ర సాహిత్యం

## మీరు చదివారా!

త్యాగమూలకమైన ప్రేమసిద్ధాంతానికి శక్తివంతమైన
సాహిత్యరూపం కల్పించిన సాహితీస్రష్ట

## శ్రీ జైనేంద్రకుమార్

జైనేంద్రసాహిత్యమంతా తప్పక చదవండి.

ప్రకాశకులు :

## ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్

విజయవాడ



నాటకంలో తన పాత్రను తాను చక్కగా నిర్వహించడం చేతనవును. ఒక తగులబడిపోతున్న మహారణ్యంలో చెదిరిచెదిరి వేస్తున్న అడుగులను, లేత గులాబీవన్నె పాదాలను గుర్తుపట్టగలడు. కొసిరి కొసిరి చూస్తున్న మంటలను మాట్లాడించగలడు. సూర్యరశ్మిని తరుముకొచ్చే మేఘాన్ని ఆపగలడు. పిల్లలచేత బడిపంతుళ్ళ కళ్ళు తెరిపించగలడు. దేశం ఎట్లా మారిపోతున్నదో చూపించగలడు. యాత్రికుడికి నీడలా ఎంతదూరమైనా తోడు నడవగలడు. ఎత్తు మీద నిల్చొని దీపంలా ముందుకు నడిపించగలడు. 'చంద్రునికో నూలుపో'గని ఊరుకోడు. చంద్రుణ్ణేపట్టి తెచ్చి, చేతికి అందిస్తాడు, జీవితపు వెన్నముద్దను. 'కుక్కల్ని ప్రేమించేవాడు కవుల్ని దేనికి ఆదరించడు?' అని ప్రతిదీ కొత్తగా అడుగుతాడు. తన చేతుల్లోని దూర నియంత్రణంద్వారా కథలూ, కలలూ ఇంతకు మునుపుపోని కొత్త స్టేషన్లకు సూటిగా నడిపిస్తాడు రైళ్ళు. 'పురాణం' చెప్పుకోదగ్గసాడు. మన కాలపు ప్రతినిధి. అవును, ఈ పుస్తకం మీ చేతిలోనేవుంది కదా! మరి అద్దాలు దేనికి ?

బంగారానికి పూత దేనికి ?

ఏల్చూరి సుబ్రహ్మణ్యం.

# సమర్పణ

మొట్టమొదటిసారి తెల్లకాగితాన్ని చూసి నేను వుద్రేక పడ్డం ప్రారంభించినపుడు, అప్పటికింకా విశాఖపట్నంమీాద బాంబులు పడలేదు —

'టాగూరు' బ్రతికేవున్నాడు—

నాకోషంతు నాటకాలుచూడ్డం, లాటరీటిక్కట్లు కొనడం, సుభాస్‌చంద్రబోసుకీ జై అంటూ తిరగటం—ఆరోజుల్లో నేనొక చాటభారతమంత కథ వ్రాస్తే —

మా 'సుబ్బు' కథ వ్రాశాడని యింట్లో పిన్నల్నీ పెద్దల్నీ కూర్చోబెట్టి...పదకొండేళ్ళనాచేత ఆ కథ చదివించుకుని ఆనందించిన —

ఆరోజే, ఆ ముహూర్తాన్నే —

బహుశా —

నేను కథకుడ్నయింటాను.

ఆ నా పెదతండ్రి—

కీ. శే. పురాణం రామచంద్రరావుగారికి—

(సీనియర్ డిప్యూటీ యినస్పెక్టరాఫ్ స్కూల్సు చేశారు )

సమర్పిస్తున్నాను—

— 'చంద్రునికో నూలుపోగు'

— 'పురాణం'

# చంద్రునికో నూలుపోగు

కళని వ్యాపారంగా మార్చుకుని నాలుగురాళ్ళు చేడబట్టుకోవాలనే తాపత్రయంతో జీవితంలోకురికిన 'సూర్యనారాయణ' ఆఖరుసారి మేడ మీద కొట్టుగదులు రెంటినీ ముప్పైరూపాయలకు అద్దెకుచ్చుకుని,పాతబోర్డు చెరిపి మళ్ళీ వ్రాయించాడు, ఏమని-'నేషనల్ ఫొటో స్టూడియో' ఇచ్చట పగలూ రాత్రీ అన్నివేళలయందును సరసమగు రేట్లకు ఫొటోలు తీయ బడును. ఒక రూపాయికి రెండు ఫొటోలు. పెళ్ళిళ్ళకు విద్యార్థులకు గ్రూపుఫొటోలకు ప్రత్యేకమైన ఏర్పాట్లు-అని ఉత్సాహాన్నీ శక్తినీ కేంద్రీకృతంచేసి జీవితంలో నెగ్గితీరాలన్న పట్టుదలతో ఆరంభించిన పోరాట ములో 'సూర్యనారాయణ' ఆఖరిదఫా పరిస్థితులతో ఒంటరిగా చేయీ చేయీ కలిపి కుస్తీకి తలపడ్డాడు. ఒకప్పుడు తనదగ్గిర ప్లేటులు కడిగిన కుర్రవాళ్లంతా ఎలక్ట్రిక్ స్టుడియోలు తెరచి వేలకువేలు ఆర్జించుతు న్నారు. ఈ ఫొటోలవ్యాపారం ఒక్క తనపక్షంగానే దివాళా వ్యాపారంగా మారిందికాని అందరూ బాగుపడుతున్నారు. ఎక్కడో ఏదో అవ్యవస్థ, అసంతృప్తి జీవితంపొడుగునా-విక్రమార్కుడు మోసిన బేతాళుడిశవమల్లే (మాట్లాడగానే టప్పున శవంవచ్చి చెట్టుకు తగులుకున్నట్లు)-వెనక్కి యీడ్చుకురాబట్టిగాని- పనితనంలోగాని, అనుభవంలోగాని, నేర్పు నిజా యితీల్లోగాని సూర్యనారాయణ యే యితర ఆర్టిస్టుకు తీసిపోయేవాడుగాదు. యీ ఫొటోలతో విసిగి జీవితంలో వోడిపోయిన సమయాల్లో సూర్యనారా యణ అనేక ఆవేశాల్ని తెచ్చుకున్నాడు. నాటకాల్లో ఆడవేషాలు వేసే వాడు, 'మేకప్పు' అంతో యింతో మెచ్చుకునేట్లుగానే చేసేవాడు. పెద్ద పెద్ద తెరలు ప్రక్కకట్లెన్నో ఫ్రేములు వ్రాసియిచ్చాడు క్లబ్బులకు. పెద్ద పెద్ద గానకచ్చేరీలకు, కవిపండితసభలకు, రాజకీయసమావేశాలకు చేతి చమురు వదుల్చుకొని పెళ్ళి ఫొటోలు తీసిచ్చేవాడు. సూర్యనారాయణ ఎట్లా బ్రతికినా అతను బ్రతకటం సమాజానికి చాలా అవసరమనిపించే భావన, ఎంతోమంచివాడు, నెమ్మదస్తుడనే ప్రతీతి, అతన్ని జీవితంలోని

గతుకులూ పల్లాల్నుంచి తప్పించలేకపోయినప్పటికీ, వెనక్కు తిరిగి చూసుకుంటే నిరాశా నిస్పృహా-యింకా....యివే మిగిలి తన్ను వెంటాడు తున్నా, మిథ్యామోహపల్లోకలిగే సంతృప్తి, ఆనందం, యివి తెప్పించిన ఆవేశం-అక్షయంగా నిండుకుని తన్ను 'యింకోసారి ప్రయత్నించిచూడు' అని రెచ్చగొడ్తున్నాయి.

నాలుగేళ్ల క్రితం మాయమాటలుచెప్పి పెళ్ళాన్ని ఒప్పించి పుస్తెల తాడు మినహా ఆ ఆడకూతురు ఒంటిమీద బంగారంకాస్తా అమ్మి, దానికి తోడు మరో పదివందలు కోఆపరేటివ్ బ్యాంకులో అప్పుచేసి తలదాచు కుందుకు ఓ కొంప యేర్పాటుచేశాడు. తరువాత యేడున్నర్థం ఫొటోల కొట్టుకు స్వస్తిచెప్పి డ్రాయింగుపరీక్షలు ప్యాసయివచ్చాడు. హఠాత్తుగా సంగీతసాధనలో పడ్డాడు. సంగీతపరీక్షలు ఒకటో అరో ప్యాసయ్యాక కొన్నాళ్ళు సైకిలుమీద యిళ్ళచుట్టూ తిరిగి ఆడపిల్లలకు సంగీతప్పాఠాలు చెప్పివచ్చాడు. ఇందులో పోటీకి ఆడటీచర్లు రావటంతో సూర్యనారాయణ నిస్పృహచెందలేదు. వెంటనే ఒకటి రెండు హరికథలు సాధనచేసి రెడీగా వుంచుకున్నాడు.

ఈ హరికథలు సాధనచేసినవి చెప్పటం జరిగేపక్షంలో సూర్య నారాయణ భార్య ఏ నుయ్యో గొయ్యో చూసుకుంటానని వార్నింగు యిచ్చింది. చుట్టుపట్లవున్న బంధుబలగాన్నంతా తనవైపుకు తిప్పుకున్న 'సూర్యనారాయణ' చుట్టాలింట్లో పెళ్ళి సందర్భంలో 'ఉత్తరకుమార ప్రజ్ఞలు' కథచెప్పి జీవితంలో మొదటిసారీ ఆఖరుసారీ గూడా భాగవ తారు ననిపించుకున్నాడు.

ఫొటోలఅధ్యాయం మళ్ళీ వుటకలుతీస్తూ తలయెత్తేసరికి 'సూర్య నారాయణ' జీవితపు నాలుగురోడ్లమధ్యకువచ్చి నిలబడి 'నేషనల్ ఫొటో స్టూడియో' బోర్డు కట్టాడు మీదన. క్రింద మెట్లగదినానుకుని వీధిమీద చిన్నకొట్టులో 'మస్తాను' 'జెంట్స్ అండ్ లేడీస్ అవుకు ఫిట్టర్సు' షాపు వెల్సింది. సూర్యనారాయణ 'స్టూడియో'కు పోవాలంటే యీ 'జెంట్స్ అండ్ లేడీస్ అవుకు ఫిట్టర్సు' కొట్టు మూసేస్తే మరి మార్గంలేదు. పట్టు

బట్టి అయిదారువందలు ఖర్చుచేసి యీ కొట్టుముందర వొక ఎలక్ట్రిక్ స్తంభం పాతించాడు సూర్యనారాయణ.

ఈ దీపాల యేర్పాట్లకు ఫ్లాష్‌లైట్లకు స్టాండ్లు వగైరాలకు వెరసి మరో అయిదారువందలయింది. తొమ్మిదివందలుపోసి సెకండుహేండుది ఎన్‌లార్జరు తెచ్చాడు. పువ్వులపువ్వుల రకరకాల గుడ్డలు కొని తెరలూ అవీ యేర్పాటుచేశాడు. మేడమీదనుంచి దారినపోయేవాళ్ళను ఆకర్షించేందుకు షోకేసులు చేయించాడు. తగిన స్తోమతులేక అదివరలో మరుగుపడిన అతని కళాహృదయం పురివిప్పుకున్న నెమలిలా నృత్యంచేసింది. నిద్రాహారాలు యిల్లు వాకిలీ యివేవీ యిప్పుడు జ్ఞాపకంలేవు. రోజుల తరబడి ఏరికోరి అన్నివస్తువుల్నీ సేకరించుకుని ఆ స్టూడియోను అలంకరించుకోవటంలో సూర్యనారాయణ తదాత్మ్యంచెందాడు. కాని ఆ పెట్టుబడి- అదంతా ఋణాల్తో కుంచించుకుని కుంచించుకుని మిగిలిపోయిన జీవనగ్రాసాన్ని, సంసారానికి రెండుపూటలూ భుక్తికి లోటురానివ్వని రెండెకరాల్నర పల్లపుసుక్షేత్రాన్ని అమ్మగావచ్చిన మూల్యాన్ని ఏ ఆసరా చూసుకుని విశృంఖలంగా ఖర్చుపెట్టాడో, ఆ కళ వ్యాపారానికి లొంగి బ్రతుకుబాటను చక్కదిద్దుతుందో, భయంకరంగా సూర్యనారాయణ జీవితాన్నే బలికోరుతుందో శంకించేముందు - యావజ్జీవితాన్ని బలిపీఠానికి తీసుకుపోయిన అతడి సాహసాన్ని, పరిశోధకులు తాము కనుక్కొన్న వాటిని తమమీదే ప్రయోగించుకొనేరీతితో పోల్చిచూస్తే ఆ పట్టుదల ప్రశంసనీయంగాకపోదు.

సూర్యనారాయణ బక్కపలచగా పొడుగ్గా తెల్లటి లాల్చీవేసుకుని నేర్పుగా కట్టిన జలతారంచు కుచ్చెళ్ళుపోసిన ధోవతిలో....ప్రక్కవాటుగా ఎదుటరొమ్మునిక్రమ్ముతూ వేసుకున్న కండువాతో....ఫ్రేములేని క్రూక్స్ లేతనీలికళ్ళద్దాల్లోంచి....నల్లటి ఆకుచెప్పుల్ని మెత్తగా వొత్తుతూ, యేమీ హడావుడి లేనివాడిలా నవ్వుతూ....పచ్చపచ్చగాకట్టిన తోరణాల్లోంచి 'ప్రారంభోత్సవానికి' ఆహ్వానితులైన మిత్రులు శ్రేయోభిలాషులకోసం ఎదురుతెన్నులుకాస్తున్నప్పుడు - చూస్తున్నప్పుడు - దూరాన బడినుంచి

ఏవో పుస్తకాలను రొమ్ముకదుముకుని మాసిపోయిన చుక్కల చుక్కల పరికిణీమీద, అక్కడా అక్కడా వెలిసిపోయి చేతికుట్టులో మాసికలు దీర్చిన పువ్వులవల్లెవాటుతో, తలవాల్చుకుని, తడబడుతున్న కాళ్ళతో, మొగ్గ విచ్చిన యవ్వనాన్ని దాచుకోలేక దాచుకోలేక వొంటరిగా యింటికి పోతున్న మీనాక్షి కనపడింది.

సూర్యనారాయణ కళ్ళజోడుతీసి చేరుమాలుతో రెండుకళ్ళూ వొత్తుకున్నాడు. నిజానికి సూర్యనారాయణకి పెళ్ళీడుకూతురు యింట్లోవుందని, ఆ అమ్మాయి ఫిఫ్త్‌ఫారం చదువుతోందని చెబితే ఎవరూనమ్మరు. క్షణకాలం అతడి మనస్సు విషాదమేఘాక్రాంతమయింది.

'స్టూడియో' లోపలకట్టిన రంగురంగులతెరలు గాలికి రెపరెపలాడుతున్నాయి. నీరెండవచ్చి గోడలమీద పర్చుకుంటోంది. మేడకుదిగువను మస్తాను కుట్టుమిషను నిర్విరామంగా ధ్వనిచేస్తోంది. లాంతరుస్తంభం నిటారుగా నిస్సహాయతగా చూస్తోంది. ఎదురుగా కొబ్బరిమట్టలు వూగుతూ నవ్వుతున్నాయి. ఆకసాన దూదిపింజెలమబ్బులు గుంపులుగుంపులుగా దొర్లుతున్నాయి. వెనుక నీలాకాశం! ఏవేవో పక్షులు అందంగా స్వేచ్ఛగా గగనమండలాన సంచారం చేస్తున్నవి. దిగువను రోడ్డుమీద మనుష్యులు క్రిముల్లా కీటకాల్లా ఏవేవో కొంపలుమునిగిపోతున్నట్లు - యిటూ అటూ ఎటూ చూడకుండా వాహనాలమీద నడకను పరుగులు పెడ్తున్నారు. ఇంతవేగం యింతతొందర యింతభయం అసలు మనుష్యులకి పనికిరాదు. విశ్రాంతిగా తాపీగా జీవించటం నేర్చుకోవాలివాళ్ళు. కాలం ఏదో అమూల్యమైనవస్తువులా భయపడిపోతూ వాడుకుంటారు. ఎవరి దొడ్లోంచేనా రోజాపువ్వులగుత్తులు వీధిలోకి తొంగిచూస్తూంటే ఎంతమంది నిలబడి చూసి ఆనందించి ముందుకు నడుస్తారు? అందమైన సాయంత్రాలు, ఆకాశానమబ్బులు, రాత్రి వెన్నెల.... వీట్లఅందంఎవరుత్రాగుతారు? ఎడతెరపిలేకుండా వాన గుమ్మరించేస్తూంటే కిటికీతలుపులన్నీ వేసుకుని దుప్పటిముసుగుల్లో దాక్కుంటారుకాని వానలోతడుస్తూ వరదల్నీ వాగుల్నీ వానలోతడిసిన మనుష్యుల్నీ చూసి ఎవరు ఆనందిస్తారు? వొక్కరూ - వొక్కరూ లేరు! శాంతి అనేది కళాకారులహృదయాల్లోంచి వెలికివచ్చి

అమృతవాహినిలా సమాజంమీదకు స్రవించవలసినదే. ఈ రసమయ ప్రపంచంలో సౌందర్యానుభూతుల్ని పొందలేక మనుష్యులు గిచ్చుకుని రక్కుకుని అర్థరహితమైన జీవితాన్ని యీడుస్తున్నారు. ఇవేవీ సూర్య నారాయణ అభిప్రాయాలుకావు. పరిస్థితులు మారుతున్నకొద్దీ యితరుల అభిప్రాయాలు తనకు నచ్చినవి తనవిగానే వాడుకుంటాడు. సూర్యనారా యణ జీవితంలో వచ్చిన వృత్తినలన్నీ యీకకమైనవే.

ఆ సాయంత్రం సూర్యనారాయణ స్టూడియోని చాలా జాగ్రత్తగా అలంకరించాడు. పూలతొట్లలో నీళ్ళుపోసి మంచిమంచి రోజాపూల గుత్తులు క్రోటన్సు ఆకులు మెట్టతామరపూలు తెచ్చిపుంచాడు. కెంపు నీలం పెద్దచారలపట్టీల జంబుఖానాలతో నేలంతా కప్పాడు. కొన్ని సోఫాలు, కుర్చీలు ఏర్పాటుగా దర్జాగా లోపల వేయించాడు. టైలరు షాపులో కాజాలు బొత్తాములు కుట్టే కుర్రవాళ్లలో వొకడ్ని స్టూడియోలో కుర్ర వాడుగా కాస్త అటూయిటూ తిరగడానికి నెలజీతంమీద మాట్లాడి వుంచాడు. ఏమంత ఆర్భాటంలేకుండా చిన్న అల్పాహారవిందు....యిష్టా గోష్టి....కాస్త నలుగురుమిత్రులూ చూసి మెచ్చుకుంటే ముందుముందు పని బాగా తగలవచ్చు!

స్టూడియోకుర్రాడు పరుగెత్తుకుంటూ వచ్చాడు - ఎవరోవచ్చారు రిక్షాకు డబ్బులివ్వమంటున్నారని. సూర్యనారాయణ ఆదరాబాదరా క్రిందకు దిగివెళ్ళాడు. మస్తాను కుట్టుమిషను ఆపుచేసి సందేహాస్పదంగా ఆ రిక్షా దిగిన అసామీకేసి చూస్తున్నాడు.

సూర్యనారాయణ 'మాస్టారూ' అని గావుకేకపెట్టి లాల్చీపక్క జేబు లోంచి గుప్పెడతో గుప్పెడు చిల్లరడబ్బుల్ని పైకితీసి 'నేను నిజంగా చాలాఅదృష్టవంతుడ్ని! మీరెట్లాప్రత్యక్షమయారు? మాస్టారూ, యివాళ మీరు రావటం నిజంగా చాలా గొప్పవిషయం! ఆ సామాన్ను అట్లా పుంచండి పదండి పైకి పోదాం—' ఆ సంతోషంలో చిల్లరడబ్బులన్నీ స్టూడియోకుర్రాడి చేతుల్లోపోసేసి మాస్టారి రెండుచేతులూ దొరకపుచ్చు కున్నాడు ఆవేశంతో.

ఈ ఆకాశంనుండి వూడిపడ్డట్లు వచ్చిన అతిథి మూడ్డానికి అప్పుడే హాస్పిటలునుండి విడుదలైన రోగిగానో జైలునుండి బయట ప్రపంచం లోనికడుగిడుతున్న ఖైదీలానో చూసేవారికి క్రొత్తగా అపోహల్ని కలిగించవచ్చు.

బట్టతల, మాసినగడ్డం, అంతకన్నామాసిన ఖద్దరులాల్చీ, పంచె— పొట్టిగా కుదుమట్టంగావున్నా ప్రయాణమో మరేబడలికచేతో మనిషి తాత్కాలికంగా కొంత బలహీనంగా వున్నట్లు తెలుస్తోంది.

ఆ వ్యక్తిని హఠాత్తుగా చూసినవారికి ఏ ప్రత్యేకతా గోచరించక పోయినా ఆ గుండ్రటిముఖంలో 'సోక్రటీసు'ను జ్ఞాపకంచేసేవి ముఖ్యంగా ఆవే....ఆయనచూపులు.

రిక్షావాడుగాని కూలివాడుగాని ఆయన సామాన్ను మీదకు చేర వెయ్యటానికి ఆయన వప్పుకోలేదు.

'నేను తెస్తాను మేస్టారూ, మీరు పైకి నడవండి.' అంటూ సూర్యనారాయణ రెండుమూడుసంచుల్ని ఎత్తబోయాడు. ఆసామాన్ను చేరవెయ్యటంలో తప్పకుండా ఏదో ప్రమాదం జరిగితీరుతుందనేటంత అపోహతో ఆయన నిలబడిపోయారు. స్టూడియోకుర్రాడు రిక్షాలోంచి దింపిన గ్రామఫోను పెట్టెను నెత్తికెత్తుకొని, ముందు సరాసరి పైకె వెళ్లిపోయాడు. 'మాస్టారూ, నే నేం ఆషాఢభూతి ననుకొంటున్నారా?' అన్నాడు నవ్వుతూ, సూర్యనారాయణ. ఆయన గ్రామఫోనురికార్డులున్న చెక్కపెట్టెను పదిలంగా పట్టుకుని 'జాగ్రత్త సంచుల్ని మెట్లకుతగిలించేవు-'అని కొంచెం తీవ్రంగానే అన్నారు.

''నాకు తెలుసుగదండి—' అని అనునయంగానే అన్నాడు సూర్యనారాయణ.

'ఆహా!' అంటూ కాళ్ళను పట్టుకుంటూ యీ అపరిచిత వృద్ధ మూర్తి మేడమెట్లను ఎక్కుతూన్నప్పుడు మిషనుకొట్టు మస్తాను విస్తు బోయి శిలాప్రతిమలా నోరు తెరుచుకొని ఆ మాసిన సంచుల్లోని అమూల్య సంపద ఏమైయుండొచ్చునా అని ఎంతో ఆశ్చర్యంతో సందేహింప సాగాడు.

ఆయన డాబామీద క్రోటన్సుమొక్కల ఆకుల్ని స్పృశించి నిశితంగా గంభీరంగా యిలాగన్నారు - 'చూడునాయనా, చూడు, యీరంగుల్లోని వైవిధ్యాల్ని! వీటిని ఏ చిత్రకారుడు కుంచెతో విదల్చాడోకాస్తకనిపెట్టు. ఈఆకుల్లో అంతర్వాహినిగా మలిచిన పసుపు ఎరుపు నీలం రంగుల్ని చూడు. ఈవర్ణవిభేదాలు యింత స్పష్టంగా నగ్నంగా ప్రకృతిలో మలిచినచోట్లు మనకి మరెక్కడా కానరావు.

ఆయన క్రోటన్సుఆకుల్ని దీక్షగా తదాత్మ్యంచెంది పరిశీలిస్తున్నారు. నీరెండకాస్తోంది. కొబ్బరిమట్టల గుబుర్లోంచి గుత్తులు గుత్తులుగా బొండాలు సూర్యుడితో దోబూచులాడుతున్న దృశ్యం! ఆ ఆకులు మిదుటుగా ఎవరో శిరోజాల్ని ఎండలో ఆరబెట్టుకుంటూ అరచేతుల్తో రొమ్ముల్ని దాచుకుంటున్నట్లుగావుంది.

ఆయన ఒక సంచీని తెచ్చి నెమ్మదిగా క్రింద చాపమీద బోర్లించారు. 'ఇవేమిటి?' అంటూ సూర్యనారాయణ ప్రశ్నార్థకంగా గుట్టగా పోసిన రాళ్ళ వంక నిస్తుబోయి చూశాడు.

ఆయన మునివేళ్లతో ఆప్యాయంగా వాటినిస్పృశిస్తూ - ఇవిరెండేళ్లు నిద్రాహారాలుమాని సేకరించాను నాయనా! మీకు కళ్లులేవు. నడుస్తూ కాళ్ల కడ్డంతగిలితే చిరాకుపడి విసిరిపారేస్తారు. ఈరాళ్లు సన్ను చూస్తే పలకరిస్తాయి. అందమైన వస్తువుల్ని కనుక్కోవటానికి నింత నిశితమైనదృష్టి కావాలి? ఇందులో ప్రతిచిన్నరాతిముక్కకు వున్న చరిత్ర చెబితే నువ్వు విస్తుబోతావు. ఆవంపులు ఆకోతలు ఆ పొరలు వాట్లలోనిరంగులు.... వీటిని ప్రోగుచేయడానికి గనులవెంబడి నదీలోయల్లోను, సెలయేరులుయింకిన చోట్లల్లో, యిరుకైనకాలిబాటల్లో వొళ్లంతా కళ్లుబెట్టుకుని తిరిగానెనుకో. రైలు కట్టలవెంబడిని మైళ్లదూరం కావలసిన ఆకారంలో రాతిని పోల్చుకుని పట్టుగోవడంకోసం ఎంతశ్రమపడ్డానని-' అందులో ఒక చిన్న తాయినితీసి పోల్చుగోమని సూర్యనారాయణకు చూపించారు.

'అరె! ఇది అచ్చం పచ్చిచెక్కను నిలువుగా కోసినట్లుగానేవుందే!' ఒక సగంకోసిన పచ్చిచెక్కనుకూడా ఆయన భద్రంగా ఆచిన్నతాయితో బాటు తీసిచూపించారు. చాలాచిత్రంగా వుంది. ఆతరువాత ఆయన స్థూలంగా

అందులోని ప్రతిపనికిరాని గులకరాళ్ళముక్కలుగా కనిపిస్తున్నవాటిని చూపిస్తూ - 'సృష్టి చాలా చమత్కారమైన రహస్యాల్ని అమూల్యమైన నిధుల్ని తన గర్భంలో ఎట్లా యిముడ్చుకుందో చూడు. ఈపొరలు చూశావా, యీమధ్యలో స్ఫటికాకృతిలో వున్న గోరంతముక్క పనివాళ్ళ పొరల్ని చెరిపాక చక్కగా మెరిసిపోతూ మిలమిలలాడే నీలంరాయి నీకు తయారవుతుంది. కొన్నిరాళ్ళల్లో చుక్కలున్నాయి, యివి వేరు. వజ్రాలు కెంపులు మణులు అవన్నీయివే! వాటి మూలస్వరూపం కనుక్కుంటే 'వోస్ యింతేనా' అంటావు. ఏదైనా సానబట్టాకనే....! గాజును మీరు యిసుకలోంచి తయారుచేసుకుంటున్నారు. దానంతట అదే తాయి గాజును తనలో దాచుకుంటుంది చూడు, యిందులోంచి దృష్టి ఎల్లా బైటకువెళ్తుందో! దానికి.... గుండె లేదంటారు మీరు, ఆయన కొంచెం నవ్వారు గాజురాయిని చూడమని సూర్యనారాయణకిస్తూ. అతడు ఎండలోకి వెళ్ళి కంటిముందు ఆ చిన్నగాజును పెట్టుకుని ఒక కన్నుమూసి తెరిచేలోగా, ఎదురుగుండా ఆగాజుపలకల్లోంచి మిలమిలలాడ్తూన్న నీలంచీరకట్టుకున్న స్త్రీయొక్క అనేకమూర్తులు కదుల్తూకదుల్తూ మీదకురావటం చూసిన సూర్యనారాయణ చప్పున చేతిని కండ్లవద్దనుంచి తీసేసి 'రా-రా-నువ్వా మీరా....' అంటూ ఆహ్వానించాడు,

'అదేవిటి మాస్టారూ టీపార్టీఅన్నారు-స్టూడియో ప్రారంభమన్నారు. ముందు రాళ్ళుపోసుకుని యిక్కడ యేంచేస్తున్నారుబాబూ ?'

'యిష్-' సూర్యనారాయణ ముక్కుమీద వ్రేలేసుకోగానే 'మీరా' నాలిక్కొరుక్కుని తెలతెలబోతూచూసింది.

'మంచిసమయానికే వచ్చావు మీరా-నీతో అప్పుడప్పుడు చెబుతూ వచ్చానే - మా గురువుగారు 'కృష్ణమూర్తి' గారని, వారు వీరే___'

ముందు కుప్పగాపోసుకున్న అమూల్యరత్నాలన్నింటినీ వొత్తిగించిచూస్తూ 'ఎవరమ్మా నువ్వూ -' అని కృష్ణమూర్తిగారు తలెత్తి 'కూర్చోమంటూ' చాపమీద జరిగి చోటు యిచ్చారు.

'ఈ అమ్మాయి ప్రకృతిచిత్రాలు వ్రాస్తుందండీ!' అంటూ సూర్యనారాయణ 'చాలాకష్టపడి'నేర్చుకుందండీ, స్టూడియోపెట్టమని ప్రోత్సాహ

పరచిందికూడా మీరాయే—'

మీరా నవ్వింది.

'మీరు చిన్నచిన్నరాళ్ళను ప్రోగుచేసుకుని కూర్చుంటే పూ మీరా పెద్దపెద్ద బండరాళ్ళనే మోసుకొస్తుంది.' అన్నాడు సూర్యనారాయణ.

మీరా కొంచెం అభిమానంతో 'మీరు భాగీరథిగారి చిత్రాలు చూశారా, లండన్ ఆర్టుగాలరీలోకికూడా వెళ్ళాయి. పారిస్‌లో జరిగిన చిత్ర కళాప్రదర్శనంలోకూడా భాగీరథిగారి బొమ్మలు ప్రదర్శింపబడ్డాయి.లార్డు రిన్‌లిత్‌గో కూడా స్వదేశానికి వెళ్ళిపోతూ భాగీరథిగారి బొమ్మలు కొనుక్కు-వెళ్ళాడు. పాశ్చాత్యకళాప్రపంచంలో ప్రకృతిచిత్రాలకు భారత దేశం నుండి ప్రాతినిధ్యం వహించగల ఏకైకభారతీయ చిత్రకారుడు ఆయనే. తెలుగువాడై పుట్టడం నిజంగా ఆయన దురదృష్టం. దీపశిఖ తన్నుతాను దహించుకుంటూ జాజ్వల్యమానంగా ప్రకాశించినట్లే - ఆలనా పాలనా మన్ననా మెచ్చుకోలు లేకుండానే భాగీరథిగారు ప్రకృతి చిత్ర రచనావ్యాసంగంతో జీవితం ధారపోశారు. ఆబొమ్మలు అక్కడా అక్కడా మహారాజుల దర్బారుల్లోనూ గొప్పగొప్ప భవంతుల్లో గోడల్ని అలంకరించివున్నాయి. ఆయన మంచిమంచి చిత్రాలు ప్రచారంలోకి రానేలేదు. తెలుగువాళ్లు నిజంగా అదృష్టహీనులు. ఆంధ్రదేశంలో చెప్పుకోతగ్గ మ్యూజియం, గ్రంథాలయంకూడా లేవు. అస్సలటువంటి ప్రయత్నాలే మనవాళ్ళు చెయ్యరు.'

'పురంలేందే అంతఃపురం ఎక్కడ్నుంచి వస్తుంది? చెప్పుకోతగ్గ కలకత్తా'వంటి మహానగరమే మనకుంటే - పత్రికలు ప్రెస్సులు రంగస్థలాలు కళాకేంద్రాలు ఎన్నిఆటలేనాఆడవచ్చు ! ఎంతమందినైనా పోషించవచ్చు ! మద్రాసునుంచిపొమ్మన్నా పోకుండాపట్టుకువ్రేలాడుతున్నారు మనపత్రికలు, స్టూడియోలు, కళాకారులంతా! ఈవ్యాసంగమంతా దేశంనడిబొడ్డులో తెలుగునాటజరిగే ప్రాప్తి మనకుంటేగా? జాతీయమైన సంస్కృతితో, అభిమానపూర్వకమైనసంబంధాన్ని కళల్తోకలిగించుకోలేకపోతున్నాం.మన వూళ్ళల్లో ఏటా చిత్రకళాప్రదర్శనాలు జరగవు. ఎవరూ బొమ్మల్ని చూడరు, బొమ్మల్ని కొనరు. మన సాంప్రదాయాలు ఎట్లాగ నిలబడేది?'

కృష్ణమూర్తిగారు 'నేషనల్ స్టూడియో - అన్న బోర్డు కట్టావుగా? యిహ ఆ సాంప్రదాయాలన్నీ నిలబెట్టి వంట వండించవండి యీ అమ్మా యీను సుప్పాను. నాకు తెలుసుగా నువ్వు పట్టి ఆవేశాల పుట్టవి. ఈ అమ్మాయి ఆ భాగీరథిగార్ని పట్టుకుని నాలుగు గీతలన్నా గీస్తుంది - నువ్వు నీ కెమేరా మెడకు తగుల్చుకుని పోయి యే సినిమాల్లోనన్నా మారు. నిన్ను నమ్ముకున్నవాళ్ళన్నా కలో గంజో నాలుగు మెతుకులు తింటారు. రికోప్రెస్సు పెట్టుకొని, నాలుగు సినిమా బేనర్లు పోస్టర్లు రాసుకుంటున్నా పదిరాళ్ళు వచ్చి చేతిలో వ్రాల్తాయి, కళకోసం గంతువెయ్యమని ఎవరు చెప్పారు నీకు?'

సూర్యనారాయణ ఆవేశంగా 'ఈ రాజకీయాల పంకం తుడిచేసుకుంటేకాని మన కళలూ సాంప్రదాయాలు నిలబడవండి మేస్టారు!'

'సామాజిక వ్యవస్థా - స్వరూపాలు మార్చివేస్తా మంటున్నారు పెద్దలు - రాజకీయాలు బురదంటా వెల్లాగోయి?'

'మనం బ్రతకటంకోసం వృత్తులూ పరిశ్రమలూ వుద్యోగాలూ ఎంతముఖ్యమో, మన జాతీయమైన కళల్నూ సాంప్రదాయాల్నూ సాహిత్యాన్ని నిలబెట్టుకోవడంకూడా అంతే ముఖ్యం. ఈ ప్రజాస్వామికంలో కళలకీ సాహిత్యానికి ఘోరమైన దగా జరుగుతూందేమో నని భయంగా వుంది మేస్టారూ!'

కృష్ణమూర్తిగారు కొంచెం నవ్వి యిలా గన్నారు—

'ఒకమాటు నేను రోడ్లమీద హార్మని వాయిస్తూ డబ్బులు అడుక్కునే ముష్టివాళ్లను కలిశాను. అందులో ఒక నడివయస్సు - స్త్రీ, ఒక కుర్రాడు, చిన్న పదేళ్ల అమ్మాయి. ఆ కుటుంబ యజమానికి నలభై ఏళ్ళుండచ్చు. ఆ అమ్మాయి అబ్బాయి ఆ స్త్రీ వాళ్ళు ముగ్గురూ చాలా అద్భుతంగా పాడుతున్నారు. ఆ పెద్దతను మెళ్ళో హార్మనీ కట్టుకున్నాడు. ప్రతి యింటిదగ్గర వీధుల్లోను బజారుల్లో కొట్లదగ్గిర నిలబడి వాళ్ళు పాటలు పాడి డబ్బులు ప్రోగుచేసుకుంటున్నారు. నేను వాళ్ళను చూచి అనవసరంగా జాలిపడ్డాను. ఆ పాటలో వున్న మాధుర్యాని కంతా కారణం ఆ కడుపు గడవకపోవటమే నని అప్పట్లో నాకు తెలీదు - నేను వాళ్ళను

ప్రతిమాఱి నా యింటికి తెచ్చుకుని మేపాను. మరో కోతిపనికూడా చేశాను — శాస్త్రకట్టున సంగీతం అలవాటు చెయ్యాలని ఒక పంది తుప్పి కాళ్ళు కడుపులూ పట్టుకుని రహస్యంగా యింటికి రప్పించి చెప్పించి చూశాను, తరువాత వాళ్ళసలు పాడ్డమే తగ్గిపోయింది. పాడినా ఆ ఆకలి పలికించిన మాధుర్యం గొంతుల్లోంచి ఆరి చక్కాపో యినట్లయింది. ఒకమాటు నేను రెండురోజులు పనుండి పొరుగూరువెళ్ళి వచ్చేసరికి వాళ్ళంతా పుడాయించేశారు.'

'మీరా-"వుత్తినే వెళ్ళిపోయారా గుర్తుగా యేమన్నా స్మృతిచిహ్నం వదిలేసి వెళ్లారా?" అంది.'

'నీ కుంటిప్రశ్నలకేంలేగాని మాస్టారికి నీ బొమ్మలు చూపిస్తావా లేదా ?'

మీరా లేచి స్టూడియోగదిలోకి నడిచింది,

'ఇవి రెండూ భాగీరధిగారి చిత్రాలు ....'

ద్వారానికి ప్రక్కగా గుమ్మంలో నిలబడి చూస్తే ,—

ఒక పెద్ద ఫ్రేముకట్టిన చిత్రం - అందులో ఒకే పెద్ద కొండరాయి క్లోజప్పులో చిత్రింపబడి వుంది. వేసుకున్న స్కెచ్చి ప్రకారం ఆ చిత్రంలో ఆకాశం అంటే భూమి చాలా తక్కువ. దిగువను చిన్నచిన్న రాళ్ళు ముదురు ఆకుపచ్చ నలుపువిరగావచ్చిన నీలిమ రూపంలోగల తారతమ్యాన్ని చెబ్తూండగా - చిత్రకారుడు తీసుకున్న సమయం వుదయపు లేయెండ, చుట్టూ శూన్యాకాశం. ఎండ లేతగా ప్రసరిస్తుంచే వొంటరిగా దిగులుగా ఏకాకిగా ఆ రాయి ఒక్కటీ కాలంలోకి నిలబడి చూస్తోంది. దిగువన బాగా ముదురు నీలం నలుపు వాడుతూ పోనుపోను ఎండకు వప్పగించబడ్డ భాగాల్లో ఎరుపులోంచి పొరలు పొరలుగా తేలిపోయింది.

'ముదురాకుపచ్చ - ఎరుపు యివి భాగీరధిగారికి చాలా యిష్టమైన రంగులు', కృష్ణమూర్తిగారు చాలాసేపు నిలబడి అదే రాయిని తదేక ధ్యానంతో చూసి- 'చాలా తాత్విక దృష్టి కావాలి నాయనా యీ బొమ్మల్లోని ఆత్మను దర్శించగలిగేటందుకు.'

రెండవబొమ్మ కిటికీ కెదురుగానున్నగోడకు తగిలించబడి వుంది. ఆ చిత్రంలో ఆకాశం లేదు. ఒకపెద్ద మర్రిచెట్టుయొక్క మ్రాను. బొమ్మంతా ముదురు ఆకుపచ్చ నలుపు - ఆ మ్రానంతా వూడల్తో జీబూతంలా వుంది. ఆ వూడ లొక పెద్దసైజురాయిని కౌగలించుకొంటున్నాయి. ఆబొమ్మంతా ఆక్రమించుకున్న మ్రాను వూడల సహాయంతో రాతిని ఆలింగనం చేసుకుంటున్న దృశ్యం చాలా మనోహరంగా జిజ్ఞాసాసూచకంగా వుంది. అక్కడ దట్టమైన చీకటి రాతిచుట్టూ పెనవేసుకుంటున్నట్లనిపిస్తుంది. కాని చిత్రంలో సమయం చెప్పలేదు. ఆ బొమ్మలో ముదురాకుపచ్చ నలుపు ఎరుపు పీట్ల వైవిధ్యం చక్కగా చూడొచ్చు, భావం చాలా కఠినంగా వుంది. రచనలో గొప్ప పట్టుదల కనిపిస్తోంది.

కృష్ణమూర్తిగారు తరువాత యేమీ మాట్లాడలేదు. సూర్యనారాయణ గ్రామఫోనుతెచ్చి స్టూలుమీద పెట్టాడు. సైగలు దేవదాసులో పాడిన 'దుఃఖకే-' అన్న పాట వింటూ ముగ్గురూ చిత్రప్రతిమల్లా నిలబడిపోయారు.

ఈ వాళ భాగీరథిగారు లేరు. ఈ వాళ సైగలు లేడు. ఇద్దరూ తలవంచుకొని శలవంటూ యీ లోకాన్ని వదలి వెళ్ళిపోయారు. ప్రపంచంలో ఎవరికీ పాడేహక్కు లేదు యిక.

పొగమంచు, సూర్యాస్తమయం, సూర్యోదయం, రాళ్లు - రప్పలు, చెట్లూ పొదలూ, ఆకాశం .... యీ ప్రకృతియొక్క మహాసౌందర్యాన్ని ఆత్మని శోధించి చెప్పే చిత్రకారుడికుంచె శ్మశానంలో మంటల్లో ఆకలితో దారిద్ర్యంలో చీకట్లో మాయమయింది.

ఒక్క ద్వేషమే మహాత్ముడ్ని హత్య చేసింది. ఈ సామాజిక వ్యవస్థ అనేకమంది ఋషితుల్యుల్ని పొట్టను బెట్టుకుంది.



# 2

స్టూడియోలోకి క్రమంగా సూర్యనారాయణమిత్రబృందం చేరు కొనేలోగానే కృష్ణమూర్తిగారు లేచారు 'అనవసరంగా నన్నందరికీ పరిచయంచేసి నాప్రాణాలు వేధించకు. నాకు ఏకాంతంకావాలి.' అంటూ—

మీరాకూడా లేచి 'పదండి మేస్టారూ - మాయింటికిపోదాం. అక్కడ మీ ఏకాంతాన్ని ఎవ్వరూ భగ్నంచెయ్యరు.'

కృష్ణమూర్తిగారు సాలోచనగా 'నాగ్రామఫోను....'

సూర్యనారాయణ అందుకుంటూ 'ఆ సైగలు రికార్డులు, యీ ఊళ్ళసంచులు అవి ఆయనకూడా వుండవలిసిందే.'

'మీకిష్టమైనన్నాళ్ళు మీరు మాయింట్లో వుండిపోండి మాస్టారూ. మీ ఏకాంతానికి యేమీ అడ్డురాకుండా చూసే పూచీ నాది.'

సూర్యనారాయణ మెట్లదగ్గరకువెళ్ళి మస్తానుకొట్లో కుర్రవాడ్ని పిలిచాడు. ముందు గ్రామఫోను నెత్తినబెట్టుకున్న కుర్రాడు, సైగలు రికార్డులు చంకన బెట్టుకుని కృష్ణమూర్తిగారు, ఆవెనుక సంచుల్నిపట్టుకుని 'మీరా' ముగ్గురూ వీధిలోకొచ్చారు.

ప్రారంభోత్సవానికి కృష్ణమూర్తిగారు ఎల్లానూ వుండరని సూర్యనారాయణకు తెలుసు. మీరాకూడా వెళ్ళిపోతున్నందుకు అతను లోపల కొంచెం వెలితిపడ్డాడు. ఒక అమూల్యమైన నిధిని సంపాయించుకున్న దానిలా 'మీరా' మురిసిపోవటం అతను గమనించకపోలేదు. చీకటి మసగమసగ్గా వుంది. రోడ్డుమీద అల్లంతదూరం సాగనంపుతూ 'మాస్టారు జాగ్రత్తసుమా!' అని మీరాకు అస్పష్టంగా చెప్పాడు. ఆ అమ్మాయి ఒక మందహాసం పారేసింది. క్రమ్ముకొస్తూన్న నిరుత్సాహాన్ని నెట్టుకుంటూ గబగబా మేడమెట్లు ఎక్కాసాగాడు.

పైన జండాకొయ్యలా నిలబడి 'శాస్త్రి' యేదో దడదడా వాగేస్తున్నాడు.

ప్రసాదరావు బోనులోముద్దాయిలా నిలబడి వింటున్నాడు చెవుల ప్పగించి,

'హారే అమ్మాయీ, విను! నీ మంచికోసం చెబుతున్నాను. నువ్వేదో కవిననుకొని అప్పుడే అల్లాగ్రుడ్లెర్ర చెయ్యకు. నీనాటకం ఏహోఅద్భుతంగా రాసేనే అనుకో. నువ్వేం జార్జిబెర్నాడ్‌షా పుత్రా! నీనాటకంయొక్క గొప్పంతా మాకుమట్టుకు రాదూ? మార్చాలని ఆ అమ్మాయి పట్టుదల పట్టించి. నీ సొమ్మేంపోయింది? మాటవరసకి నాకేం అభ్యంతరంలేదను కో....కథానాయకివేసే ఆవిడ ఫీలింగ్సు చెబ్బతింటే మనకేంపొరుగుతుంది చెప్పు! నువ్వు ఆ అమ్మాయి జీవితకథనంతా చిలవలూ పలవలూదిద్ది రంగానికెక్కిస్తున్నావని మేమంటామా, అనగలమూ? కథన్నవాడు ఎవరి జీవితంలోంచి యేమీతీసుకోకుండా నాటకం ఎల్లా అఘోరిస్తాడు చెప్పు! యాదృచ్ఛికంగా కొన్ని సంఘటనలు సరిపోలవచ్చు. కేసంటా హైకోర్టు దాకెళ్ళినా తీర్పు నీపక్షమే, కాని నా అనుమానంఎక్కడంటే....మన నాటకం చూసే సజ్జంతా నీ అమోఘరచనాపాటవంచేత మాకు పుచితరీతి సత్కారం చేస్తారేమోనని. మేం నీకు పూలదండలు అవీ వేసి పూరేగిద్దామనుకుంటూంటే నువ్వు అప్పుడే నిజమైన కవిలా మొరాయిం చటం ఆరంభించి మమ్మల్ని ఆశ్చర్యచకితుల్ని చేసి పారేస్తున్నావు. రిహార్సల్సువేసి పోస్టర్లు అంటించి కరపత్రాలు పంచిపెట్టాక టిక్కట్లు అంటగట్టాక మేమంతా నువ్విట్లా మొండికేస్తే యేగంగలో దూకం?'

'హారే అబ్బీ, అద్వాన్నపుచ్చుకున్నాకనాటకంలో వేషంవేయడానికి వొప్పుకున్న మనిషి ఆఖరుసీను అల్లావుంటే వెయ్యను, మార్చాలి అనంటే కథన్నవాడు ఎందులోనన్నా పురికి చచ్చిపోవాలంటాను. కిరాయికి వేషాలువేసేవాళ్ళదగ్గర్నుంచి స్క్రిప్టు సంస్కరిస్తూ కూర్చుంటే కథన్న వాడు యిహ బ్రతకాలా?'

'ఛప్, నోరుముయ్యవోయ్ నాన్నా! ఆ అమ్మాయి తనమీదే నువ్వు నాటకం వ్రాశావనీ మేమంతా ఆడిస్తున్నామనీ అనుకుంటోంది. ఆడపిల్ల, కష్టపడి నాటకాల్లో వేషాలేసి పొట్టగడుపుకుంటోంది. దీను

రాలు! ఆఅమ్మాయి ఫీలింగ్సు మనం ఎందుకు నొప్పించాలని నీకుండొద్దుట్రా? అహా....నాటకం గొప్పగా వ్రాశావే అనుకో, అందుకు మేమంతా నిన్ను మోసెయ్యటంలేమా అందలానికి ఎత్తి! ఆ ఆఖరుసీను ఏవ్వంత మారిస్తే నీపుట్టి యేంమునిగిపోదులెద్దూ?'

'నాటకం అంతా అఖరుసీనుమీద ఆధారపడివుంది. నేను చెప్ప దలచిందికూడా అక్కడ ఆ అమ్మాయి అల్లానటించాలనే....యిప్పుడు నాకు బావులేదు....మూర్ఖమంటే నాకేంమొహమాటం? నా నాటకం మీరెవరూ అసలు వెయ్యనక్కర్లేదు.'

'చాలాసంతోషించాం, పీపులు మావి చెక్కేస్తారు బయట. నీకింత జాలిలేదేవిట్రా; ఆడకూతురు కంటతడిచేసుకుని అడిగిందనైనా నీగుండె కరగకపోవాలా?'

తన ఫొటోస్టూడియోకి ప్రారంభోత్సవానికంటూవచ్చి అదేమంత ముఖ్యవిషయంకానట్టు లోకవ్యవహారాలన్నీ చర్చించుకోవటం తృప్తి కరంగాలేని సూర్యనారాయణ - 'మీరెందుకోయ్ జుట్టూజుట్టూపట్టుకుం టారు? అస్సలు 'మీరా' మీనాటకంలో వేషంవెయ్యదు. అక్కడికిహ సరా? ప్రస్తుతానికి వద్దాం....'

'కొంపమునిగిందే! - ఏపటీ? రానీ కనుక్కుందాం.' అని షేక్స్పి యరు మొహంవేసిన శాస్త్రి 'ఈతంటా నువ్వే తెచ్చిపెట్టావు చూశావా?' అన్నట్లు సవాల్‌చేసే చూపుల్తో ప్రసాదరావుని కొరకొరా చూశాడు.

'పాతికరూపాయలు అడ్వాన్సు తీసుకునికూడా నాటకంలో వేషం వెయ్యనంటుందా?' ప్రసాదరావు శాస్త్రికి రాబోయే కోపాన్నంతా 'మీరా' వైపు మళ్లించాలని ప్రయత్నించాడు.

'అసలు ఆడవేషం ఎందుకోయ్ నీ నాటకంలో? ఆ యేడిచేదేదో మగవాళ్ళతో సరిపోకుండా నీకో కథానాయకి కావలిసొచ్చిందాయె. కథా నాయకితో పాట్లుపడలేంరా అని మొత్తుకున్నా వినకుండా నాటకం రాసి పారేశ్నావు.'

ప్రసాదరావు వోరిమినంతా కోల్పోతూ - 'యేడ్చావులేవోయ్. నీమాటలు వింటే జ్ఞానమున్నవాడెవడూ హర్షించడు. కథానాయికలేనిదా లేకుండా నాటకం వుండాలని శాసించడానికి నువ్వెవరవంట? డబ్బు పుచ్చుకుని కిరాయికి నాటకాల్లో వేషంవెయ్యాల్సిన ఆడదాన్ని లొంగదీసుకోలేనివాడు డైరక్టరట - పెద్ద డైరక్టరు!'

సూర్యనారాయణ తగూతీర్చేవాడిలా మీరెందుకోయ్ అనవసరంగా కీచులాడుకుంటారు? 'మీరా' మీ నాటకంలో వేషంవెయ్యదు. డబ్బు వాపసు యిచ్చేస్తానంది.'

'డబ్బు వాపసు యిచ్చేస్తానందీ? నాటకంలో వేషం వెయ్యదూ?' యింకా పిసరంత అనుమానం లోపల పెట్టుకునే ప్రసాదరావు 'హా చంద్రమతీ!' అని చతికిలపడ్డాడు స్టూడియో జంబుఖానామీద.

శాస్త్రి సూర్యనారాయణకేసి సందేహాస్పదంగా చూస్తూ - చెప్పవోయ్ మిత్రమా — మేం అట్లా ఆడదానికియిచ్చిన డబ్బు వాపసుతీసుకునేటంత చవకరకం కళాకారులంకాదు. కళకోసం మావాడు బియ్యే పాస్ట్రీ మింగలబెట్టాడు. కళకోసం నేను యావజ్జీవబ్రహ్మచర్యవ్రతం అవలంబించా పుక్కుమూసుకుని. చివరకు కళకోసం నువ్వు పొలమూ పుట్రా అమ్మి యీ స్టూడియో ప్రారంభించావు. అన్నట్లు యివాళ ప్రారంభోత్సవంకదూ? మరిహా! జపంవిడిచి రొట్టల్లోపడ్డట్టున్నాం! ఏరోయ్ మిగతా వాళ్లంతా? మన హీరోయావయినట్టు? అసలు ముద్దాయి మీరా యేదీ? టీ, ఫలహారాల వాసన యేమూలనుంచీ కొట్టటంలేదే?'

'మీరావచ్చింది, వెళ్ళిపోయింది.'

శాస్త్రి అభినయిస్తూ-వచ్చింది- 'వెళ్ళిపోయింది. ఈ వాక్యంలో కర్త వుందిగాని కర్మలేదు. ఎక్కడకు ఎప్పుడు, ఎందుకు వెళ్లింది? ఏవయ్యా సూర్యనారాయణా, కర్తా కర్మాలేకుండా మాట్లాడతావేవయ్యా? గొప్ప నవ్వేన్నా!'

'నస్పెన్సేవిటోయ్ నీమొహం! నాటకం ఆడకుండానే కథానాయకి నాటకంలోంచి చెప్పకుండా చెయ్యకుండా నిష్క్రమించేసింది. ఇది ట్రాజిడీ!' సూర్యనారాయణ నవ్వుతూ ప్రసాదరావుకేసి చూశాడు.

'నానాటకం ట్రాజిడీ కాదు మొర్రో అని నేను గోలెత్తుతున్నా వినిపించుకోరేం?' అన్నాడు ప్రసాదరావు చేరుమాలులో ముఖం వొత్తుకుంటూ.

'మరేవిట్రా! పోస్టర్లు అంటించి కరపత్రాలు పంచిపెట్టి తేదీ పాత్రలు హార్మనీ వాయించేవాడిదగ్గర్నుంచీ పేర్లు ప్రకటించేశాక కథానాయకి లేచిపోతే ట్రాజిడీగాక సుఖాంతమెల్లాగవుతుందిరా నాన్నా!'

ప్రసాదరావు ఆవేశంతో 'నా నాటకం చెక్కుచెదరకుండా వుంది. నా పాత్రలన్నీ అనంతమైన కాలంలో సంచారం చేస్తూంటాయి. నా అభిప్రాయాలు, నేను నిర్మించిన సీనులు....వాటినెవరూ భగ్నంచెయ్యలేరు. ఇప్పుడు నా నాటకానికొచ్చిన ప్రమాదమేమిటి?'

శాస్త్రి - 'హారే - నీలాటి కవులున్నారే - వాళ్ళని నిలువునా కోసినా వాస్తవాన్ని కళ్లముందరజరుగుతున్నదాన్ని గుర్తించలేరు. ఇప్పుడు నిజంగా ప్రమాదమేవచ్చిందని కవన్నవాడ్ని నిన్ను భ్రమింపచెయ్యాల్సిన దురవస్థ నాకు పట్టిందిగనుక చెబ్తున్నావిను. కిరాయికి డబ్బులిచ్చుకుని అంటూ నువ్వేదోవాగుతున్నావు. నాటక రచనలోనూ జీవితంలోనూగూడా నువ్వు వాడే అసందర్భప్రయోగాలతో మేం చస్తున్నాం! జీవితపులోతుపాతులన్నీ పెళ్ళగించి నువ్వు నాటకంరాసిపారేస్తే, తెలిసిగూడా తనవేషం తాను వెయ్యాటానికి జంకని మరోఅడదాన్ని కళారంగంమీద చూపించు! సఖీతో నభవిష్యతి! నీ డైలాగ్సు ఎంత సూదుల్లాగ్రుచ్చుకొని ఆమెహృదయాన్ని గాయపర్చాయో ఆలోచించు. ఇంత మానసికచిత్రవధ సహించడానికేనా నువ్విచ్చే ముష్టియాభైరూపాలు పుచ్చుకుని రంగం మీదకువచ్చి పాత్రపోషణచెయ్యాల్సింది? కలకంఠి కంటకన్నీరొలికిన....

'చాల్చాల్లేవోయ్! ఆపు - అక్కడికిహ. మనసామాజికవ్యవస్థలో జీవితాన్ని అర్థంచేసుకోలేని స్త్రీని, మూర్ఖురాలిని, సంఘటనలద్వారా మార్చి,

ప్రేక్షకులగుండెల్ని ఝువ్వుఝువ్వు మనిపించేట్లుచేసి, ఆపాత్రను అజరామరం చేసిపారేశాను. ఆ విశ్వాసం నాకుంది. ఆపడ్డ శ్రమ కిదంతా ప్రతిఫల మన్నమాట! బుద్ధొచ్చింది! లెంపలేసుకుంటాను!'

'త్వరపడబోకోయ్. ఆ పేపే దేదో ఆ అమ్మాయేవచ్చివాయిస్తుంది.' అన్నాడు శాస్త్రి హాస్యంగా.

ప్రసాదరావు చిర్రుబుర్రుమంటూ కోపంగాలేచి మెట్లపైపు నాలుగడుగులు వేశాడోలేదో - సూర్యనారాయణ - 'రా! రా! శ్రీహరీ - వచ్చాడోయ్, అడుగో, సీహీరో....కాస్తంత తగ్గు!'

శ్రీహరి - 'నమస్కారం ప్రసాదరావుగారూ! రిహార్సిల్సు హాల్లో అంటే అక్కడికెళ్ళాను పెట్రొమాక్సులైటు వెలిగించుకుని. హైదిపైహోస్నని కూలివాడినెత్తిన మోయించుకుని పట్టిగెళ్ళానుకూడా. ఎవ్వరూ ఫికపులేరు. మళ్ళీజ్ఞాపకంవచ్చి మన స్టూడియో ప్రారంభోత్సవంగదాఅని - అట్నుంచి నరుక్కురమన్నారు. మన మీరాదేవిగారెక్కడా ఫికపలేనట్లుందే?'

శాస్త్రి - 'ఆ రిక్షాడబ్బులు, కూలీ, కిరసనాయిలు, అంతా దండుగ! వేస్టు! వేస్టు!'

హీరో జావగారిపోతూ - 'ఇంత వున్నతమైన నాటకకళని యిల్లా రూపాయణా పైసాల్లో లెక్కగట్టి కఠినంగా అపమానపరుస్తున్నారు మాస్టారూ!'

ప్రసాదరావుచిరాకుగావచార్లుచేస్తూ - 'డామిట్! కథ అడ్డంతిరిగింది. మీరాదేవిగారు యాక్టుచెయ్యరు - ట!'

శ్రీహరి పులిక్కిపడిచూశాడు. శాస్త్రి కొబ్బరిమట్టలకేసి నిరాశగా చూస్తూ - 'ఔను! నిజం!' అన్నట్లుగా బుర్ర కాస్త టకాయించాడు. ముగ్గురూ ఎవరి పొజిషనులో వాళ్లు క్షణకాలం నివ్వెరపడిపోయినట్లు నిలుచున్నాక - సూర్యనారాయణ పగలబడినవ్వాడు అట్టహాసంగా.

'వేమూరిగగ్గయ్యలా ఆదేం నవ్వు?'

'మీరా యాక్టుచేస్తుందోయ్, తప్పకుండా...'

'హా !' అన్నారు ముగ్గురూ వొక్కసారి.

'నాటకంలో వేషంవెయ్యనని ఆఅమ్మాయి నాతో అనలేదు.'

'తర్జనినిగాలిలోఆడిస్తూ శాస్త్రి విస్సురుగా మీదకువచ్చి-'నీతో అన లేదూ !'

'అనలేదు !'

'హారి దుర్మార్గుడా !'

ప్రసాదరావు ఏదో స్ఫురించినవాడిలా సూర్యనారాయణకు రెండవ తట్టున నిలబడి 'మరైతే యిప్పుడిక్కడకు ఎందుకురాలేదు ?'

శాస్త్రి 'నువ్వు తెలివైనప్రశ్న అడిగాననుకుంటున్నావుకాబోలు డిటెక్టివ్‌కథలు చదివిన పాపాన పోలేదూ ?'

'వచ్చిందీ, వెళ్లిపోయింది.'

శ్రీహరి మధ్యలో అడ్డంవస్తూ - 'టీపార్టీ అయిపోయిందిగా మోసు.'

'అదిగో పళ్ళీ కర్మేది సూర్యనారాయణా నీ వాక్యంలో! గ్రామర్లో నీకు సున్నాకన్నా ఎక్కువమార్కులు యిచ్చేదిలేదు.' అంటూ దొంక పుచ్చుకున్నాడు శాస్త్రి.

ప్రసాదరావు-'శ్రీహరీ, నువ్వు ట్రాజిక్కుపాత్రలు యాక్టు చెయ్య డంలేదుగాని ప్రాణాలుతోడేస్తున్నావు. టీపార్టీఅయిపోయిందంటావేమిటి?'

సూర్యనారాయణ నవ్వుతూ - 'అదే అఖరుసీను, ఎల్లాగుంది, ట్రాజిడీయా కామిడీయా'?

శాస్త్రి ప్రసాదరావుపీపుమీద బలంగాచరుస్తూ - 'చంపేశావు గదోయ్. నీమాటల్తో'

ప్రసాదరావు చేత్తోశాస్త్రిని పొడుస్తూ 'అది నా పీపని తెలుసా—'

ఛలోక్తులమధ్యలో కుర్రాడు ఫలహారాలు టీ యిచ్చి కిళ్ళీలు పట్టావడానికి క్రిందకుపోయాడు.

శాస్త్రి 'అడుగో అననసరపుపాత్ర! తెరకు కుడివైపునుంచి అసందర్భంగా ప్రవేశించును.'

మస్తాను. గళ్ళలుంగీ, మీసాలుమాత్రం తీసేసి పెంచినగడ్డం, మాట్లాడుతుంటే కనబడే పలుపటుసా.... మెట్లమీంచి వస్తూనే - ఫంతులు గారూ-నాకు వో ఫొటో యేపిస్తారూ?' నవ్వుతూ సినిమాల్లో మాంత్రికుడు చెరపడదలుచుకొన్న పతివ్రతమీదకు వస్తూన్నట్లు దగ్గరకు రాసాగాడు.

'వహిలేబోణీ - పంచెకళ్యాణీ!' శాస్త్రిలడ్డుండ నోట్లోతురుముతూ అరిచాడు శాయశక్తులా.

ప్రసాదరావు పోయినపార్టు 'త్రీ' విజ్ఞానంతో- 'కానేవాడు మహారాజు' అని సన్నసన్నగా గొణిగాడు.

సూర్యనారాయణ ఫ్లాషువేసి,కర్టెనులాగి, కెమేరాని ముందుకుతోసి స్టూలుమీద బనీను గళ్ళలుంగిలో 'మస్తాను' బైఠాయించగా 'ఏదీ వొకచిరునవ్వు, వన్-టూ-త్రీ అంటూ స్విచ్చి నొక్కాడు హాహాకారాలమధ్య.

# 3

రాజబాటకు దూరంగా, జనసమ్మర్దంలేని ప్రదేశంలో ప్రశాంతంగా, ఆశయాల మనోహరాకాశానికి చేరువగా, అనువుగా....జీవిస్తున్నది మీరా. చూపులు నేలకు తగులుతున్న పాకలోకడుగిడుతున్నప్పుడు - కృష్ణమూర్తిగారు నిజంగా 'మీరా' సాహసానికి మనస్సులో అభినందించుకుంటూనే - 'ఒంటరిగా మనిషి జీవించకలగటంతోనే యిహ జీవితంలో ఆ వ్యక్తి కోలుపోయేదంటూ యేమీవుండదమ్మాయీ. ఈ జీవితాన్ని యితరులతో పంచుకోవలసిరావటంతోనే బంధనాలు కష్టనిష్ఠురాలు లాభనష్టాల దేరువాటీ లెక్కలు ఆరంభమవుతాయి.' కృష్ణమూర్తిగారు పాకబయటంతా కలయచూశారు. రకరకాల రోజాపువ్వులు గుత్తులు గుత్తులుగా నవ్వుతూ పలకరిస్తున్నాయి.

మీరా తలుపుతీసి నెట్టుకుంటూ లోపలకడుగుబెట్టి - 'రావచ్చు మాస్టారూ, మీరివాళ నా యింటికి రావటం నాకెంతో సంతోషాన్ని కలిగించింది.

అదివరకే వెలిగించిన హరికెన్‌లాంతరు వెలుగులో మాస్టారి సంచుల్నీ గ్రామఫోను పెట్టెను అక్కడవుంచి కుర్రాడు శలవుదీసుకుని చీకట్లో అంతర్ధానమయ్యాడు.

కృష్ణమూర్తిగారు లోనికడుగుపెడ్తూనే ఆవెలుగులో కుట్టుమిషను నొకదానినిచూసి, తరువాత విశాలంగా నిరాడంబరంగావున్న ఆ గదిలో ఒక చాప, స్టూలు, చిన్న మడతమంచం, ఒకమూల చిన్న బట్టలపెట్టి, యింకా కుట్టుమిషనుకు చేరువగా ఒక తగుమాత్రం చెక్కపెట్టి....పరిశీల నగా చూసిసమీడట ఒకవైపునగోడకు తగిల్చిన, బంగారు సూర్యకిరణాం లాకిడికి మంచులోంచి పిడివడుతూ గోచరిస్తున్న, హిమాలయపర్వతచిత్ర పటంముందు నిలబడిపోయారు. చేత్తో లాంతరుని యెత్తిపట్టుకుని 'ఇది రష్యనుచిత్రకారుడు "రోరిచ్" వ్రాసిన అసలు సుమండీ. ఎవర్నో బ్రతి మాలి ప్రాధేయపడి కొనిపించి తెచ్చుకున్నాను.' మీరా ప్రక్కకు చూపు తూ - 'యీ అస్తమయం' చూడండి. భాగీరధిగారునాకు బహూకరించారు.'

చిత్రంలో ఒక కొండమీద చిన్న పాడుపడ్డ కోటమీదకు చీకటి తరుముకొస్తోంది. ఆకాశం రక్తవర్ణాన్ని కోల్పోతూ నిస్సహాయతగా చీక టితో పెనగులాడుతోంది. బొమ్మలోని వస్తువు అప్రధానమైనా రంగుల ప్రాబల్యం పుష్కలంగావుంది. దిగులు పడిపోయేస్వభావంకలవారిని మరింత దిగులుపర్చేదిగావుంది ఆచిత్రం. "ప్రకృతిచిత్రాలుకూడా గుండెలు విప్పి మాట్లాడలాయని నేననుకోలేదు మీరా."

మీరా సంతోషంతో 'మాస్టారూ యింకోబొమ్మ తెస్తానుచూడండి,: దాని అద్దం పగిలిపోయింది. అందుకని పెట్లోదాచాను.' చెక్కపెట్టిలోని కత్తిరించిన కొత్తబట్టల దొంతులక్రిందనుంచితీసి మరోపటాన్ని కృష్ణ మూర్తిగారికందిస్తూ- 'చూడండి, ఇది కన్యాకుమారిఅగ్రం.'

అక్కడి చెలియలికట్టను సుందరంగా చిత్రించారు భాగీరథిగారు. ఉదయపుటెండలో యిసుక పచ్చగా ఎర్రఎర్రగా మెరిసిపోతోంది. చిన్న చిన్న కెరటాల దొంతులు రాళ్ళను ఢీకొని నురుసులుగ్రక్కుతూ మెల్లగా తిరోగమిస్తున్నాయి. ఆ రాళ్ల గుట్టలుగా చిందరవందరగా యిసుకలోంచి

కనిపిస్తున్నా, అవి సముద్రంలోకంటూ చొరుచుకుపోయాయి. కన్యాకుమారి వద్ద సముద్రతీరాన్ని వుదయాన వీక్షించిన చిత్రకారుడి హృదయం ఎంత పరవశత్వాన్ని పొందిందో ఆబొమ్మ స్పష్టంగా చెప్పగలుగుతోంది. చిత్రానికి మనోహరత్వాన్ని చేకూర్చింది ఆయన ఎంచుకున్న సమయం. ఆరాళ్ళు, యిసుక, ఆ కెరటాల పరవళ్ళు మనోజ్ఞంగా వున్నాయి.

'ఆయన సృష్టిసౌందర్యాన్ని వుపాసనచేసిన మహాతపస్వి. పెళ్లులూ పుట్టలూ అడవులూ కొండలూ తిరిగితిరిగి నీటిరంగుల్తో సుందర మైన దృశ్యాల్ని చిత్రించి సామాన్యులకు సహితం అద్వితీయమైన ఆనం దాన్ని కళాభిరుచినీ కలిగించేందుకు జీవితం ధారపోశారు. మనకి స్వాతం త్ర్యం వచ్చాక దుర్భరదారిద్ర్యంతో అనారోగ్యంతో అకాలమృత్యువు వాతపడ్డ మహాపురుషుడు. యుద్ధంలో సైనికులు మరణిస్తారు. సామ్రాజ్య కాంక్ష, రాజకీయాలు, వీట్లలో జయాపజయాలు మానవసమాజానికి నాగరి కతకూ సంస్కృతికీ కిరీటాలుకావు. మానవసంస్కృతికి నిదర్శనాలైన కళల్ని నిలబెట్టుకోలేకపోతే, ఆ సాంప్రదాయాల్ని పోషించలేకపోతే, ఒక ప్రఖ్యాత కవి చిత్రకారుడు గాయకుడు తిండిలేక దుర్మరణంపాలైతే- ఆ దేశం సిగ్గుతో తలవంచుకోవాలి. స్వాతంత్ర్యం జాతిమనోవికాసానికి తోడ్పడకపోతే దీనికై యింత బలిదానం దేనికి?'

మీరా వుద్రేకంచూసి కృష్ణమూర్తిగారు నవ్వి యిలా గన్నారు: 'మనవాళ్ళు సృష్టిని చాలా జాగ్రత్తగా నిశితంగా పరిశీలించినమీదట తమ యోచనాదృష్టిని పైకిపోనిచ్చి సృష్టికి అతీతమైన సుందరరూపాల్ని కనుక్కున్నారు. ఇప్పుడు నువ్వుచెప్పావే- నికొలస్‌రోరిచ్ అని - అతను 'ఎవరెస్టుశిఖరాన్ని' వూహించి వ్రాశాడు. అందుకోసం అతను ఎవరెస్టుకు దిగువనేవున్న మంచుకొండలన్నీ ఎంతో జాగ్రత్తగా పరిశీలించాక ఆఎత్తున మంచుగడ్డలుపేరుకున్న ఆకృతిని వూహించి చిత్రించాడు. ఆ శిఖరపరిశోధకులు చూసి ఆ ఆకృతుల రూపానికి విస్తుపోయారు. అతడు అక్కడే హిమాలయాల్లో స్థిరనివాసం వేసుకుని వుండిపోయాడు.'

మీరా - 'రోరిచ్‌గారి దేశానిది ఆ అదృష్టమంతాను. భాగీరథిగారు కూడా జీవితంలో చాలామట్టుకు తత్త్వవేత్తలానే వుండేవారు. ఆయన వెంట స్కెచ్ గీయడానికి ఒకటిరెండుసార్లువెళ్లాను. తీకాళంకేసిచూపించి రంగుల మేళవింపు చెప్పేవారు. ఎప్పుడన్నా వేదాంతం మాట్లాడితే ఆధ్యాత్మికదృష్టికన్నా చిత్రకారుడు నిర్మించిన ఆకృతులే వుత్తమమైన వనీ సత్యమనీ వాదించేవాన్ని, ఆయన నవ్వి ఏ దృష్టికన్నా ఆకృతులే ప్రమాణాలుగదా అమ్మా - అనేవారు.'

'అవును. ఆధ్యాత్మికదృష్టి అంటే జ్ఞాపకం వచ్చింది - కంచునట రాజ విగ్రహం చూశావా? ఓహ్హో! యేమి లావణ్యాకృతి?'

'మరి మాస్టారూ పుట్టిపుణ్యానికే బ్రిటిషువారు అమరావతిని కొల్లగొట్టారే! ఈ రూపలావణ్యానికి శిల్పి నైపుణ్యానికి ముగ్ధులయే లండన్ మ్యూజియంలో అమరావతీశిల్పాన్ని తరలించి దాచుకున్నది. మన ఆంధ్రదేశానికో మ్యూజియంలేదు. ఆశ్రద్ధే ఎవరికీ పట్టకుండావుంది మాస్టారూ? అదృష్టే పాలకులకి లేకపోవటం నిజంగా మన దౌర్భాగ్యం కాక మరేవిటిచెప్పండి.'

'సాలార్‌జంగు మ్యూజియంలో ముసుగుబొమ్మ చూశానమ్మా. మీరా, నువ్వు చెబితే నమ్మవుగాని ఆశిల్పాన్ని దొంగిలించి తెచ్చి దాచుకో వాలనిపించింది. ఆముసుగులోంచి తొంగిచూసే ఆ నిరుపమానసౌందర్యం యీ పేదవాడ్ని ముగ్ధుడ్ని చేసిపారేసింది. ఆరాతిలోంచి ఆముగ్ధమనోహర రూపాన్ని దొలిచిన చేతులు ఆపనిముట్లు ఆ వ్యక్తి —అన్నిటికంటెగొప్పదైన ఆకళాదృష్టిని తల్చుకుని గర్వపడాలి. ఈరాజకీయవేత్తలకు, వుద్యోగులకు, అధికారులకు, ప్రభుత్వానికి-స్వాతంత్ర్యం ఎందుకు సంపాదించవలసి వచ్చిందో - దాన్తోసాధించవలసినవి యేవిటో స్పష్టంగా పోల్చుకో లేకపోతున్నారు. దారిద్ర్యంతోపోరాడటం, నలుగురికీ కూడూగుడ్డా సాధించటంకోసమే స్వాతంత్ర్యసిద్ధి కారాదు. దుఃఖాలు రోగాలు భయం యీర్ష్యాసూయలు.... వీట్లలోపోరాటం సృష్ట్యాదినుంచి సాగుతూనేవుంది. స్వాతంత్ర్యంయొక్క చరమలక్ష్యం జాతిలో మనోవికాసాన్ని కలిగించటం. యుద్ధాలు ఆగిపోతే వచ్చేశాంతి—తుఫానువచ్చి అంతావూడ్చుకు

పోయాక వెలిసినట్లే - అభీభత్సంయొక్క చివరిముద్రలు అంతగా గుర్తు పెట్టుకోనక్కర్లేదు. మనుష్యులు తాపీగా శాంతంగా పరుగులు పెట్టకుండా కాళ్లూచేతులూ విప్పుకోకుండా జీవితాన్ని జీవించవలసినట్లుగా జీవించాలి.'

మీరా చటుక్కున స్ఫురించినట్లు - కదిలేదీ 'కదిలించేదీ, మారేదీ మార్పించేదీ, మునుముందుకు సాగించేదీ, పరిపూర్ణపు బ్రతుకిచ్చేది-కావాలోచ్.... అన్నాడు గదండీ కవి!'

'అవును అవును-అచ్చంగా అదేనమ్మా! అటువైపే మనగమ్యం.'

'అయ్యో అయ్యో! యీలాంతరిదేవిటి గంతులువేస్తోంది!' మీరా కంగారుగా లేచింది. పుప్పుమని లాంతరుకాస్తా ఆరిపక్కాపోయింది. చీకటి హఠాత్తుగా వచ్చి తిష్టవేసింది.

'అయ్యో నాతెలివి, మిమ్మల్ని యింట్లో నిలబెట్టి కబుర్లాడుతూ నిల బడిపోయాను.' నాలిక్కరుచుకుంటూ మీరా చీకట్లో అగ్గిపెట్టికోసం తడు ముకోడనారంభించింది. బైటనుంచి శాస్త్రి గొంతుక వినిపించింది, కేకే స్తున్నాడు—

'వుండండి. దీపంవెలిగించుకొస్తున్నాను' అంది మీరా. అతడి చెప్పులు మరీ సమీపంగా వచ్చాక 'అదేమిటో- నేనెక్కడ అడుగుపెట్టినా చీకటే జవాబిస్తోంది.' అన్నమాటలుకూడా వచ్చాయి.

దీపంవొక్కమాటు వెలిగించి. అగ్గిపుల్ల నేలకు రాస్తూ 'లోపలకు రావచ్చు.'

శాస్త్రి ఆజానుబాహుమనిషి. వంగి లోనికి రాబోతూ 'చదవ్యాస, మతిమరుపూ వున్నవాళ్లయీయింట్లో అడుగుపెట్టరాదని మీ అభిప్రాయం కావచ్చు. అంతేనా—' అని కృష్ణమూర్తిగారిని చూసి తెలతెలబోతూ ఆగిపోయాడు.

మీరా - మాష్టారు మీకు తెలుసునా....' అని అర్ధోక్తిలో ఆగి పోయి కృష్ణమూర్తిగారికేసి చూసింది.

'ఎందరోమహానుభావు....'అంటూ శాస్త్రి చేతులురెంటినీ జోడిం చాడు, చిరునవ్వు ముఖాన కనబరుస్తూ. శాస్త్రి చాలా నిష్కల్మషంగా

నవ్వుతాడు. ఆచిరునవ్వే ఎటువంటివాతావరణంలోనైనా అతడికి క్రొత్త-బెరుకు-జంకు లేకుండా ముందుకు తీసుకుపోగల్గుతుంది.

మీరా చాపతెచ్చి వేసింది. 'కృష్ణమూర్తిగారు మీరేనా....నాకు తెలుసు సూర్యనారాయణ చెప్పాడు. అందుకనేపార్టీలోకొచ్చిన సజ్జనంతా వదుల్చుకొని మీదర్శనం చేసుకుందామని తప్పించుకునివచ్చాను. కాను గాని మీరాదేవిగారూ—కబుర్లతోటే కడుపునింపారా భోజనాదికాలేమైనా కనుక్కున్నారా?'

'ఏదీ రావటంతోనే కబుర్లలోపడ్డాం. నాకు సంతోషంతో వళ్ళు తెలియకుండా పోయింది. యీలోగా దీపం ఆరిపక్కాపోయింది. మీ రిద్దరూ కాస్సేపు కబుర్లుచెబుతూ వుండండి, నేను పావుగంటలో అంతా సిద్ధంచేస్తాను, మనముగ్గురం వొక్కమాటే కూర్చుందాం' అంటూ మీరా వంటలోకి వెళ్ళిపోయింది.

'నేను భోజనప్రియుడ్ని, మీ ఆర్టిస్టులచేతివంట నాకు రుచి కెక్కదు.' అని శాస్త్రి 'మాస్టారూ, యీవిడ తిండీతిప్పలూహూడా మర్చి పోతుందడీ ఆ నీటిబొమ్మలు గీస్తున్నప్పుడు. మరపూ పరధ్యాస - యివి కళాకారులసొత్తు! వీళ్ళ వ్యక్తిగతజీవితం చూస్తే నాకొకప్పుడనిపిస్తూ వుంటుంది : జీవితం ఎంత అధ్వాన్నంగా వంకరటింకరగా వున్నా యింత నిశితంగా సుందరంగా గంభీరంగా ఎల్లాపుండగలుగుతాయా వీళ్ళరచనలు గాని చిత్రాలుగాని అని. నిజంగా నేను ఆశ్చర్యపోతుంటాను : మనస్సును అంత ఆరోగ్యంగా, చలించకుండా ఎల్లా అట్టేపెట్టుకుంటారో అని. నాకు మట్టుకు ముప్పూటలా వేళకింత కడుపులోపడకపోతే తోటకూరకాడలా తలకాయ వ్రేలాడేస్తాను. భోజనందేహి రాజేంద్ర ఘృతసూపసమన్వితం గాళ్ళం మరి!'

కృష్ణమూర్తిగారు నవ్వారు. శాస్త్రి గొంతుసవరించుకొని వుపన్యాస ధోరణిలో - 'ఆశయాన్ని కావిలించుకొని వ్యక్తిగతసౌఖ్యాల్ని కోరికల్ని అణచిపెట్టుకొని ఆదర్శాలవెంట పరుగులుపెడ్తారుకనుకనే మీరంటే లోకానికి అంత మోజు. కాని నాకోసందేహం: ఎప్పుడూ బాధిస్తోవుంటుంది

మాస్టారూ, ఈవాళ మిమ్మల్ని అడిగి నిష్కృతిచేసుకుందా మనుకుంటున్నాను. మా మీరా - సూర్యనారాయణ - ప్రసాదరావు లాటి కళాకారులున్నారు. సూర్యనారాయణ పాపం బ్రతకలేక గత్యంతరంలేక ఫొటోలు వృత్తిగా స్వీకరించి నానాతంటాలు పడుతున్నాడు. మీరా జీవించటకోసం బట్టలు కుడుతుంది. పోషణజరిగాక మిగిలినజీవితమంతా నీటబొమ్మలు వ్రాస్తుంది. మా ప్రసాదరావు ఐయ్యే పల్టీలుగొట్టి యిప్పుడిప్పుడు జోరుగా పాటలు నాటకాలు వ్రాస్తున్నాడు. అసలు సాహిత్యంకాని కళలుగాని ఎవరిక్కావాలి? ప్రజలకు జీవితంలో నిలకడ, స్థిరత, కూడూగుడ్డమీద చింత కొంత వరకు తగ్గాలగాని యేర్పడదుగదా! నూటికి పదిమందిసూదా విద్యావంతులు కారు. అందుచేత ప్రజల్లోంచి వచ్చే ప్రోత్సాహాన్నికాకుండా ఆ తపు మొక్క పిపాస ఆవేశాల్ని పురస్కరించుకునే తమకోసం లాము కళల్ని నమ్ముకొని రంగంలో కురుకుతున్నారుగదా! ఈకృషిలోమధ్యేమార్గమంటూ లేదుగదా! పోతే తారాపథాన్నంటిపోవడం లేకపోతే శలాభాల్లా మాడిచావటం. ఉత్తమరచన వుత్తమకళాసృష్టి ప్రతివాళ్ళవల్లా అయ్యేదికాదు. షైగల్లా పాడలేకపోయాక, టాగూర్లా వ్రాయలేకపోయాక, భాగీరథి గారిలా దాళ్ళలో చెట్టుపుట్టలతో సృష్టిలోనిమూగభావాలన్నీ విప్పిచెప్పలేక పోయాక—యీ సాధన శ్రమ అంతా బూడిద పాలేగదా! ఇంత చేదు సూత్రను ఎల్లా మ్రింగుతున్నారీ ఛోటాఛోటా కవులూ రచయితలూ కళాకారులూనూ? చెప్పిందే చెప్పి వ్రాసిందే వ్రాసి వీపు గోక్కోవటం చాలా హాస్యాస్పదంగాలేదూ? ఈనిజం నన్ను చాలామట్టుకు నిరుత్సాహపరుస్తూవుంటుంది. 'నువ్వు యింతకీ కవివా గాయకుడివా?' అన్నారు కృష్ణమూర్తిగారు. నే నెప్పుడూ గొప్పవాడి ప్రక్కవాడిగానే వుందామనుకుంటున్నాను సుమండీ.' అన్నాడు శాస్త్రి టూకీగా.

గొప్పరచన చేయలేమని నిరుత్సాహపడిపోతే అది ముందునడకకే పెద్ద అడ్డుగదా! ఉత్తమకళాసృష్టి అన్నివేళలా అందరివల్లా జరగనప్పటికీ, ఆ తపన ఆ ఆవేశం ఆ ఆకాంక్ష పట్టుదల యివే ముఖ్యం. ఈపైతన్యప్రవంతిని ధారావాహికగా మోసుకుపోవాలిగదా ముందుతరానికి.

సరియైన వాకాసులు లేకుండా కళలు విజృంభిస్తే అవి వొక్కమాటు వెలిగి ఆరిపోయినదీపాల్లో ప్రజలహృదయాల్లోంచి మటుమాయమై పక్కాపోతాయి.

శాస్త్రి - 'మనిషంతవాడు తన జీవితాన్ని బలిపేసినా సాధించగలిగేది బహుస్వల్పం. ఈ కళల్ని వృత్తులుగా స్వీకరించడం అంటే పుట్టిపుణ్యానికి దుఃఖాన్ని కోరి మెడకు తగిలించుకోవడమన్నమాటే—'

నువ్వు చెప్పినదాంట్లో అయథార్థం ఎంతమాత్రంలేదు. కాని చూడునాయనా. శివాజీ, నెహ్రూ, గాంధీలాటి కొడుకుల్ని కనకపోతే పెళ్ళాడ్డం భావ్యంకాదని తీర్మానిస్తే - ఆడవాళ్లు మగవాళ్లు కాపురాలు చెయ్యటం మానేస్తారా? నీలాటినాలాటివాళ్ళు పుట్టున్నారు. గొప్ప కవులూ శిల్పులూ ప్రవక్తలూ మహాపురుషులూ పుట్టున్నారు. సృష్టికి వాళ్ళే అవసర మని మనలాటివాళ్ళు అక్కర్లేదని అనుకోగలమా? ఈతరతమభేదా ల్తోవున్న ప్రకృతే మహానందదాయకం శోభస్కరం నాయనా!'

శాస్త్రి చిత్తుగా నవ్వుతూ 'బలేబాగుందదీ మీ తర్కం—'

'తర్కంతో నాకు పనిలేదు. నిరంతరమైన అన్వేషణ - జిజ్ఞాస- నిశితమైన పరిశీలన యివే మన్ని అన్నిరంగాల్లోనూ పై పైకితీసుకుపో యేవి. ఒక పాట పాడుకున్నా, ఒకబొమ్మ వ్రాసినా, ఒకరచన చేసినా ఆ కలిగే అనుభూతిలో తారతమ్యాలుంటే వుండవచ్చు,కాని ఆతన్మయతలో కలిగే నిజమైన సంతృప్తిముందు వుచ్చనీచాలప్రసక్తే రానక్కర్లేదు. తల్లి తనబిడ్డ ఎల్లాగున్నా చూచి మురిసిపడుతుంది. ఈ కళాకారులూ అంతే—'

'మాస్టారూ మీరు చారు పోసుకుంటారా? మీరా లోపల్నుంచి కేకెట్టింది.

'ఐతే వంట చారుదాకావచ్చి ఆగిపోయిందన్నమాట—' అన్నాడు శాస్త్రి బిగ్గరగా. మీరా లోపల్నుంచి యీవలకు వచ్చి వొక్కమారు తొంగి చూసి వెళ్ళింది. ఆరూపంలో అకస్మాత్తుగా మార్పువచ్చేసింది. ముఖం అలిసిపోయి చిరుచెమటలనూరిస్తున్నది. జడంతా విప్పేసి చుట్టచుట్టి

దూముడిగా బిరుపుగా బుజంతాకుతూ మెడమీద వదిలేసింది. గాజుల్ని వెనక్కి లాగిపట్టేసి వుంచింది. ముందుజీరాడే కుచ్చెళ్ళను కొంచెంఎత్తి నడుముకు ప్రక్కనుంచి పవిటను బిగించిలాగి చుట్టేసింది. పాదాలు - మీగాళ్లు, వెనకనుంచి బుట్టగాపోసుకున్న చీరెపరెపలతో నడుస్తూ న్నప్పుడు సగ్నంగా తడబడ్తున్నాయి.

'వంటచేసేటప్పుడు ఆడవాళ్ళను పల్కరించటానికే భయంగా వుంటుంది సుమండీ! ఆ పిరికితనం వొస్తేసుగుంటాన్నేను.' అన్నాడు శాస్త్రి ఛలోక్తిగా.

మీరా తువ్వాలు బుజంమీదేసుకుని రెండుచెంబులతో నీళ్ళు రెండు చేతుల్తోనూ పట్టుకుని గడపవద్దవుంచుతూ 'నాకే సిగ్గుగావుందండీ. చాలా ప్రొద్దుపోయిందల్లేవుంది. కబుర్లలో ఏంవండానోఏమిటో.... లేవండి.'

మాస్టారు ముఖమూ చేతులూ కడుక్కొని 'మీరా' అందిచ్చిన తువ్వాలుతో తుడుచుకుంటూ. 'మరి నువ్వుకూడా కూర్చో, ఎందుకూ మగ్గుడం వొక్కమాటే కూర్చుంటేసరి.'

శాస్త్రి కాళ్లుకడుక్కుంటూ 'ప్రభువెక్కిన పల్లకి కాదోయ్, అది మోసిన బోయీలెవ్వరు? అంటాడు కవి. అవునా?'

'మీరు ముందు కూర్చోండి. నేను తర్వాత కూరుచ్చుంటాను.'

'ఇంటింటా ప్రతిగృహిణినోటంటా ఆముక్క వినిపిస్తూనే వుంటుంది సొగసుగా.' 'మరే....' అంటూ అదోలానవ్వింది మీరా।

శాస్త్రి మాస్టారితోకూడా వంగుని వంటయింట్లోకి జొరబడుతూ - 'ఏద్తైనా యితరులకి యివ్వగలగడంలోనే ఆనందం పొందుతారుకాని తనకి తాను తినడంలో యేమీ తృప్తివుండదు కొందరికి.'

ఆవంటయింటిని చూశాక కృష్ణమూర్తిగారు మీరా ఎందుకు తమతో కూర్చోనంటోందో గ్రహించగలిగారు. రెండు మంచినీళ్ళబిందెలు ఒక పెట్టె అందులో కడిగి బోర్లించి నిగనిగలాడ్తున్న పాత్రసామాను, మరోపక్కగా ఏవో డబ్బాలు, యిరుకుగా యిద్దరు భోజనానికి కూర్చు

న్నొక మనిషి కదల్డానికే వీలులేదు. విస్తళ్ళలో వడ్డన పూర్తయింది. శాస్త్రి, కృష్ణమూర్తిగారు పీటలమీద కూర్చున్నారు. మీరా గది మధ్యను నిలబడి కుడిచేతిలో గరిటలో ఎడమచేయిని కుడిముంజేతిమీద ఆన్చి పరధ్యాసగా వున్నట్టు నిలబడిపోయింది.

విస్తట్లో అన్నం వార్చినది కాబోలు - మల్లెపువ్వులా పొడపొడ్లా డుతూ వుంది. వంకాయ యిగురుపెట్టి పచ్చిమిరపకాయకారంపేసి చేసింది. పచ్చివడియాలు నాలుగుచొప్పున వేయించింది. అవి మసాలావడల్లా వుబ్బి నోరూరిస్తున్నాయి. కొబ్బరికాయపచ్చడి. ఆవకాయ, రెండువిస్తళ్ల నడుమా నేతిగిన్నె చేతికీ దగ్గరగా వుంచింది. శాస్త్రి కలబడుతూ - 'విస్తరి నిరాడంబరంగా ఆకర్షకంగా లేదు మాస్టారూ?'

మీరా ఫక్కుమని నవ్వేసింది.

శాస్త్రి పచ్చివడియం కొరుకుతూ 'అంలా బాగానేవుందికాని మీరల్లా గరిటచేత్తోపుచ్చుకుని ఎదురుగుండా నిల్చుంటే నాకేదో భయంగావుంది. కాస్త పుణ్యముంటుంది.....' అని నసిగాడు.

గరిట అన్నంగిన్నెమీద వుంచుతూ - 'మర్చేపోయాను, ఏదో పరధ్యాసలోపడి' అంది.

'ఉపన్యాసవేదికమీద, స్కూళ్ళల్లో, కలంచేత్తోపట్టుకున్నప్పుడు, వీణవాయించేటప్పుడుకన్నా గరిట చేత్తోపుచ్చుకున్నప్పుడే ఆడవాళ్లు నిజంగా సహజంగా కనిపిస్తారనుకుంటా - మీకెవ్వరికన్నా అభ్యంతర ముంటే యీ ప్రకటనను నేను వుపసంహరించుకోడానికి సిద్ధమే!' అన్నాడు శాస్త్రి తనధోరణిలో. మాస్టారు చాలా ఆకలిగావున్నట్టే కనబడ్డారు. శాస్త్రి భోజనంకన్నా కబుర్లెక్కువచెప్పి నవ్విస్తున్నాడు. మీరా తనొక పెద్ద ఆరిందాలా ఏదో తెలియని అస్తిత్వంతో కూడుకున్న సంతృప్తితో నిల బడిందిచూస్తూ. శాస్త్రి వక్తి పెంకి కబుర్లు ఎన్ని చెప్పినా భోజనం చేస్తు న్నప్పుడు తనముందు చిన్నపిల్లవాడల్లే గోచరింపసాగాడు. ఈయిద్దరూ తనకేమీకారు. ఇవన్నీ ఎక్కడ్నుంచో కొట్టుకొచ్చిన బంధనాలు. కళాధి

మానం రకరకాల మనుష్యుల్ని వొక కుదురులోకి యీడ్చుకొచ్చేసింది. ప్రపంచంలో మరేమీ సమస్యలు, విషయాలు లేనట్టే అహోరాత్రులు సంగీతము, సాహిత్యము, బొమ్మల్నిగురించి చర్చించుకుంటూ వుంటారు. ఈ: వక్రమైన బంధనాన్ని యిల్లా పెంచుకుంటూపోతే తర్వాత? కళాభి మానులెప్పుడూ తర్వాత గురించి ఆలోచించరు. ఉత్సాహమూ, శక్తి ప్రేరేపిస్తున్నప్పుడు వురుకులుపెట్టి పరుగులుపెట్టే మనస్సును ఆపడం ఎంతకష్టం? కృష్ణమూర్తిగారు విస్తరికాళీచేసి చేతిని ఆకుమీద బోర్లించి మీరాకేసి చూశారు. ఆమెమనస్సు అప్పుడే ఎక్కడో ఏ కొండల్లోంచి బండరాళ్ళల్లోంచి దొర్లివచ్చే సెలయేటి గానాన్నో వింటోంది.

'మీరాదేవిగారూ, కొంచెం యీ లోకంలోకివచ్చి మమ్మల్నోకంట చూస్తారా? అన్నం కావాలి' అన్నాడు శాస్త్రి.

'హాఁ?' అని అన్నపు పళ్ళెరంలోకి గిన్నెలోంచి తోడుతూ - 'క్షమించాలి మాస్టారూ! ఆలోచిస్తూ నిలబడిపోయాను.'

'అంతఖరీదైన ఆలోచనల్లు కాబోలు మీవి. మీవంటకాల్తోబాటు మీఆలోచన్లుకూడా కొంచెంవడ్డిస్తే - సరిగ్గా పక్వంగా వున్నాయో లేదో చెబ్తాము.' మీరా కావలసినవన్నీ రెండవపర్యాయం అడిగిఅడిగి విస్తట్లో వేశాక 'కురుస్తున్నవర్షాన్ని ఎల్లా చిత్రించడమా అని చాలారోజుల్నుంచి తాపత్రయ పడ్తున్నాను: ఒక కొండ, ఆ కొండని దట్టంగా మబ్బులు క్రమ్మేస్తాయి, పెనుగాలి వీస్తోవుంటుంది. చెట్లు చేమలు పచ్చగా నల్లగా చీకట్లో మునిగిపోతుంటాయి. ఆ వాతావరణంలోకి ఒక రోడ్డు మెలికలు తిరిగి పాకుతూ లీనమైపోతూవుంటుంది. నిర్మానుష్యమైన అల్లాంటిచోట వొక శిథిలమైన జీర్ణకుటీరం-పైనుంచి తాటాకులు ఎగుర్తూ-టి.బి. పేషంట్లా బొమికలు పైకి చొరుచుకున్నట్లు పాక వెదుళ్ల రాటలూ కనిపిస్తాయి. ఇదీ భావన - దీనికి రూపమిద్దామనుంది. బాగులేదూ-'

శాస్త్రి ముద్దనోట్లో కుక్కుకుంటూ - 'ఆపండి మీరాదేవిగారూ, నాకూ ఒక బొమ్మ చిత్రించాల్సిన రూపం యిప్పుడే తళుక్కునమెరిసింది. నన్నుగూడా కాస్త మనవిచేసుకోనివ్వండి. మాస్టారూ, మీరు శ్రద్ధగా

పినాలి. ఒక కవికుమారుడు శవంలా చీకటికొట్లో నేలమీద వెల్లకిలా అస్తవ్యస్తంగా పడిపోయివుంటాడు. బొమ్మలో ముందువైపు క్రింద పొర్లు తూన్న సంస్కారహీనమైన అతడి సుందర కేశాలు జులపాల్లా చిత్రించాలి. ముఖం బాధాగ్రస్టమై కళ్లు మూసుకుపోయుండాలి. ఒక చేతిలో పుస్తకం తెరిచివుండాలి. మరోచేతిలో పెద్దపెజు కలం. అతనిగుండెలమీద సిరా ఒలికిపోయి లాల్చీమీద పెద్ద మడుపుకట్టాలి. దూరంగా ఆగదిలో ఒక కొవ్వొత్తి వెలుగుతున్నట్లు చూపించాలి. కవికుమారుడి గుండెల మీద సిరామడుగులో సరస్వతీదేవి ముగ్ధమనోహరంగా నాట్యంచేస్తూ చిత్రించాలి. తెలిసిందా! అప్పుడు కళ జీవితాన్ని ఎలా ధ్వంసంచేస్తుందో ఆ బొమ్మ నగ్నంగా వ్యక్తంచేయాలి. ఏం బాగులేదూ—'

ఇద్దరూ భోజనం పూర్తిచేసి లేచారు. మీరా మెరిసే కళ్ళతో ఆశ్చర్యంగా శాస్త్రివైపు చూస్తూ నిలబడిపోయింది. మాస్టారు చేతులు కడుక్కొని మడత మంచంమీద మేనువాల్చారు.

'ఈ గడపదగ్గర హర్చుని నేను కబుర్లు చెబ్తూంటాను. మీరు కులాసాగా భోంచెయ్యండి, మీరే కళాత్మకంగా ఆలోచించగలరని గర్వపడుతూంటారు. నాబోటివాళ్ళు ఎంతమంచి భావనలుచేసినా అవి పైకిరావు. ఏగతి పచియించిరేని సమకాలపువారలు మెచ్చరేగదా! అన్నాడు కవి.'

మీరా పీటతెచ్చి వంటయింటి గడపవద్ద వేసింది. శాస్త్రి కూర్చో బోతుండగా మాస్టారు - 'ఆ సంచీలో కొంత. అపూర్వ కళాసమూహం జాగ్రత్త చేశాను. ఓపికవుంటే ఒక్కసారి ఆమూటల్ని విప్పి వాటిని శ్రద్ధగా పరిశీలించి చూడు.' శాస్త్రి భద్రంగా సంచీలోనుంచి గుడ్డలలో జాగ్రత్తగా చుట్టబడిన ఒకపెద్దపెజు పానపాత్రను వెలికిదీశాడు. ఇంకా అల్లాటి పానశాలల్లో మధుపానానికి వాడే సొంపైన కాచపాత్రలు రెండు మూడు రకాలవి వున్నాయి. ఆ గాజుసామానుమీద చాలా నగిషీపోతపని చేయబడివుంది. ఒకపాత్ర కుంకుమలేతవర్ణంలో పొందికగా సుందరంగా పోయబడిన శిల్పంతో చాలా గంభీరంగా నిండుగా దర్జాగావుంది...

ఆపాకలోని నిరాడంబరమైన వాతావరణంలో యిముడ్చుకోలేని ప్రత్యే కతను ప్రదర్శిస్తున్న దా కళాఖండం. ఆ సామానును చూస్తున్నప్పుడు కృష్ణమూర్తిగారిలో అజ్ఞాతంగా జ్వాజ్వల్యమానంగా దహించుకుపోతున్న కళాతృష్ణకు వ్యాఖ్యానాలుగా ఆ వస్తువులు నిలబడుతున్నాయి. మీరా అంటచేత్తో విస్తరిదగ్గర్నుంచి లేచివచ్చి ఎడంచేత్తో స్పృశించి మెచ్చు కుంటూ 'మాస్టారూ, యీ గాజుపాత్రల్ని ఎక్కడెక్కడ సేకరించు కొచ్చారు? ఎంత శ్రమపడి వెదికారు? వీట్ని మోసుకుంటూ ఎక్క డెక్కడ తిరిగారు? కళ్లు జిగేలుమంటున్నాయి సుమండీ!'

కృష్ణమూర్తిగారు చాలా నెమ్మదిగా యిలా గన్నారు: 'బజార్లలో నడుస్తున్నప్పుడు కళాత్మకంగా తోచినవస్తువు నాకంటపడితే అది సంపా దించినదాకా నేనువదల్ను. ముఖ్యంగా ఎన్నెన్నికాల గాజు గ్లాసులు, పానపాత్రలు, పూలకూజాలు, పళ్ళాలు ప్రోగుచేశానని! అన్నీ జమ చేర్చేందుకు నా కో స్థిరమైన జీవితమూ నివాసమా? అన్నీ ఎక్కడెక్కడో అప్తుల యిళ్ళలో వదిలేశాను. చాలామటుకు బద్దలై పోయాయి. కొన్ని నేనే బద్దలుకొట్టేశాను.'

'అంతే -?' అని అర్ధోక్తిలో ప్రశ్నార్థకంగా చూసింది మీరా.

'నువ్వు వెళ్ళి అన్నంతినిరా అమ్మా!' అంటచేత్తో అల్లా పెట్టి దానిలా నిలబడిపోతే నాగుండె తరుక్కుపోతుంది.'

మాస్టారు గ్రామఫోనుపెట్టె తెరచి 'తాన్‌సేన్'చిత్రంలో సైగలు పాడిన దీపకరాగం 'దియాజలావ్' రికార్డుపెట్టి వింటూ కూర్చున్నారు. శాస్త్రికి నోటికి తాళంపడినట్లయిపోయింది. ఆయన పాటవింటూ తల పంకిస్తున్నారు. మధ్యమధ్యను ఆ సొంపైన కాచపాత్రవంపుల్ని అప్యా యంతో గమనిస్తున్నారు. మధ్యలో శాస్త్రి 'పంకజమల్లిక్ పాటగురించి మీ అభిప్రాయమేమిటి?' అని అడిగాడు. అంతే - ఆయన రికార్డు ఆపేసి పెట్టి మూసేశారు. మీరా చేతుల్ని తుడుచుకుంటూ గదిలోకొచ్చి చూసే సరికి శాస్త్రిముఖం తెల్లమతాబాలా వెలిగిపోతోంది. మాస్టారు ముభా వంగా వున్నారు. పసిపిల్లలకి ఎంత త్వరలో వస్తుందో అలక ఆమాదిరి

గానే యిద్దరూ పోట్లాడుకున్నట్లు తలకాయలు వంచుకుని కూర్చున్నారు. మీరా చిక్కులో పడిపోయింది. ఆయిద్దరికీవున్న ఎడంలో చాపమీద కూర్చుని కాచపాత్రను వొళ్ళోకి తీసుకుని ఆప్యాయంగా నిమురుతూ - 'శాస్త్రిగారు చాలా కమ్మగా పాడుతారు. ఏదీ, వొక్కపాట పాడండి. మీకిష్టమైన పాట - '

శాస్త్రి పెంకెతనంగా 'నేపాడను.' అనేసి లేచి నుంచున్నాడు.

మీరా - 'ఇదుగో, కూర్చోండి. చాలా ప్రొద్దుపోయింది. ఒక్క పాటపాడి వినిపించండి మాస్టారికి. బ్రతిమాలుతున్నాను, వొట్టేసుకుని....'

మీరా అనునయంగా వొళ్ళో దాచుకున్న పానపాత్రను వ్రేళ్ళతో నిమురుతూ - గొంతెత్తి జాలి వొలుకబోస్తూన్న అనుకంపతో - 'దూరాన నారాజు కేరాయుడౌనో....' పాట మొదలెట్టింది. మాస్టారు తలెత్తి ఆమెలోకి చూసి చిరునవ్వు నవ్వారు. శాస్త్రి మంత్రించిన భుజంగంలా వచ్చి నేలమీదే చతికిలబడ్డాడు. ఆపాట కన్నీటికాలువలా, ఆ నిశ్శబ్దం లోంచి గుండెల్ని చీల్చుకు బాధగా ప్రవహిస్తోంది.

'తులశెమ్మ వొరిగింది, తొలిపూస పెరిగింది,

కాకమ్మచేతైన కబురంపడారాజు - దూరాన నారాజు....'

కృష్ణమూర్తిగారు లాల్చీకొసల్తో కళ్ళొత్తుకుంటూ - 'ఏదమ్మా, మళ్ళీపాడు —'

మీరా మళ్ళీమళ్ళీ ఆపాటేపాడింది.

గాలి చల్లగా మెల్లగా వీస్తోంది. చీకట్లో రోజాపువ్వులగుత్తులు నిన్నటి మొన్నటి రేకల్ని రాలుస్తున్నాయి. వీధిగేటుదగ్గర సైటుక్వీను మత్తుగా సువాసనల్ని చీకట్లోకి విరజిమ్ముతోంది. జనపథానికి సుదూరాన, చిట్టచివరను కృంగిపోయిన జీర్ణకుటీరంలోనుంచి జాలిగా గుండెల్ని తొడుకుంటూ వినవస్తూన్న 'ఎంకిపాటకు' గేటుదాకావచ్చిన మనిషి కాలు ముందుకు కదపకుండా ఆ పాకముందరే నిలబడిపోయాడు. కాని దగ్గరలో రైలుకట్టమీద పరుగులుపెట్టి మహాభయంకరంగా విరుచుకు

వడవస్తున్నట్లు వస్తున్న గొప్పదనపు చప్పుడుకు, నిలబడలేక గేటును ప్రోపుదని చరచరా లోనికివచ్చి అకస్మాత్తుగా నిలబడ్డాను. మీరాపాట చెవులకున్నీ ఆగిపోయింది. మాస్టారు కోపంగా - 'అదుగో, ఇకని వ్యాపారంగా మార్చుకుని నాటకవాళ్ళ సంపాయించుకోవాలని బల్లకట్టిన సూర్యనారాయణ.'

సూర్యనారాయణ అప్రతిహతంగా, నవ్వలేక, బిగ్గరగానవ్వాడు.

# 4

'శాస్త్రి-సూర్యనారాయణ' పట్టుపట్టి బలవంతాన 'ప్రసాదరావు' చేత నాటకం వ్రాయించారు. ప్రదర్శనం రెండుగంటలకి మించకూడదు. నాటకంలో నినాదాలు ప్రచారం వుండకూడదు. ప్రేక్షకునికి కోపం తెప్పించడానికిగాను ముందునుంచీ క్రూరంగా తయారుచేసి పోతపోసిన 'విలను' లేకుండా వుండాలి. నాటకానికి ఆయువుపట్టయిన కథలో - ఒక స్త్రీ జీవితంచుట్టూ రకరకాల సంఘటనల్ని ప్రవేశపెట్టి ఆ పరిస్థితుల ప్రభావం వ్యక్తిగత జీవితంలో కనీ వినీ వూహించని మార్పుల్ని తెచ్చి చూసేవారిని ఆశ్చర్యపెట్టాలి! నాటకంలో తుపాకులు, పిస్తోళ్ళు, హత్యలు, చావులు, ప్రేమపెళ్ళి చేసుకోవడం లాటివి వాడకుండా క్రొత్తపక్కీలో వుండాలి. ఈ నిబంధనలన్నీ ప్రసాదరావుమీద రుద్ది శాస్త్రి 'దేవుని యెదుట-' అనే నాటకాన్ని దగ్గరుండి వ్రాయించాడు. ప్రసాదరావే ఆనాటకం వ్రాశాడని అనడానికి వీల్లేదు. ఎందుచేతనంటే కథా సంవిధానం పాత్రలపగ్గన్నించి సంభాషణలవరకూ సర్వం శాస్త్రి హోరాహోరీ తగూలాడి సరిదిద్దించేశాడు. నాటకం వ్రాసేపట్ల రచయిత తన ప్రత్యేక వ్యక్తిత్వంకోసం చేసినపాట్లన్నీ వ్యర్థప్రయాసపాలైనవి. అసలురచయితకి వ్యక్తిత్వం వుండాలా అక్కర్లేదా అన్నసమస్య యీ నాటకంతో తేలిపోయేట్లున్నది. నాటకంలో కథ హృదయంగమంగా వున్నాలేకపోయినా నాటకంబయట జరిగిన కథమాత్రం రసవత్తరంగానే వుండొచ్చు.

'మూఢవిశ్వాసాల్తో జీవితాన్ని అంధకారమయం చేసుకున్న ఒక స్త్రీలో బ్రహ్మాండమైన చైతన్యం కలిగి, లోకంతో జీవించటానికి కావల్సిన ధైర్యాన్ని, జీవితంలో నెగ్గటానికి కావల్సిన చొరవను ఆపాత్ర జీవితం లోంచి పుంజుకొంటుంది. తమ జీవితంలో తాము గుర్తించిన సత్యం వైపు అసాధారణమైన వేగంతో ఆపాత్రలు పరుగులుపెడ్తాయి. ఆ వేగం ప్రేక్షకుల్ని దిగ్భ్రాంతుల్ని చేసి పారేస్తుంది.' అంటాడుప్రసాదరావు.

'తాము జీవిస్తున్న ప్రపంచంలోకి నిత్యం వచ్చిపడుతున్న మార్పులు కూర్పులు పీటిపేటిలోటీ ప్రమేయంలేకుండా, సంఘంలో దేశంలో జరుగుతున్న పెద్దపెద్ద సంఘటనలు-మారుతున్న చరిత్రయొక్క ప్రసక్తేపట్టకుండా, తమ కోటలోనే తాము జీవించే బుద్ధిమంతులు చాలామందివున్నారు. ఈ రూపస్వమండూకాలను చెదరగొట్టగలిగే శక్తి కలిగిన నాటకం బాబూ, నువ్వు వ్రాయవలసినది' అని హితోపదేశం చేశాడు శాస్త్రి ప్రసాదరావుకు.

'ఒకనాటకం వ్రాసేస్తే సమాజంలో సంచలనం కలిగినట్లేనా'-అని సూర్యనారాయణ అడ్డుప్రశ్న వెయ్యకపోలేదు.

'జీవితంపట్ల సమాజంలోకల నిస్తబ్ధతకు నిర్లిప్తతకు అజ్ఞానానికి గొడ్డలిపెట్టుగా ఎన్నెన్నో కథలూ, నాటకాలు, పాటలు, పద్యాలు వచ్చి పడాలి. మేథావంతులలో అశ్రాస్యులలో వున్న యీ జబ్బు క్రమేపీ అల్లుకుపోతే - చిట్టచివరకు దేశంలో ఎటువంటి బ్రహ్మాండమైన వుద్యమాలు సంఘటనలు సాంఘికంగా వచ్చిపడ్డప్పటికీ మన కవులూ, రచయితలూ ప్రేయసి మెల్లకన్నుమీద పద్యాలు చెబుతూ డిటెక్టివ్ కథలు వ్రాస్తూ కూర్చుంటారు. కళలన్నీ కుక్కగొడుగుల్లా వెర్రితలలేసి కూర్చుంటాయి. మనదని సగర్వంగా చెప్పుకొని గర్వపడే ఒక ఉత్తమ రచనా, వొక వున్నతశిల్పమూ, వొక గొప్పనాటకమూ యేదీ పైకి రాకుండానే బురదలోపడి కొట్టుకుంటాము. ఈ దురవస్థను తప్పించా లంటే ప్రజల దృష్టిని గంభీరమైన, బలవత్తరమైన విషయాలవైపుకు

తప్పాలి. సామూహికదృష్టిలో జాగృతి కలిగితేగాని యీ అన్ని పనులూ చక్కపడవు. అటువంటి ప్రయత్నాల్లో యిదొకటి—'

'రాజకీయంగా మనం తెచ్చుకున్న స్వాతంత్ర్యం యీ శక్తులన్నింటినీ సరిగా సద్వినియోగం చేసుకోవటానికే-' అన్నాడు పొలంఅమ్మి స్టూడియోపెట్టిన సూర్యనారాయణ.

నాలుగు రాత్రుళ్లూ మూడుపగళ్లూ గదినిండా సిగరెట్టుపీకలతో నింపేసి, ఏదో అతికష్టంమీద ఒకపూట భోజనం తతిమ్మా రోజు భోజనంలా టీమీద గడిపి, సగంమనిషి చిక్కిపోయి ప్రాణాలు లోతుకు పోయి నడిస్తే కాళ్ల తేలిపోతాయనగా తూల్తూ తూల్తూ ఏదోనాడు తెల్లవారకుండా కాగితాలదొంతు పుచ్చుకుని ప్రసాదరావు వచ్చాడు. 'దేవుని యెదుట-' నాటకం పూర్తయింది.

స్టూడియోలో సూర్యనారాయణ దీక్షగా ఒక ముష్టివాడి బొమ్మ వ్రాస్తున్నాడు. ఎవరో అడుక్కోటానికి వుదయం వచ్చివుంటాడు. పూడాసంగు మాసికలువేసిన మరకలుమరకలుగా అట్టలుకట్టిన చీకిరిబాకిరి కోటు తొడుక్కున్నాడు. ఒక చెయ్యి పూర్తిగాకాకుండా సగం చినిగి పోయి పీలికలు వ్రేళ్ళాడుతున్నాయి. ఆ చేతిలో త్రుప్పుపట్టిపోయిన డాల్డాడొక్కు పట్టుకున్నాడు. నెత్తిమీద ఎవరో ధర్మాత్ములు ఎప్పుడో ప్రసాదించిన కాకీటోపీ వుంది. టోపీక్రిందనుంచి దుమ్ముకొట్టి ఎర్రబడిన పీచుల్లాటిజుట్టు, మాసిన గడ్డంలో పండినజుత్తు అక్కడాఅక్కడా తెల్లగా వెండిలా మెరిసిపోతోంది. రెండవచేతిలో ఒకకర్ర పొడుగాటిదివుంది. పాదాలకు అడుగుపూడిపోయి శిథిలమైన మిలిటరీ బండబూట్లు వున్నాయి.

ముష్టివాడు కదలకుండా నిల్చోమన్నచోట ప్రతిమలా నిల్చుండి పోయాడు. సూర్యనారాయణ చేత్తో కుంచెను పట్టుకుని నిలబడి పెనసలు స్కెచ్‌మీద త్వరత్వరగా రంగులువేసుకుంటూ పోతున్నాడు.

ప్రసాదరావు కాస్సేపు అటూయిటూ తచ్చాట్లాడి స్టూడియో సోఫాలో కూర్చుండిపోయాడు. ముష్టివాడు మధ్యలో గ్రుడ్లను ప్రసాద

రావుకేసి త్రిప్పి చూస్తున్నాడు. ఆ చూపుల్ని భరించటం భయంకరంగా తోచింది. అతడి చేతిలోని కాగితాల దస్తరంకేసి చూసుకున్నాడు. బొమ్మ వ్రాస్తే అంతా తేలిగ్గా చూడకల్గుతారు. చప్పున మెచ్చుకుంటారు. విశేషప్రయత్నం లేకుండా నలుగురూ చూసి ఆనందించటం సులభం. కాని యీ నాటకం ఎవరు ఎంతమంది శ్రద్ధగా చదవటానికి వీలవుతుంది? ఎవరోకొంతమంది ఆడాలి. పెద్ద అట్టహాసంచేశాకకాని అది నలుగురిలో వచ్చిపడదు. ప్రసాదరావు క్షణకాలం అసూయపడ్డాడు. అడుక్కోటానికి వచ్చిన ముష్టివాళ్ళను బలవంతపెట్టి వాళ్ళ ఆకృతితో చెలగాటాలాడ్డం, వాళ్ళ గాథలూ బాధల ప్రసక్తేలేకుండా రూపురేఖలతోటే నిమిత్తులయి ఏవోగీతల్నుగీసి రంగుల్ను పులమటం చాలాఅమానుషంగా తోచింది.

'ముష్టివాడైపోవటమే జీవితంలో వొక పరమదౌర్భాగ్యం! వాడ్ని నిల్చోబెట్టి గంటలతరబడి బాధించటం అందులో అదీ నీ ఆనందం కోసం —చాలా అమానుషం సూర్యనారాయణా!'

'చాలా సంతోషించాం. ఇక్కడ చిత్రకారుడి దృష్టికోణంలోంచి చూస్తే వస్తువుల ఆకారరూపరేఖాదులకన్న ప్రాశస్త్యం వాటి కారణాలకి లేదు. ఆ మనిషియొక్క అవస్థతోటే మాకు సంబంధంకాని వాటికిగల కారణాల్ని అన్వేషించుకుంటూ చర్చించటం అనవసరం.'

'ఐతే నీకన్నా వాడ్ని పిలిచి ఆదరించి ఒకపూట భోజనంపెట్టిన తల్లే వాడిదృష్టిలోనేకాక ధర్మపరంగా చూసినా గొప్పదంటాన్నేను.'

'నేనూవాడికో రూపాయి యిస్తున్నాగా—నాకుకాస్సేపు మోడల్‌గా వచ్చినిల్చుంటే వాడికి పోయేదేముంది?'

'చాలాఅసహజం - కృత్రిమం - అన్యాయం అంటాన్నేను.'

విశ్రాంతికోసం బొమ్మ కొంచెంసేపు ఆపుచేశాడు వ్రాయటం. క్రిందనుంచి ముగ్గురికీ కాఫీ వచ్చింది. ముష్టివాడు డబ్బా కర్ర యింకా బుజాన్నున్న చింకిమూట నేలమీద దింపుకుని కూర్చున్నాడు. సూర్యనారాయణ నవ్వుతూ ప్రసాదరావుచేతిలోని కాగితాల దొంతరను లాక్కున్నాడు.

ప్రసాదరావు సిగ్గుపడుతూన్నట్లు '—నాటకం పూర్తిచేశాను—' అన్నాడు.

నిజంగా తను ఎంతగర్వంగా సంతృప్తిగా చెబుదామనివచ్చాడో ఆ పుత్సాహమంతా ఎక్కడికో యెగిరి చక్కాపోయింది. వాతావరణం ప్రోత్సాహకరంగా లేనప్పుడుకూడా కొందరివద్ద పరిస్థితుల్ని తమ కను గుణంగా త్రిప్పుకునే నేర్పు చాకచాక్యం ప్రతిభ వుంటాయి. సూర్య నారాయణ, శాస్త్రి, శ్రీహరి వుంటారేమో వాళ్ళకు చదివి వినిపిద్దామని వచ్చాడతను. ఇతను వొక్కడూ స్టూడియోలో యివ్వాళ ఏదో 'మోడల్' పెట్టుకొని కూర్చున్నాడు.

'అట్టేపెట్టు. అనక చదివాక తీసుకెళ్దువుగాని.' సూర్యనారాయణ ఆవ్రాతప్రతిని డ్రాయరులో పడేస్తూండగా 'అహఁహఁ, అల్లాకాదు-'అని ప్రసాదరావు మళ్ళీ చేతిలోకి తీసుకున్నాడు. ఈరోజల్లా అది చేతిలో పెట్టుకుని తిరగాలనిపిస్తోంది. మాటిమాటికి పేజీలు చూడబుద్ధవుతోంది. ఎవరైనా ఎదురుపడితే వాళ్ళకీరోజు ముఖ్యసంఘటనల్లో వొకటైన యిది తెలుసుకోలేకపోతున్నారని విచారంకూడా వేస్తోంది.

సూర్యనారాయణ కొంతసేపు ముష్టివాడ్ని ముస్తాబుచేసి నిలబెట్టాక మళ్ళీ బొమ్మ వ్రాయటానికుపక్రమించాడు. వివిధవర్ణాల సమ్మేళనంతో అతను మూసికలబొమ్మను తయారుచేస్తున్నాడు. బొమ్మ రంగులుమారుతూ పూర్తవుతున్నకొద్దీ కళ అధికమవుతూండటం గమనిస్తున్న ప్రసాదరావుకు యీమాటు నిజంగా అసూయ పుట్టుకొచ్చింది. కళ్లుండి చూడగలిగిన ప్రతివారూ బొమ్మను క్షణమాత్రం చూసేసి మెచ్చుకుంటారు. ఒకకావ్యం ఒకనాటకం యివి కొంతమందినే ఆకర్షిస్తాయి, ఇవి బహు అల్ప సంఖ్యాకులకు కావాలి. రససిద్ధికలగటానికి ఎదుటివ్యక్తిలోనుంచి చాలా సమయం శక్తి సంస్కారము ప్రయత్నమూ కోరుతుంది రచన. ప్రాజ్ఞులు చదవకపోయినా ప్రతిభావంతులైన నటకులు ఆడకపోయినా నాటకం మూలను పడుకుంటుంది. ఈ బొమ్మల్ని పసిపిల్లలు, స్త్రీలు, వృద్ధులు

అన్నితరహాలవారు చూడ్డానికీ మెచ్చుకోవటానికీ ఎటువంటి ఆటంకమూ లేదు.

బొమ్మ పూర్తయినట్లే. మధ్యమధ్య కుంచెల్ని మారుస్తూ రంగుల్ని అక్కడాఅక్కడా 'టచ్' చేస్తూ వెనక్కీ-ముందుకీ వెళ్ళి చూస్తున్నాడు సూర్యనారాయణ. ముష్టివాడు ఆశ్చర్యంలో తనమూర్తిని తాను ఎన్నడూ కనీవినీఎరుగని రూపంలో గ్రుడ్లప్పగించి చూస్తూ నిలబడిపోయాడు. అతగాడికి తనచేతిప్రేళ్ళతో ఆరంగుల్ని ముట్టుకోవాలనేటంత కోరిక కలిగింది. జేబులోనుంచి ఒకరూపాయినాణెం తీసి ముష్టివాడిచేతిలో వుంచబోయాడు. కాని ఆ అబ్బి ఆరూపాయికేసి చూసినచూపు—ఆ అర్ధనిమీలితనేత్రాల్లోంచి క్షణకాలం నిప్పురవ్వలు దూసుకున్నట్లున్నాయి. సూర్యనారాయణచేతిలోనుంచి రూపాయి ఘల్లుమని క్రిందపడి దొర్లు కుంటూ స్టాండుమూలలకు పరుగెట్టింది.

ప్రసాదరావుకి ఒక్కకుదుపు కుదిపినట్లయింది. సూర్యనారాయణకి భూమి కంపించినంతపనయింది.

'అక్కర్నేదుబాబూ! ఎప్పుడన్నా యీతట్టువొత్తే నాబొమ్మ వోపాలి సూసుకుంటానికి అనుగ్గెయిప్పియ్యండి. దండాలుబాబూ, - శానాసేపు కష్టపడ్డారు. మీ సేతుల్లో జీవం శానాకాలం నిలబడాల! దయవుంచండి బాబయ్యా! నాబొమ్మ వోపాలి ఎప్పుడన్నా కావడితే సూసుకోనియ్యండి: శలవు-' అంటూ నిశ్శబ్దంగా దొకుక్కా డవాలీ సర్దుకుని మేడమెట్లమీంచి దిగి అదృశ్యమయ్యాడు!

ప్రసాదరావు వ్యంగ్యంగా - 'నీబొమ్మలో ఏదో శక్తి వుండబట్టే వాడిచేతకూడా ఆటువంటిమాటల్ని పలికించింది. నిజంగా వాడు పుద్రిక్త డయాడు. ఎటువంటి సంస్కారమూ నాగరికతా చొరని హృదయంలో కూడా అచేతనంగా నిద్రాణమైపున్న సున్నితమైన సంస్కారబీజాల్ని రెచ్చగొట్టగలిగింది నీ కళ.'

'ఏవిటేవిటి-' అంటూ శాస్త్రి లోపలికొచ్చాడు. సూర్యనారాయణ ప్రసాదరావు జరిగినదంతా టూకీగా చెప్పారు. ఎదురుగుండా ముష్టివాడి

చిత్రం ప్రత్యక్షసాక్ష్యం. శాస్త్రి బిగ్గరగానవ్వి - 'ఒక ఐదురూపాయల నోటు యిచ్చి చూడాల్సింది. అదంతా వేషం. దొంగ మొహమోయ్, అదేం కనపడ్డంలా! వాడు కళను చూసి తన్మయుడై పోయాడనుకోవటం మన సెంటిమెంటుని తృప్తిపర్చుకోవటం మాత్రమే.'

ప్రసాదరావు యీ మాటలకు చాలా నొచ్చుకున్నాడు. 'మనకంటే తక్కువ అవస్థలో వ్యవస్థలో చిక్కుపడ్డవాళ్ళలోని గొప్పలక్షణాల్ని గుర్తించనిరాకరించటం చాలాఅవివేకం. మన దౌర్భాగ్యం యేమిటంటే సుందరమైన వస్తువుల్ని చూడ్డానికి అనుభూతుల్ని పొందడానికికూడా అంతస్థుల్ని తెచ్చి అడ్డువేసుకుంటున్నాము. ముష్టివాడైనంతమాత్రాన వాడి అనుభూతిని మనం గౌరవించలేకపోతున్నామన్నమాట.'

'తగ్గవోయ్, తగ్గు!' అని కసిరాడు గట్టిగా శాస్త్రి.

ఆరోజు సాయంకాలమే నా బొమ్మ పోయిందంటూ సూర్యనారాయణ గోలపెట్టాడు. ఆమర్నాడు ఎవరో రైలుక్రింద ముష్టివాడు పడిపోయాడంటే వాడి చంకలో మూటలో లుంగలుచుట్టి పదిలంగా దాచుకున్న ఆచిత్రం దొరికినట్లు పోలీసువాళ్ల తయారుచేసిన జాబితాలో వుంది. ఆవిధంగా ఆచిత్రం ఆశ్చర్యకరంగా 'సూర్యనారాయణ' మాస్టరు పీసయి కూర్చుంది. పోలీసువాళ్లు ఆబొమ్మను తిరిగియిచ్చినపుడు స్టూడియోకి జనం తండోపతండోలుగావచ్చారు చూడ్డానికి. ఆవూదారంగు మాసికలకోటు, చింకికాకీటోపీ, డొల్లాడొక్క, చేతిలో కర్రతో ఆ మూర్తిని చూసి మనుష్యులు మెచ్చుకోకుండా వుండలేకపోయారు. చిత్రంలోని ప్రాశస్త్యాన్నిమించి దానివెనుకనున్న ఆశ్చర్యకరమైన సంఘటం, ఆవ్యక్తి చిత్రంగా ఆబొమ్మను ఎంతోఆప్యాయంతో దొంగలాడ్డం అంతా చిలవలూపలవలూచేసి చెప్పుకున్నారు. సూర్యనారాయణ అదృష్టం పండింది. పత్రికలు ఆబొమ్మను బ్లాకుల్లో సవిస్తరంగా ముద్రించి యీ సన్నివేశాన్ని ఆశ్చర్యజనకంగా లోకానికే ప్రచారం చేశాయి.

చూస్తూండగా సూర్యనారాయణ హీరో అయి కూర్చున్నాడు. అతణ్ని ఒక్కటేవిచారం లోపల బాధిస్తోంది. ఇదే యేఅమెరికాలో న్యూయార్కులో మారుమూలగల్లీలో కాన్వాసులమీద రాసుకునే రెండవతరగతి చిత్రకారుడో అయితే వాణ్ని అమాంతం అదృష్టం గెద్దలా పైకి తన్నుకు పోగలిగివుండేది. ఏకోటీశ్వరుడో సూర్యనారాయణతోసహా ఆబొమ్మను కొనేసి తన కళాభిరుచిని రూపాయణాపైసల్లో వ్యక్తంచేసివుండేవాడు. దురదృష్టవశాత్తూ యిది సర్వతంత్ర స్వతంత్ర ప్రజాస్వామికభారతదేశం కావటం, అందులో దిక్కుమాలిన చిత్రకళకు అతీగతీకనుక్కునేవారు లేకపోవటంవలన సూర్యనారాయణ లోలోపల ఆశించినట్టుగా యేమిలియనీరో వచ్చి అథమం ఒకపెయ్యిరూపాయలన్నా అర్టిస్టు మొహానకొట్టి అబొమ్మ పట్టుకుపోవడంలాటిదేమీ జరిగుండలేదు. ఆఖరికి అతడు మీరాతో పైకనేశాడుకూడాను: 'నాబొమ్మ కొని ఎవరైనా కనీసం ఐదువందలన్నాయిస్తే .... మీరా, నువ్వూహూడా నాతో వద్దుగాని, మనం అజంతా-ఎల్లోరాలు చుట్టివద్దాం. పాపం నీకుమట్టుకు ఆ కళావైభవాన్ని ఎవరు చూపిస్తారు?' అని.

సూర్యనారాయణ మనోనేత్రంచలాలముందు 'అజంతా' కళా వైభవము నాట్యమాడింది. మన శిల్పంలోనూ చిత్రరచనలోనూ భావానికున్నంత ప్రాధాన్యము రూపానికి యివ్వలేదని కొందరంటున్నారు. చూడ్డానికి అత్యంత సుందరమైన ఆకృతులు భావప్రసారానికి అడ్డువస్తాయని వాదించేవారూ వున్నారు. సృష్టిని బహుయోచనాదృష్టితో పరిశీలించినమీదట కేవలం భావప్రకటనకే ప్రాధాన్యత యివ్వకుండా రూపభేదం, ప్రమాణం, భావం, లావణ్యం, వర్ణసంవిధానం - యీ అంగాల్నేమీ విస్మరించలేదుకనుకనే అజంతా కుడ్యచిత్రాల్ని ప్రపంచమంతా విరగబడి నివ్వెరబోయి చూస్తోంది. తెలుగువారు శిల్పంలోనూ చిత్రరచనలోనూ కడుసిద్ధహస్తులు. అజంతా నిర్మాణాన్ని పరిశీలిస్తే.... కొన్నితరాల శిల్పులు అనేక శతాబ్దాలు ఆగుహల్లో జొరబడి మానవశక్తికి

అతీతమైన యీ గుహల నిర్మాణం చేయటంజరిగింది. ఇందలి అపూర్వ చిత్రకళా నైపుణ్యం, యీనాటి వారసత్వం యేకళాకారుడ్ని వుత్తేజ పరచలేదు? అనేక వందలాది శిల్పులు చిత్రకారులు యెన్నో యేళ్ళ తరబడి ఆ అజంతా కొండల్లోబడి తాళ్ళను మలిచి, గుహలను దొలిచి మనుష్యుడి కళాతృష్ణని—అతీరనిదాహాన్ని—సువ్యక్తం చేశారు.

శాస్త్రి యీ సందర్భంలో వికటాట్టహాసంచేస్తూ అన్నాడు — 'రెండణాల పకోడీపొట్లానికున్నపాటి మారకపు విలువకూడా లేదు నువ్వు రాసే గేయానికిగాని, నీ మాష్టరు పీసని నువ్వనుకునే బొమ్మకిగాని— తెలుసా!'

సూర్యనారాయణముఖంమీద కమిచీతో ఎవరో కొట్టినట్లుగా పాలిపోయి వూరుకున్నాడు.

ప్రసాదరావు పౌరుషంగా - 'వెన్నెలకి ఎవరు ఖరీదుకడ్తారు? పాటకి ధరఎంతంటే యెవరు చెప్పగలరు? శిల్పానికి మూల్యం ఎల్లాగ కట్టడం? ఒకసుందరమైన కావ్యాన్ని ఎన్ని రూపాయనాణాల్లో కొలిచి చెప్పటం? ఇట్లాటి అసంభవమైన, అసందర్భమైన మాటల్ని వినటం నీకు దురలవాటు భాయీ.'

శాస్త్రి - 'భయ్యా, మల్లెపూలు తూచి టోకున, వందలలెక్కన అమ్ముతూంటారు. వెన్నెలను సినిమాల్లో చూపించినప్పుడు పావలా వరకూ గుంజుతున్నారాలేదా? పాటకి రేడియోవాళ్ళు నిమిషాలలెక్కన కొలిచి డబ్బుయిస్తున్నారు. రేపుప్రొద్దున్న కవిత్వాన్ని ప్రభుత్వం ఏ కుటీరపరిశ్రమలానో జాతీయంచేస్తే అవున్సులలెక్కన అమ్మకపుపన్ను కూడా వేసి మరీ అమ్ముతారు. మాటవరసకి నీ నాటకం ఎందుకూ పనికిరాకపోతే, మిఠాయిదుకాణంవాడికిస్తే, నీకు పావలా పకోడీలు మిరపకాయబజ్జీలు అందులోనే పొట్లంగట్టి యిస్తాడు. నాన్నా, మీ బ్రతుకులు ఎప్పుడో పీధినపడ్డాయి. ఈ దురవస్థనుంచి తప్పించుకోవా లని అనవసరంగా అభిప్రాయాల్ని సృష్టించుకొని వాటిని అస్తమానూ

బూజుదులిపి ఆకర్షకంగా కనబడేట్టు చేయాలనుకోవటంలో మీజీవితాలు గాజుగ్లాసులని మర్చిపోకండి. ఎవరో తన్నేస్తారు. గాజుగ్లాసులు చిట్లి పోతాయి - పెట్లిపోతాయి. ఇదీ నా సందేశం—'

సూర్యనారాయణ ముష్టివాడిబొమ్మని స్టూడియోలోంచి తీసేసి పాతపెయింటింగ్సు కట్టలలో చేర్చివేశాడు నిస్పృహతో. అతడి అజంతాయాత్రకూడా ఆవిధంగానే వర్షించని మేఘంలా దూరదూరంగా కదిలి అదృశ్యమైపోయింది. ఎవరూ చదవని ప్రసాదరావు - నాటకాన్ని చింపేస్తానన్నాడు హఠాత్తుగా.

'మీరంతా కట్టకట్టుకుచావండి. మీకోసం ఎవరూ ఒక కన్నీటి బొట్టును రాల్చరు.' తటాకంలోకి విసరబడిన రాయిలా మీరంతా యిందులో కురుకుతున్నారు. అడుక్కి జారిపోయి అదృశ్యంగా బురదలో కూరుకుపోతారు జాగ్రత్త!'

ప్రపాదరావు చిన్నముఖం చేసుకున్నాడు.

శాస్త్రి బిగ్గరగా హేళనగా నవ్వుతూ - 'కాఫీత్రాగటానికికూడా డబ్బులుండవు. వేసుకోవటానికి మంచిబట్టలుండవు. మీ అతీగతీ కనుక్కునేవారంటూ ఎవరూవుండరు. ఎవరూ పల్కరించరు. ఆదరణ చేయూత యిచ్చేవారస్సలే కనుపించరు. నిరాశానిస్పృహా మిమ్మల్ని క్రమ్మేస్తాయి. 'అడుగు'కూడా తప్పకుండా ఎవరైతే జాగ్రత్తగా జీవిస్తారో వాళ్ళదే జీవితం. రచనలు చేసుకుంటూ బొమ్మల్ని వ్రాసు కుంటూ పాటల్ని పాడుకుంటూ జీవించాలని కలలుగనటం మానెయ్యండి.'

ముగ్గురూ క్షణకాలం దీర్ఘంగా నిట్టూర్చి, ప్రసాదరావుని సంతోష పెట్టడంకోసం - అతడి 'దేవునిఎదుట-' నాటకాన్ని సమిష్టిని చదివి నాటక ప్రదర్శనాయోగ్యతల్నిగూర్చి సమ్యక్కుగా పరిశీలించటానికి చర్చలు ఆరంభించారు.

# 5

సముద్రపుకెరటాలహోరు తీవ్రంగా వుండివుండి మందంగా తగ్గి వినిపిస్తూంటుంది. తెల్లారేసరికి పూజాగృహంలో చక్కటి చిన్న మంటపంవద్ద సన్నగా దీపం వెలుగుతూవుంటుంది. తెల్లవారుజామును సూచించే భూపాలరాగం కర్ణపేయంగా నేపథ్యంనుండి వినవస్తూంటుంది. పూజామంటపంవద్ద గోపాలకృష్ణుడి చలువరాతివిగ్రహం. ఆదీపం వెలుగులో ఒక గంభీరవృద్ధమూర్తి ఒకకాగితంమీద వుత్తరం చాలా త్వరత్వరగా వ్రాస్తూంటాడు. మధ్యలో వుప్పెనగావచ్చే ఆవేశాన్ని అణచుకుందుకు పంటిని పెదవిపైవేసి నొక్కుతూ, వుత్తరం పూర్తిచేసి మడచి పుస్తకంలో పైకి కనపడేలా దాస్తాడు. బయటనుంచి ఏవోపక్షులు కిచకిచలాడినట్లు ధ్వనివస్తుంది. తొలికోడి 'కొక్కురోకో'యని కూస్తుంది. రంగంమీద ఫ్లాష్‌లైటు కుడివైపుకు తిరిగి వ్రాలినప్పుడు అక్కడ నేలమీదనే చెరగుపరచుకుని ఎడమను పూజామంటపంవైపు తలనుంచి నిద్రపోతున్న పద్మాలుగేళ్ళ చక్కనిచుక్క ప్రేక్షకులకు కనపడుతుంది. తిరిగి ఫ్లాష్‌లైటు ఆవృద్ధమూర్తివైపు త్రిప్పేసరికి, చంకలో చిన్న మూటతో, అతను ప్రయాణసన్నాహంలోవున్నట్లు తెలిసిపోతుంది. ఆయన ఆనేలమీదపడున్న బాలికను సమీపించి ఆప్యాయంతో తల నిమురుతాడు. కన్నులు తుడుచుకుంటూ లేచి కుడివైపు ద్వారంవరకూ వెనక్కి చూసుకుంటూ నడవలేకనడవలేక నడిచి ఒక్కక్షణం ఆగిపోయి పూజామంటపానికి నమస్కారంచేసి త్వరగా ఆయింట్లోనుంచి నిష్క్రమిస్తాడు. ఒక్కమారు సముద్రపు హోరు హెచ్చిపోతుంది. నేపథ్యంలోనుంచి చాలాసన్నగా భూపాలరాగం వినిపిస్తూంటుంది. ఉన్నట్లుండి తొలికోడి 'కొక్కురోకో' బిగ్గరగా అరుస్తుంది. కిటికీలోంచి వెల్తురు స్టేజిమీదకు వచ్చిపడ్డంతోనే మెల్లమెల్లగా రాధ లేస్తుంది. లేవగానే కృష్ణుడి విగ్రహాన్ని చూసి చిరునవ్వు నవ్వి సవిలాసంగా నమస్కరిస్తుంది. తలమోడ్చి, చుట్టుప్రక్కలంతా కలయచూసి 'ఏరి? నాన్నేరి? నాన్నా-

నాన్నా!' అని కేకలువేస్తూ కృష్ణుడ్ని చూసి 'అమ్మదొంగా, నాన్నేరి? ఎక్కడదాచావు, చెప్పు, చెబుతావా నిన్ను కదలకుండా కట్టేసెయ్యమన్నావా?' నేపథ్యంనుంచి మురళివాద్యం స్పష్టంగా వినిపిస్తూంటుంది. 'ఓహో! నన్నుమరిపించేద్దామనే! యివాళ నీకు పాలు, వెన్నా దక్కనివ్వను. నీమురళి లాక్కుని దాచేస్తాను. నాన్నా! నాన్నా! ఎక్కడ నాన్నా? నువ్వులేందే యిక్కడ కృష్ణుడు మరీ దొంగఅల్లరిచేస్తున్నాడు. వుండు, నాన్నను పిల్చుకొస్తాను. అప్పుడుగాని నీ చిలిపితనం కట్టదు.' తన తండ్రి తమ్మ శాశ్వతంగా వదలి వెళ్ళిపోయినాడన్నసత్యాన్ని గుర్తించలేని రాధ కృష్ణవిగ్రహంతో సరదాగా ఊసులాడుతూ కవ్విస్తూ వుంటుంది....

'ఇక్కడ - ఇదేమిటిబాబూ, యింతకృష్ణభక్తితో నీ నాయికను రంగంమీద విడిచిపెట్టావు. తండ్రిపాత్రను నాటకంలో మళ్ళీ కనపించకుండా, అప్రధానంగా, ఆదిలోనే త్రుంచేశావు. ఇదంతా ఏంపో అంటావుకాబోలు.' అన్నాడు శాస్త్రి.

ప్రసాదరావు - 'ఆపాత్ర ఇంకా భాగవతాంతరంగితయై-కృష్ణుడు నిజంగా వస్తాడు, తనతో ఆడుకుంటాడు, వేణుగానం వినిపిస్తాడు.... అని భ్రమిస్తూ తండ్రి గృహపరిత్యాగంచేశాడన్న సంఘటనను చప్పున తెలుసుకోలేకపోతుంది.'

'కారణం? ఎందుకు ఆ అభాజనుడు పండంటి సంసారాన్ని కాదని యిల్లువదలి వెళ్లాలిసొచ్చింది? - ' అడిగాడు సూర్యనారాయణ.

'అదా? అతడో ఆధ్యాత్మికజీవి, భగవంతుడిమీద గాఢంగా భక్తిప్రపత్తులు కలవాడు. అన్నింటికీ దైవమే కారణమనీ, భగవంతుడ్ని నమ్ముకుని పరమభాగవతోత్తముడిగా జీవించాలనీ ఆశయం కలవాడు.'

శాస్త్రి - 'మరే, పాపం, చక్కనిచుక్కలాటి కూతుర్ని కన్నాడుగా, ఆపిల్లనేంచేద్దామనుకున్నాడు?'

'ఆధ్యాత్మికంగా పెంచుదామనుకున్నాడు. పెళ్ళి - పెటాకులు లేకుండా భక్తమీరాలా తయారుచేద్దామనుకున్నాడు.'

'షటప్! ఒరే, నాన్నా! తల్లి వూరుకుంటుందిట్రా - గణాచారిలా కూతుర్ని తయారుచేద్దామని ఆచాదస్తపుముండావాడు పట్టుపడితే మాత్రం!'

'అంతకుముంచే రాధకు పెళ్ళిచేసితీరలానని మంకుపట్టుపట్టుకు కూర్చుంది తల్లి. ముసలావిడ ముసలాయన ఘర్షణపడ్డారు. ఆ తెల్లవారు ఝామునే ఆముండావాడు వొకవుత్తరం గిలికి పుస్తకంలో మణిచిపెట్టి తనత్రోవ తాను చూసుకున్నాడు కాశీరామేశ్వరాలకు.'

'ఐతే నీ కథానాయికను అమాంతం వీధిని పడేస్తావుట్రా! ఈ ఇల్లు వదలి వెళ్ళిపోయేముందు జరిగిన రభాసఅంతా ప్రేక్షకులికి ఎట్లాగురా బోధపడ్డం? మరోసీను ముందు తగుల్చు యిప్పుడైనా-'

'ఎందుకు? వుత్తరంవుందోయ్, అందులో అంతా చెప్పించేశాను.'

'తరువాత—'

'తల్లివచ్చి భర్త గృహపరిత్యాగంచేశాడని తెల్సుకున్నాక నానా గోలా చేస్తుంది. సంసారాన్ని నట్టేట్లో ముంచాడని నానామాటలూ అంటుంది. ఏడుస్తుంది కూతుర్నిపట్టుకుని. ఆఅమ్మాయిమాత్రం కృష్ణుడు వాళ్ళనాన్నని దాచేశాడనీ, నాన్న మళ్ళీ తప్పకుండా వస్తాడనీ మూఢంగా విశ్వసిస్తుంది.'

'ఓహ్హో! ఏవిపాథోసు!.... యింకా యేంజరుగుతుంది?'

'తరువాతసీనులో ఆగ్రామంలోని పెద్దమనుష్యులు నలుగురూ ప్రోగయి వచ్చి వెదికామని, జాడలేదని చెప్తారు. పాపం తల్లీకూతు ళ్ళిద్దరూ ఎట్లాజీవిస్తారు? ముసలావిడ మంచానపడ్తుంది. రాధ పిచ్చి దానిలా అస్తమానూ స్నానాలుచేస్తూ పూజలు, ప్రార్థనలు కృష్ణుడితో వెట్టిమొట్టిమాటలాడుతూ వుంటుంది.'

'ఇంత అసందర్భంగా నాటకానికి పనికిరాకుండావుంది నీకథ.' కొంపదీసి యెవరైనా పిపీమాతీసేస్తానంటారేమో—'

'వినండర్రా చెప్తూంటే....రాత్రిసీను. ఇంట్లో తినడానికేమీ వుండదు. బెంగపెట్టుకున్న ముసలావిడ మంచంమీదపడి మూలుగుతూ

వుంటుంది. రాధ మంచంకోడుమీద తలఆన్చి జోగుతూవుంటుంది. దీపం దేవుడిదగ్గరే కాస్తకాస్త వెలుగుతూవుంటుంది. ఈ చీకట్లో కంగారుగా దొంగలా ఒకతను లోపలకు దేన్నో తప్పించుకోవటానికి అకస్మాత్తుగా జొరబడి, ఒకక్షణం తటపటాయించి యెవ్వరూ తన్ను గమనించటంలేదనుకున్నాక మంటపంవెనుక చీకట్లో నిల్చుంటాడు. మంచంలో ముసలావిడ 'దాహం-దాహం' అని అరుస్తుంది. రాధలేచి జోగుతూ మంచినీళ్ల గొంతుకలో పోస్తుంది. బయట పోలీసుల బూట్సులు చప్పుడవులాయి.'

శాస్త్రి - 'ఆపు, పోలీసులు స్టేజిమీదకువస్తే నేనొప్పుకోను. నాటకంలోంచి వాళ్ళను తీసెయ్యి-'

ప్రసాదరావు - 'లోపల్నుంచే అడుగుతారు — 'కృష్ణమూర్తి మీయింట్లోకొచ్చాడా-' అని.

రాధ గుమ్మందగ్గిరే నిలబడి 'ఆఁ వున్నాడు - మామంటపంలో ! - వేణువు లాక్కొని దాచేశాను ! మానాన్నను దాచేశాడు, చెప్పమంటే చెప్పడు ! వెతుక్కోవమ్మని రోజూ బ్రతిమాలుతున్నాను. రండి, కావలిస్తే మాకృష్ణుడ్ని చూసివెళ్ళండి.' అని పిచ్చిపిచ్చిగా నవ్వుతుంది. 'హోరి ఆ కృష్ణుడురా. దేముడున్నాడంటుంది, లోపలకువెళ్తే పీకుతుందేమో....' అనుకుంటారు వాళ్లు. 'నేను అన్నంతినలేదు. మా కృష్ణుడికి వెన్నాపాలూ లేవు. మాఅమ్మకు ఏపీ అక్కర్లేదు. రండి, లోపలకువచ్చి చూడండి.' 'పిచ్చిదిరాబాబూ !' అనేసి వాళ్ల వెళ్లిపోతారు. రాధ లోపలకువచ్చి కృష్ణుడిదగ్గర కూర్చుని ఏవో తన సొంత గొడవలన్నీ చెప్పుకుపోతూ వుంటుంది. ముసలమ్మకు ఎక్కువవుతుంది కాళ్లూ చేతులూ కొట్టుకుంటుంది. కళ్లువిప్పి రాధను చూస్తూ - 'మనం పక్షులకన్నా హీనమైపోయాం తల్లీ ! నిన్నెవరిచేతుల్లో పెట్టేది. ఈ దిక్కుమాలినకొంపలో తినడానికికూడా లేకుండా మహాదారిద్ర్యం చుట్టుకుంది. నాకేమో అంతా చీకటిగావుంది.' అని యేడుస్తుంది.

'శాస్త్రి - అయిందీ! అప్పుడే రెండవసీనులోనే ఒకపాత్రను పర లోకానికి పంపేస్తున్నావన్నమాట. చచ్చిపోయేవాళ్ళు అంతంతడైలాగ్సు ఎల్లా చెప్పచెప్పరారు. భాయీ.'

'వినరా! తల్లి చనిపోతూంటే యీ అమాయికపురాధ చెవులో భగవన్నామస్మరణ చేస్తుంది: ఆ ముసలావిడ యిక వెళ్తున్నాను అని చెప్తుంది. రాధ, మానాన్నను దాచేశావు, మాఅమ్మనుకూడా లాక్కుపోతున్నావు అని కృష్ణుడ్ని దూరుతుంది. చీకట్లో మంటపందగ్గర్నుంచి యిదంతా చూస్తున్న కృష్ణమూర్తి ఆఅమ్మాయి అమాయికంగా యేడుస్తూంటే జాలిపడివచ్చి చేతిని పట్టుకుంటాడు. 'ఎవరు నువ్వు?' రాధ తెల్లబోతుంది. 'ఏడవకు, నేనే కృష్ణమూర్తిని. ఇప్పుడే నువ్వు నన్ను తిట్టావుగా.' రాధచేతుల్తో అతడ్ని స్పృశిస్తూ 'నువ్వు ఎల్లావచ్చావు? నాకోసమే! నాపిలుపు నీకు వినిపించిందికదూ! ఎంత మంచి హృదయం నీది! నీ నెమెలిఫింఛం మురళి ఎక్కడ? వాయిస్తే నాకు కోపంవస్తుందనుకుంటున్నావుకదూ! రాదులే.' 'నీకోసం నేను కంగారుగా వచ్చేశాను. ఆ కంగారులో అవన్నీ వదిలేసొచ్చాను. చెప్పు, ఏడవకు, నీకేంకావాలి?' 'నాకేమీ అక్కర్లేదు. నువ్వు నన్ను వదలి వెళ్ళిపోకుండా వుండాలి. మానాన్న చెప్పాడు ప్రేమతో బంధించివేస్తే నువ్వు ఎక్కడకీ కదలకుండా వుంటానని.' 'నీకోసం మీ మనుష్యుల్లా మామూలువేషంలో వుండిపొమ్మంటావా? అసంభవం! కావలిస్తే రోజూ రాత్రిళ్లువచ్చి నిన్ను చూసి పోతూంటాను. ఇప్పుడు మీఅమ్మకు బాగా ఎక్కువగా వుంది. పాపం నువ్వు వొక్కర్తెవూ....'

సూర్యనారాయణ - 'ఇంత కృత్రిమ సన్నివేశాలు ఎక్కడా చూడలేదురా బాబూ! ఓచెంప తల్లి ప్రాణం హరోమంటూంటే ఎవడో పరాయివాడిమీద పడి నిన్ను బంధించివేస్తాను, నన్ను వదలి వెళ్ళకుమంటూ నీకథానాయకి ప్రేమవెలిగించటం ఏమన్నా బాగుందీ?'

'అది నిష్కల్మషమైన వైష్ణవభక్తిరా బాబూ! మాట్లాడించకు.' అన్నాడు శాస్త్రి.

ప్రసాదరావు - 'ఈ వచ్చిన కృష్ణమూర్తి రాజకీయఖైదీ. జైల్లోంచి తప్పించుకుని వచ్చాడు. ఈసన్నివేశంలో అతడిగుండె కరిగింది.'

'బాబూ, నువ్వు చెప్పిన చక్కనిచుక్కనుబట్టిచూస్తే ఎంతవాడి కైనా గుండె కరగాలి మరి.'

'అదికాదోయ్. ఆయింట్లోకివచ్చి దాక్కున్నాడు. చీకట్లో ఆ కష్టదశ భగవంతుడిమీద మూఢనమ్మకంగల ఆ అమ్మాయి దురవస్థను చూశాడు. ఆ ముసలమ్మ మరణిస్తే ఆ రాధ ఏమవుతుంది అన్న బాధ పట్టుకుంది కృష్ణమూర్తికి.'

'అదేమిటిరా, నీ కథానాయకుడు పిల్లనుచూసి ఎక్కువ జాలిపడ్డా డంటున్నావు. చనిపోతున్న స్త్రీని చూసి ఎందుకు ఎక్కువ సానుభూతి పొందలేకపోయాడు. అతను యీ అమ్మాయికోసం వచ్చాడా లేక చనిపో తున్న మనిషికి సహాయంచేద్దామని వచ్చాడా ?'

ప్రసాదరావు యిలాగన్నాడు - 'నా హీరో యథార్థవాది. చనిపో తున్నవ్యక్తిని చూసి జాలిపడ్డం స్వాభావికమే. అతనువున్న పరిస్థితిలో తాను ఫలానా అని చెప్పడానికి రొమ్ములు విరుచుకొని ముందుకు రాలేడు. ఒక డాక్టర్నికూడా పిలుచుకురాలేడు. ఆమె తాను బ్రతకవలసినన్నాళ్లు బ్రతికింది. ఇహ మిగిలింది రాధ. ఆమె యీలోకంలో యింకా జీవించ వలసివుంది. కానైతే ఆ పెంపకంలోని దోషమో, వాతావరణపరిస్థితుల ప్రభావమో తెలియదు కాని మూఢురాలు. దైవాన్నే నమ్ముకుంది. గతించి పోయేదానికన్నా జీవించవలసినదానిపై సానుభూతి ఎక్కువచూపించాలి. తగులబడిపోతున్న యింటిని అగ్నినుండి ఎవ్వరూ తప్పించలేరు. తతిమ్మాకొంపల్ను అంటుకోనివ్వకూడదు. ఇది యథార్థమైన దృక్పథ మంటాను నేను.'

శాస్త్రి - 'రైటు. కాని నీ హీరోలో స్వార్థం బైటాయించిం దోయ్. ఆ అమ్మాయిని ఆ ముసలమ్మకాస్తా గుటుక్కుమనగానే బుట్టలో వేసుకుందామని చూస్తున్నాడు.'

సూర్యనారాయణ - 'ఒక చెంపను తల్లి ప్రాణం హరీమనేలా గుంటే నీ భక్తురాలు ఎవడో కొంపలో జొరబడ్డ కోన్కిస్కాగాడ్ని శ్రీకృష్ణమూర్తి అవతారమని కావిలించుకుంటోంది. ఇది చాలా అసందర్భం—'

'సన్నివేశాలు యేర్పడ్డ తీరులోని అసందర్భంనుంచే హాస్యరసం పుడ్తుంది.' ప్రసాదరావు తరువాత జరిగేది వివరిస్తూ - 'ముసలమ్మమంచం దగ్గరకువెళ్ళి, మీ రాధకేలోటు లేకుండా మీ తదనంతరం కంటికిరెప్పలా చూసే పూచీ నాదంటాడు. ఆఅమ్మాయి వుండిపొమ్మని పట్టుపడ్తుంది. కాదు నేను వుదయం మళ్ళీవస్తాను. ఈసంగతి ఎవ్వరితోటీ చెప్పకు, 'మా మావయ్యకు కబురుచేశాం, పట్నంనుంచి వస్తా'దని చెబుతూవుండు. తరువాత నాటకమంతా నేను చూసుకుంటాను' అని కృష్ణమూర్తి వదల లేక వదలలేక ఆఅమ్మాయిచేతుల్ని విడిపించుకుని బయట చీకట్లో అదృశ్యమైపోతాడు.'

శాస్త్రి—'నువ్వు ఆతగాడొక రాజకీయఖైదీ, జైల్లోంచి తప్పించుకుని వస్తున్నాడంటున్నావు. వెంబడిస్తున్న పోలీసుల్ని కన్నుగప్పేటందుకు యీ కొంపలో దూరాడంటున్నావు. రాజకీయజీవితంలోంచి యీలంపటంలో తగుల్కోవటమంటే చాలా అసాధారణం. నువ్వింకా కుర్రవాడివి. జీవితంలో నువ్వు శృంగారానికి కోర్కెలకి ఆడదానికి యిచ్చేటంత ప్రాధాన్యం అందరూ అన్నివేళలా యివ్వలేరు. ఒక్కొక్కరి జీవితాన్ని ఒక్కొక్క వ్యాపకంగాని కళగాని రాజకీయంగాని ఆక్రమించుకున్నప్పుడు తతిమ్మా సాధారణహీరోలు యిచ్చేటంత ప్రాధాన్యం ప్రేమలోపడ్డానికి అందరూ యివ్వరు. ఎందుకోసం నీహీరో జైలుకు వెళ్ళాడో మళ్ళీ ఎందుకోసం తప్పించుకుని యీ నువు చెప్పిన కొంపలో దాక్కొన్నాడో ఆప్రయోజనం దృష్టిలో లేకుండా అమాంతం చక్కని చుక్కని చూసి ప్రేమలో పడ్డాడంటే - చాలా అస్వభావికంగానూ అవాస్తవికంగాను వుంటుంది. అబ్బే. నీ హీరో నువ్వనుకున్నంత గొప్పవాడు కాడు.'

సూర్యనారాయణ తెలివిగా - 'శాస్త్రీ! ఒకప్పుడు కవి పాత్రను పహోలా చిత్రించదల్చుకుంటే వ్రాసేవాడి కన్నుగప్పికూడా అప్పు డప్పుడాపాత్ర స్వేచ్ఛగా రచయిత గీచిన గిరుల్లోంచి లంఘించి లవ్‌లో పడొచ్చు. ఏమంటావోయ్?'

'నాహీరో ఆ అమ్మాయిని సంస్కరిద్దామని, బొగ్గుల్లోంచి మాణి క్యాన్ని వెలికితీద్దామని జీవితంలోని యధార్ధాన్ని గ్రహించేలా రాధను మారుద్దామని ఆమెతల్లి పోగానే దగ్గరబంధువుననిచెప్పి, ఆమెను వివాహ మాడ్తానని నలుగురిలో మాటయిచ్చి, ఆ యింటికి తాళంవేసి, పట్నం చేరాడు. మన సామాజికవ్యవస్థలో స్త్రీకి భర్తగా ఆమెమీదగల సర్వహక్కులూ ఆమెను సంస్కరించటంలో తోడ్పడినట్లు మరొకస్త్రీజీవితంమీద ప్రభావాన్ని చూపటానికి అంతసుఖమైన మార్గమేదీ లేదు.'

'లేదంటే వప్పుగోం. ఎవరన్నా అందులో అందమైన అడ వాళ్ళను సంస్కరించాలంటే వాళ్ళను పెళ్లాడమే వుత్తమమైన మార్గమనా నీ సిద్ధాంతం! వారెవా?' అన్నాడు శాస్త్రి హేళనగా.

'అల్లా అందరిపరంచేసి అన్నానా నేను? ఈకేసు ప్రత్యేకం. ఇందులో నా హీరో ఆఅమ్మాయిని వుద్దరిద్దామంటే, అసలాపిల్లను ఆచోటునుంచి వాతావరణంనుంచి వేరుచెయ్యాలంటే, సంఘం ఎల్లా వప్పుకుంటుంది? ఆమెను పాడుచెయ్యటానికి తీసుకెళ్తున్నాడో బాగు చెయ్యటానికి తీసుకెళ్తున్నాడో తేల్చుకునేముందు హక్కులప్రసక్తి వస్తుందికదా! పెళ్ళాడేస్తానంటే తతిమ్మావాళ్ళు మాట్లాడరు. ఆపసుపు కొమ్ము ముడేశాక పెళ్ళాన్ని యేంచేసుకుంటే యెవరేమంటారు?'

'బాగుందిరా నాన్నా! ఒక మేకనో కోడిపెట్టనో కొనుక్కు తీసుకెళ్ళినట్టు నీ హీరో ఆ దిక్కుమాలినదాన్ని చేజిక్కించుకుని పట్నం వుడాయించేశాడు.'

'అక్కడ 'రాధ'కోసం కృష్ణమూర్తి నానాఅగచాట్లూపడి మారు పేరుతో ఎవరికోవచ్చిన వుద్యోగం ఆర్డరును దొంగిలించి నౌకరీ

సంపాయిస్తాడు.'

'తమ్ముడూ, రాధకోసం అన్న ముక్క కొట్టేసెయ్. తన సుఖం కోసం తను ప్రపంచంలో సభ్యంగా జీవించటంకోసం ప్రయ్కార్తి పడ్డాడు నీ హీరో! వప్పుకోకపోయావంటే తగూవస్తుంది మాత్రో. జాగ్రత్త!'

'సరేలే - రాధకిపేమీ తెలీవు. భగవంతుడిదయవల్నే తనూ తన భర్తా సుఖంగా జీవిస్తున్నారని నమ్ముతుంది పాపం!'

'పాపం! అనకు. ఆఅమ్మాయికి కృష్ణమూర్తిలో కాపురం చెయ్యటంలోని హాయి క్రొత్తదనం సంసారంలోని సుఖం వంటపడ్తున్నా యన్నమాట.'

'అదే - అదే, కాని కృష్ణమూర్తి అనుకున్నట్లుగా ఆమెలో జాగృతిరాలేదు. భగవంతుడు, భక్తీ, చాదస్తమూ, వ్రతాలూ, పూజలూ, భజనలు ఆయింట్లో జోరుగా సాగిపోతున్నాయి. ఖర్చులు పెరిగిపోతున్నా అప్పులుచేసి ఆమె సున్నితమైన మనస్సుని గాయపర్చటం యిష్టంలేక తన అభిప్రాయాలు ఆశయాలకు కేవలం వ్యతిరేకంగా జీవిస్తూ మానసిక క్షోభను దాచుకుంటూ యెంతపొరపాటుజరిగిపోయిందని కుమిలిపో సాగాడు కృష్ణమూర్తి.'

సూర్యనారాయణ 'హియర్! హియర్!' అన్నాడు.

శాస్త్రి 'అగే - చలో!' అంటూ చార్మినార్ సిగరెట్టు ముట్టించాడు.

'ఇంటికి రావటమంటే అతడికి భయం పట్టుకుంది. పెళ్లాం అదీ యిదీ తెమ్మంటుంది. డబ్బు విశృంఖలంగా కర్చుపెట్టేస్తుంది. దాన ధర్మాలు చేస్తుంది. బైరాగివాళ్ళకు భక్తులకూ యింట్లో భోజనాలు సత్కారాలు ఎక్కువయిపోయాయి. ఈరకంగా ఆవిడ ఆ వాడలో మహాభక్తురాలని యిట్టే కీర్తి గడించుకు పూర్చుకుంది. కృష్ణమూర్తి అన్నీ సహించాడు. అతడి రాజకీయజీవితం తారుమారయింది. పరిచ

యస్థుల్లో, మిత్రుల్లో వేళాకోళాలు అరంభమయ్యాయి. చివరకు రోజులు గడవటంకోసం ఆమెను నొప్పించలేక వృత్తిలోకూడా అక్రమాలు చిల్లర లంచాలు పుచ్చుగోవటం ప్రారంభమయింది. ఇన్నిపాట్లు పడి యింత గడ్డి కరిచి యింట్లో మగవాడు అడిగిందల్లా తెచ్చిపడేస్తూంటే ఆయిల్లాలు యిదంతా దైవమహిమ, తాను దైవాన్ని నమ్ముకుందిగనుకే కోరినకోరిక లన్నీ నెరవేరుతున్నాయని మూఢంగా గాఢంగా విశ్వసించేది.'

'ఆవిడ కోరిందల్లా తీర్చకుండా వుండలేకపోయాడా ? ఆవిడ విశ్వాసాన్ని సమ్మకాల్చి పడగొట్టడానికి నీనాయకుడు ఎటువంటి ప్రయత్నమూ చెయ్యలేదు సరిగదా, అయ్యవార్లంగారిని చెయ్యబోతే కోతి అయికూర్చుంది కాబోలు' అన్నాడు మధ్యలో శాస్త్రి.

సూర్యనారాయణ పుల్లపేశాడు - 'సంసారంలో సుఖం, అందులో అమాయకురాలైన స్త్రీని అనుభవించటంలోనిలాలసతో నీహీరో ఆమె చెప్పినట్లే వింటూ కూర్చున్నాడల్లేవుంది. పైపెచ్చు అవినీతికరంగా పీడించి ఆర్జించటంకూడా ఆమెఅలవాట్లకోసమేనంటున్నావు. మొత్తానికి లవ్‌లో పడ్డాడందూ ! తరువాయి కథ—'

ప్రసాదరావు చెప్పుకుపోతున్నాడు - 'ఈ భజనలు వెట్టిమొట్టి వేదాంతం వైష్ణవభక్తి, చాటుమాటున పేరుమార్చుకుని వుద్యోగం మరొకరి అప్లికేషనుమీద చేయటం, పోలీసులు కన్నుమూసేసి ఆరాలు చాలించటానికి ఎక్కువ దోహదకారిగా - జీవితంలో అర్థికమైనవేతప్ప మరి వొడిదుడుకుల్లేవు. నాహీరో చాలా అల్పసంతోషి. అతను ఒక వ్యక్తి జీవితాన్ని బూడిదపాలుకాకుండా నిలబెట్టగలిగినాననే సంతోషంతో ఆమె కోసం ఏమైనా చేసి తన్నులాను పంచింపుకుంటూ లోకాన్ని వంచిస్తూ తృప్తిపడసాగాడు. రాధ యీమధ్యలో ఒక ఆడపిల్లను కనేసి కూర్చుంది. సంకెళ్లు బలపడ్డాయి. కృష్ణమూర్తి పనిచేస్తున్న కంపెనీలో అక్రమ లాభాలలెక్కలకు సంబంధించిన తగాయిదాలో, ప్రభుత్వం. అవినీతి

నిర్మూలనశాఖవారి రిపోర్టుమీద పోలీసురహస్యశాఖను బెత్తాయించి కేసుర్ని పట్టియివ్వవలసినదిగా హుకుం జారీచేసింది. పేనుకు పెత్తనం యిస్తే తలంతా తెగకొరికి వదిలినట్లు పోలీసువారు కదిపిన తుట్టతో కృష్ణ మూర్తి మారుపేరుతో ఏశాఖలో పనిచేస్తున్నాడో ఆ పేరుగల వ్యక్తి ఆరాలుతియ్యగా మరొకరెవరో సంబంధంలేనివ్యక్తికి యీకేసంతా చుట్టు కుంది. ఆ అసలువ్యక్తి కంపెనీమీద దావా తెచ్చాడు. కంపెనీవారు కృష్ణమూర్తితరఫున ప్లీడర్ని పెట్టారు. సెంట్రలుపోలీసుశాఖ రాష్ట్ర ప్రభుత్వ పోలీసుశాఖనుకూడా కేసులో దర్యాప్తు చెయ్యవలసిందిగా కోరింది. చాలాదగ్గరగా కృష్ణమూర్తి ఆపేరు మార్చుకుని జైల్లోంచి పారిపోయి ఫలానాకుగ్రామంమీదుగావచ్చి యీ కంపెనీలో అర్దరు దొంగి లించి నౌకరీచేస్తున్నాడని వెల్లడయింది. ప్రభుత్వం కృష్ణమూర్తిని దాదాపు బంధించినట్లే! గవర్నమెంటు ప్లీడరు మారుపేరుకేసులో భార్యను సాక్ష్యం చెప్పటానికి సమను జారీచేయించాడు. కంపెనీవారి ప్లీడరు కృష్ణమూర్తి రాధకు నూరిపోశారు - తనభర్తపేరు చెప్పమంటే, అతన్ని ఎప్పుడు ఎక్కడ పెళ్లిచేసుకున్నదీ అడుగుతే, యీ యీ విధంగా చెప్ప వలసిందని. రాధకి కోర్టులు న్యాయస్థానాలు వీటివైనం ఏమీ తెలీదు. బోనులో ప్రతికక్షుల ప్లీడరు 'దేవునియెదుట - ప్రమాణంచేసి - అంతా నిజమే చెబ్తాను - అబద్ధం చెప్పను!' అనిపించేసరికి ఆదేవునిఎదుట - అన్నముక్క చెవినోకగానే 'రాధ' సర్వాన్ని మర్చిపోయింది. ప్లీడరు చెప్పిన పాఠమంతా ఎక్కడికోపోయింది. కృష్ణమూర్తి ఆమె కేసి దీనంగా జాలిగా ఏమంటుందో అని గుండెలు అరచేత్తో పట్టుకుని చూస్తున్నాడు. రాధ 'దేవునిఎదుట -' అసత్యం చెప్పలేకపోయింది. అతనిపేరు ఫలానా - ఫలానారాత్రి తనయింట్లోకివచ్చి తనతల్లి మరణ శయ్యమీదున్నప్పుడు....' అంతా చెప్పేసింది. కోర్టుహాలంతా ఆశ్చర్య పడిపోయారు. కృష్ణమూర్తిఖిన్నుడయిపోయాడు. అతడామెనుఅసహ్యించు కోలేకపోయాడు. చేతులారాసర్వనాశనంచేసిపారేసింది. మళ్లీ ఆరేళ్ల కఠిన శిక్షవేశారు, బేడీలుతగిలించి లాక్కుపోయారు-రాజకీయాల్లో పనిచేసినప్పుడు

నమ్ముకున్న ఆదర్శాలకోసం జైలుకెళ్ళిన తృప్తేనా మిగిలింది. ఇప్పుడు నా హీరో దొంగలా నీచుడిలా పరమదుర్మార్గుడిలా ముఖమంతా నలుపు చేసుకుని, ఒక్క స్త్రీకోసం, మూర్ఖురాల్ని ప్రేమించినందుకు శిక్షగా, జీవితంలో వోడిపోయి జైలుకటకటాలవెనక్కి వెళ్ళిపోయాడు.'

'స్ప్లెండిడ్ !' అరిచాడు శాస్త్రి.

సూర్యనారాయణ - 'తమ్ముడూ, యిక్కడితో నీ నాటకం పూర్తి చెయ్యకూడదూ ?' అని అభ్యర్థించాడు.

'ఇందులో ముగింపు ఎక్కడుందీ—?'

'అదేమిట్రా, కథమొదట్లో యిద్దర్ని చంపేశావు. చివరకి నీ హీరోని జైల్లోకి లాక్కుపోయాకగూడా యింకా నీ కసి తీరనట్లేవుందే!'

'మరి రాధ మాటో—ఆఅమ్మాయిలో పరివర్తనం చూపించొద్దూ?'

'హోరి ! . నీపరివర్తనం చల్లగుండా, చచ్చిపోతాం మేము. ఆఅమ్మాయి ఏసినిమాల్లోనో చేరిపోయిందనేద్దూ. రవ్వారట్టూ వుండదు. అంతేగాని ఎవడితో లేచిపోయిందనో ఏదో అట్లా భయంకరంగా రాస్తే వట్లయినా అనవసరంగా చాలామంది మనస్సులు నొచ్చులాయి.'

ప్రసాదరావు గర్వంగా తలకాస్త అడ్డంగా వూపాడు. 'అస్సలు నాటకంలోని గుండెల్ను బిగించే కథపట్టంతా యిక్కడ్నేవుంది. షాజహానుకి యమునానది ఆవలితట్టునకూడా తాజమహలును నిర్మించాలని వుండేదిట, ఎంచుచేతో వొకటి పూర్తయాక రెండోవైపున మొలకెత్త లేదు.'

శాస్త్రి - 'తాజమహలు నిర్మాణానికి యీనాటకానికి యేమైనా చుట్టరికమా ?'

సూర్యనారాయణ చేతులాడిస్తూ - 'అదీ కళాఖండమేనోయ్. వీరి నాటకంగూడా ఆఖండంలోనే పడితీరుతుంది.'

ప్రసాదరావు బుంగమూతి పెట్టాడు. మళ్ళీ కాస్త ప్రతిఘటించు తున్నాక - 'ఆఖరమేదీ చిక్కకపోయాక తీగ ఎట్లా తూలి నేలను ప్రాలు

టుందో అల్లాగే యీరాధకూడా వొంటరిగా స్వయంగా జీవితాన్ని ఎదుర్కో-వలసివచ్చింది. పూజలు భగవన్నామస్మరణ యింట్లోకి కావలసిన నిత్యజీవితావసర వస్తువుల్ని చేరవెయ్యటంలేదు. మానసంరక్షణకు కాకపోయినా, కనీసం 'పాలవాడి దబాయింపులవేళ - 'యింటిఅద్దె కోసం ఘర్షణపడాల్సిన సమయాల్లోనైనా దీనజనబాంధవుడు వచ్చి తొంగి చూసి పతివ్రతలకష్టాల్ని తప్పించడానికి ఎటువంటిప్రయత్నమూ చేసినట్లు లేదు. అబద్ధాలు ఆడ్డం నిత్యం తప్పనిసరి అయింది. కోర్టులో దేవునిఎదుట ప్రమాణంచేసి ఏ అబద్ధంచెప్పటానికైతే తను లొంగలేదో ఆసంస్కారము జీవితానికి లొంగిపోయింది. చేటలతో అప్పులకు యింటింటికీ వెళ్ళటంనుంచి అటువెయ్యని షావుకారుని చిరునవ్వులతో మంత్రించి వెళ్ళించి ఒకరోజు గడవాలంటే ఒక ఫీటపోయింది. తన చుట్టూవున్న పరిస్థితులు మనుష్యులు జీవితంమీద ప్రబలమవుతూన్న ఏవగింపు అసహ్యం జుగుప్స క్రోధం....అట్టడుగున దేవుడు పడి నలిగిపోతున్నాడు. ఈ దేవుడిమీద బలమైన తిరుగుబాటు ఎక్కడవచ్చిందంటే—'

సూర్యనారాయణ - ఆహహోయ్. మిత్రమా! దేవునిమీద తిరుగు తిరుగుబాటేమిటి? నీకొండా - నాబొండాను. నీ నాటకంలో నువ్వు ముట్టుగోకూడని వస్తువంటూ యేదీ వుండరాదా?'

శాస్త్రి - 'అంత మరీ ప్రతిదీ పుండు కెలికినట్టు కెలకటం మహా గొప్ప అనుకుంటున్నావు కాబోలు....బోడివాస్తవికత—'

'చూశారా! చూశారా! నేను నిజంగా పుండుమీదచేయివేశానుగనకనే మీకంత తేలుకుట్టినట్లు గెంతుతున్నారు.' అన్నాడు ప్రసాదరావు.

'ఒరే, దైవదూషణతో ప్రారంభించి ఎవడు బాగుపడ్డాడు చెప్పు?' అని కనుబొమలు ఎగరేశాడు సూర్యనారాయణ.

శాస్త్రి - 'ఒరే అబ్బీ! దేవుణ్ణి నిజంగా చేరుకోటానికి హిరణ్యకశిపుడిలా యింతకన్నా సులభమైన మార్గం మరోటిలేదురా!'

'అంటే నాటకం వ్రాయటమా?' సూర్యనారాయణ కండువాతో నోరు నొక్కుకున్నాడు పొట్ట చేత్తోపట్టుకుని.

ప్రసాదరావు బాధనుఅణచుకుంటూ - 'నేను దుఃఖమయగాథను చెప్పుకుపోతూంటే మీరు వేళాకోళం పట్టిస్తున్నారు.'

శాస్త్రి - 'ఐతే యింతకీ నువ్వు మాకు చెబుతున్నది కథా! నాటకమని కోశావన్నమాట.'

'సినాప్సిసు....' అని మూతిముడుచుకున్నాడు యువరచయిత.

'—వొరే: ఇంత బ్రహ్మాండంగా వున్నది సీరియల్ నాటకమా? తరువాయి సీనులు వచ్చేవారం చూపబడును. ప్రేక్షకులుమారినా నాటకం పూర్తిగా వేయబడును.'

ప్రసాదరావు రూక్షంగా - 'మనదేశంలో నాటకాలు రెండు రాత్రులు ఆడేవారు. ప్రతాపరుద్రీయం, కన్యాశుల్కం అట్లాటివే.'

సూర్యనారాయణ - 'కథ త్వరగా చెప్పేసెయ్ తమ్ముడూ!'

'ఏం, అక్షింతలు వేసుకుంటావా?' అన్నాడు శాస్త్రి.

'అక్షింతలన్నీ నామీదే పడుతున్నాయ్‌గా! మీకేం తీపు దిగదీసిం దని వినడానికి.'

'నీ నాటకంలో సమయానికి విలువలేకపోవచ్చు. మేం కాస్త కాలంవిలువ తెలిసిన మనుష్యులమని ఋజువుచేసుకోవాలనుకుంటున్నాం.'

ఈ నవ్వులాటంతా అయాక ముగ్గురూ కాఫీలుత్రాగారు. సిగరెట్లు ముట్టించారు. తతిమ్మా కథను చెప్పుకుపోయాడు ప్రసాదరావు వేగంగా. పసిపాపకు పోషణలేదు. పాలుకూడా కరవు. రాధయేడుస్తుంది, మొత్తుకుంటుంది. ఇంట్లో నూకలులేవు. అమ్మదగిన, తాకట్టుపెట్టదగిన, చెప్పుకోదగ్గ వస్తువేదీ యింట్లో మిగల్చలేదు. రాధాకృష్ణుల విగ్రహాలు ఎవరి కన్నా అమ్మజూపి దానితో బిడ్డను దక్కించుకోవాలని ఆలోచన తడుతుంది. పిల్లను చంకనేసుకుని విగ్రహాలు చేత్తోపుచ్చుకుని ఎక్కేగుమ్మం

దిగేగుమ్మం. లోకులు అసహ్యించుకుంటారు. ఆడిపోస్తారు. దేవతల విగ్రహాలను అమ్మదలచినందుకే యిన్ని కష్టాలు యింతదుఃఖమూను అని వారి తాత్పర్యం. ఆ విగ్రహాలకు పట్టిన అవస్థను చింతించి నిందించి దుర్భాషలాడినవాళ్ళున్నారుగాని ఆచంకలోని పాపాయియేడుపు విన్నవారు లేరు. ఆతల్లికి గుండెల్లో పాపాయి ఆకలియేడుపే నెత్తుర్ని తోడేస్తోంది. ఆబిడ్డ ఆక్రందనాన్ని ఆచేతిలోని విగ్రహాలులాగే ఘనీభవించిన లోకం వినటంలేదు. ముష్టిఎత్తటానికి లోపలున్న కసి వప్పదు. ఈ తప్పంతా ఎవరిదో ఎవరిమీద క్రోధం తెచ్చుకోవాలో బోధపడ్డంలేదు. ముష్టెత్తటం కన్నా ఏదేస్తైనా చేస్తాను అనుకుంది. లోకంలో యిల్లాటి తెగిపోయిన గాలిపటాల్ని సంప్రోక్షీకరించి లోకలుకట్టి మళ్ళీ ఆకాశంలో ఎగురవేసే సాహసికులు కొందరున్నారు. వీళ్ళని సాహసికులనటం సమ్మతంగా వుండదు. ఈమె అమ్ముడుపోని దేవరావిగ్రహాలకు మారుగా తనబిడ్డను ఎవరైనా దయతల్చి తీసుకుంటారేమో....కొంత దుఃఖం తగ్గుతుందని యత్నిస్తుంది. ఈ వింతప్రయత్నంలో నలుగురూ నాలుగు చీవాట్లూ వేస్తారు. ఈ గలటాలో సాహసికులు, తెగిపోయిన గాలిపటాల్ని ప్రోగుచేసే మహానుభావులు పోలీసుల్నుంచి బాధను తప్పించి యిచ్చకంగా తీసుకుపోతారు కబుర్లుచెప్పి. తన కళ్ళు తెరిచేవున్నాయి, తన్నెవరూ మోసంచేశామని తృప్తిపడనక్కర్లేదు. పాపాయి దక్కింది అదేచాలు, అంతకన్నా అధోలోకం నరకం మరివుండబోదు. జేబుదొంగలు త్రాగుబోతులు, వేశ్యలు, ఖూనీకోర్లు, జూదగాళ్ళ - యీ ప్రపంచంలోకి పలకని రెండు దేవతావిగ్రహాలఆస్తితోవచ్చి స్థిరపడిపోయింది. త్రాగుడు, దొంగతనాలు, జూదం యీమూడింటితో జీవితం ముడిపడ్డాక గతమంతా గుర్తుకురాని మసకబొమ్మయింది. పెదిమలకు ఎర్రటిరంగు పూసుకుని పెద్దకొప్పుజుట్టి దానినిండా బండెడుపూలు తురిమి జులాయివెధవలతో రాసుకునిరాసుకుని తిరుగుతూ పేకాటలు ఆడుతూ అడపాతడపా బస్సుల దగ్గర సినీమాహాలుల్లోనూ స్టేషను ప్లాటుఫారాల్లో జనసంద్దల్లో జేబుల్ని కొల్లగొట్టడంవరకూ వచ్చింది మార్పు! అంతా యేదో మైకంలో

వున్నట్లు జీవించేది. ఆవిడ యెప్పుడూ భర్తను జ్ఞాపకంచేసుకోలేదు. చః జరిగినదానికంతా కసితీర్చుకోవలసింది భగవంతుడిమీదే! ఆమె దగ్గరికి పోలీసులు దొంగలు దొరలు కుర్రవాళ్లు అంతా వచ్చేవారు. సుఖంకొనుక్కుని వెళ్లిపోయేవారు. తను పాడయింది. రోగాలపుట్ట శరీరం! దీనికోసం తెలీక ఎగబడే లేతవయస్కులని, అప్పుడేవిచ్చిన యౌవ్వనంలో తెలీక దారితప్పివచ్చిన కుర్రవాళ్ళను నరకయాతనలో పడదోసి వారి భవిష్యత్తును జీవితాల్ని పాడుచెయ్యటానికి తను జంకేది. దేనికి జీవితం యింకా వుందో యేది క్రొత్తగా స్వచ్ఛంగా సహజంగా వుందో దాన్ని చేతులారా పాడుచెయ్యటం మహాదుర్మార్గం. తన బిడ్డను యీజీవితానికి దూరంచేసేటందుకు యత్నించి చివరకు అనాథశిశుసంరక్షణాలయంలో చేర్చివేసింది. ఈ కొరకొంచులాటి దేహంతో యింకెన్ని నవప్రసూనాల్ను కాల్చివేస్తానో అన్న జిజ్ఞాసతో వ్యాపారం తగ్గించి జూదం జేబులుకొట్టడం త్రాగటం ఎక్కువచేసింది. ఇది జీవితంలో పతనమనుకోలేదు. ఈపతనానికి ఆమెకు విచారించటం తెలియదు. ఈలోగా ఒకరోజు రాత్రి బాగా పన్నెండుగంటలవుతుంది. వర్షం జోరుగా కురుస్తూంటుంది. బెజవాడప్లాటుఫారంమీదకు ఏదో బండి వచ్చి ఆగుతుంది. జనం ఎక్కేవాళ్లు దిగేవాళ్లు తొడతొక్కిడిగా వుంటుంది ఈరాధ ఆ హడావిడిలో ఎవరిదో ఆసామీ జేబుకొట్టేస్తుంది. కాని ఆవ్యక్తి చప్పున రెక్కపుచ్చుకుని లాంతరుస్తంభంమేరకు లాక్కుపోయి చూస్తాడు. ఆరంగువేసుకున్న పెదవులు. కట్టెలా యవ్వనం హరించిపోగా మిగిలిన కాగితపు పువ్వు. ఆ మహాభక్తురాలు రాధాదేవి! తన భార్య!.... భార్యే!.... జేబు కొట్టేసింది. అతడు కృష్ణమూర్తి! 'నువ్వా!....నువ్వే!....నువ్వు నిజంగా మేల్కొన్నావు.' అని చేతుల్తో ఆమెను పొదివిపట్టుకుని - 'నువ్వు ఎల్లా జీవించావు యేంచేశావు యివన్నీ నేనడగను. అవన్నీ నాకనవసరం. నువ్వు మారావు. ఈవాళ నువ్వు దొంగతనం చేయగలిగినందుకు నేను చాలాగర్విస్తున్నాను. నీలో యేశక్తి మేలుకోవడంకోసం యిన్నియేళ్లుగా యెదురుచూశానో, ఆకనకదుర్గాబెండసిర్లహం జూలు

దులిపి ఆవులించింది. పోదాం రా - ఈ అగ్గి రాజుకుందంటే పతితస్త్రీలు చెరగుల్లో నిప్పుల్ని కట్టుకుని తిరుగుతారు. నామట్టుకు నేను రాజకీయ జీవితం వదిలి సంసారంలో పడ్డాను - దొంగనయాను - నీచుడిగా జైలుకివెళ్లాను. ఇన్నాళ్లూ విచారించాను. దేశంకోసంనమ్మిన మార్గం వదలి యీలంపటం తగుల్చుకుని యేమీసాధించలేకపోయానే అని పశ్చాత్తాపపడ్డాను. పశ్చాత్తాపం అనవసరం. ఈ మేలుకున్న శక్తితోటే నీవు ముందుండు, నేను అద్భుతాలుచేసి చూపిస్తాను. గొప్పగొప్ప త్యాగాలు చెయ్యటానికి గొప్ప ధర్మబద్ధమైనజీవనులే అర్హులని జనం అనుకుంటారు. క్షుద్రులు, నీచులు, పతితులు, కులటలనేవ్యక్తులుకూడా పనిబడితే మీ మహాపురుషులుచేసిన త్యాగాలకు మించి బలిదానం చేయగలరు. ఆ చౌరవ ఆశక్తి ఆజాగృతే దేశానికి కావలసింది. నాజీవితం, నా అవకతవకలతో ఎవరికీ ప్రసక్తిరానవసరంలేదు.' కృష్ణమూర్తి - రాధ మళ్ళీ కలుసుకున్నారు. ఈమారు కామంలేదు. భక్తిలేదు. ఎవరికి కావలసినంత జీవితానుభావం వాళ్ళకు పుష్కలంగా వుంది. పోర్చుగల్లువారి రాజ్యం 'గోవా' సమస్య వచ్చింది. సత్యాగ్రహులు శాంతిసమరాన్ని నడుపుతున్నారు. పెద్దపెద్ద దేశాల్నుంచి యీ నిరాయుధులకీ పశుశక్తికీ సంఘర్షణ ఎట్లాజరుగుతుందో, చూస్తూచూస్తూ తుపాకులకు గుండెలిచ్చి చస్తామని తెలిపే జనం ఎట్లా ముందుకుపోతారో చూడ్డానికి చాలామంది వచ్చారు. కృష్ణమూర్తి-రాధ సత్యాగ్రహుల్లో కలిసిపోయారు. ఒకనాటి దళాన్ని ఎవరో గోవాపొలిమేరల్ని దాటిస్తున్నారు. అక్కడొకొండ గుహలోంచి మనుష్యులు వెళ్లాలి. ఆసొరంగంలాటి మార్గం ముఖద్వారందగ్గర మెషీనుగన్నుపెట్టుకుని గోవా పోలీసులు కూర్చున్నారు. ఎవరువెళ్తే వాళ్ళను మసిచేస్తారు. దళంలో ముందునిలబడగలిగినవాడే లేడు. అందరూ జంకారు. కృష్ణమూర్తి యిల్లాగివ్వండని జెండా తీసుకున్నాడు. సొరంగంలోంచి ముందుకు యుగయుగాలుగా మానవులకు యేదేశాలవారైనాకానీ స్వాతంత్ర్యంపట్ల ఎందుకంత ఆకాంక్ష వుంటుందో, ఎంతలేసి బలిదానాలు ఎందుకుచేస్తూంటారో, ఆ మహత్తర సందేశాన్ని

గుప్పిట్లో యిముడ్చుకున్న సైనికుడిలా గోవాలోకి నడిచాడు. గన్ ప్రేలింది. పోర్చుగీసువారు శవాన్ని, కుప్పగాకూలిన యోధున్ని రాటాకు మంటలువేసి పెట్రోలుపోసి ఎదురుగా వెదురుగడలకు కాళ్లు వ్రేలాడగట్టి తలక్రిందుగా తగలబెట్టారు. అమెరికన్ రిపోర్టర్లు రాధను యిండియా భూభాగంలోకి లాక్కుపోయారు. ఆవిడ అంతా చూస్తూంది. ఆజ్యోతి బ్రహ్మాండంగా ప్రకాశిస్తూ విశ్వమంతా నిండిపోయింది. తొలినాడు, అజ్ఞానమనుకున్నప్పుడు, వైష్ణవభక్తిలో యే ఆనందం లభించిందో - దాన్తో పోల్చిచూసుకున్నప్పుడు, తను జేబులో పర్సుకొట్టేసినప్పుడు యేశక్తి నారీజగత్తులో మేల్కొన్నదని తనభర్త మురిసిపోయాడో, ఆశక్తిని ప్రపంచంలోని ప్రజలకు స్వేచ్ఛాపథాన్ని చూపటంకోసం, స్వాతంత్ర్యం ఎంత మహత్తరమైనదో దానిరుచి కోణకోణాల్లోకి ప్రసరించాలనే దృఢనిశ్చయంతో అదేరాత్రి గాఢాంధకారాన్ని చీల్చుకుంటూ తనభర్తను సగంసగంకాల్చి వదిలేసిన చోటుకు ఆమంటల్లోకి, ఆ నెత్తురు చర్మం మెలికలుతిరుగుతూ తెట్టలుగా కారుతున్న క్రొవ్వు మాంస పేశలాన్ని, ఆవీరుడి చేతిలోంచి పెరికిపారేయబడ్డ జాతీయపతాకను, నెత్తుటిలో తడిసిన ఆమహాస్వాతంత్ర్యచిహ్నాన్ని మీదనుకప్పుకుని గోవా భూగర్భంలోకి తిన్నగావెళ్ళి అదృశ్యమైపోయింది.

శాస్త్రి ఒక్కమాటు లేచి ప్రసాదరావుని ఎత్తుకుని స్టూడియోలో పరుగులెట్టాడు. సూర్యనారాయణ బిగ్గరిగా 'ఇంక్విలాబ్ ! జిందాబాద్ !' అని అరిచాడు.

మీరావచ్చింది - 'ఇంక్విలాబ్ జిందాబా' దేవిటని.

శాస్త్రి — ప్రసాదరావు జుట్టులోకి వ్రేళ్లుపోనిచ్చి దువ్వుతూ — 'తమ్ముడూ, నువ్వు నాటకం వ్రాయి, నవల వ్రాయి, కథవ్రాయి, లేక పోతే కావ్యంగాచెప్పు. ఈకథ యింతపొడుగ్గావున్నా ఇదంతా నాటకంలో యిముడ్చటం యేనుగును లక్కపిడతలో దూర్చటంవంటిదైనా నీకు హృదయముంది. ఉద్రేకంవుంది. పైకొస్తావు. అందులో నాలాటివాడు నీప్రక్కనవున్నాడు. అది ముఖ్యంగాగుర్తుంచుకో....'

సూర్యనారాయణ, శాస్త్రి అకథంలా తర్జనభర్జనలు జరిపినమీదట ఎట్లా కత్తిరించి పొదుపుగా బలంగా నాటకం తయారుచెయ్యాలో ఆలోచించారు.

సూర్యనారాయణ - 'మీరా, నువ్వింందులో యాక్టుచెయ్యాలిసుమా !' అన్నాడు.

ఆకాగితాల్ని పుచ్చుకుని చదివిస్తానని మీరా చకచకా వెళ్ళిపోయింది. 'కొంపముంచారేం!' అని ప్రసాదరావు గుండెల్ని బాదుకున్నాడు.

# 6

శాస్త్రి ప్రసాదరావును వెంటేసుకొచ్చాడు. గేటు మూసేసివుంది. లోపల ఎడమతట్టున నూతిదగ్గర వొంగుని నీళ్ళుతోడుతోంది మీరా. అప్పుడే స్నానంచేసినట్లుంది. పూడాచీరె - వొదులుగా వ్రేళ్ళాడుతూన్న కొప్పు బుజంపంపుల్ని రాసుకుంటోంది. బిందెను చంకకెత్తుకుని ముందు కుచ్చెళ్ళను కాస్త పయ్యారంగా యెత్తిపట్టుకుని పెదిమ కొరుక్కుంటూ యేమో ఆలోచించుకుంటూ సన్నటి కాలిబాటగుండా అడ్డువచ్చిన పారిజాతంమొక్కను చేత్తో వొత్తిగించుకుంటూంటే-ఆ ఆకులమీంచి జలజలా రాలాయి-

'పుష్పవర్షం! పుష్పవర్షం!' శాస్త్రి వినపడేలా అరిచాడు. మీరా తలెత్తి చూసింది - వొంటిమీదపడ్డ పూలన్నింటినీ దులుపుకుంటూ -

'రావచ్చా....గేటు మూసేసుంది.'

మీరా దడిదాకావెళ్ళి రాసుకుని నిలబడి 'పిల్లేచు. నేను తలుపు తియ్యను.'

బింపె కాస్త కదిలింది. రవ్వంతనీళ్ళు తొణికిసలాడి చీర వొక పెడంతా వొంటినంటుకునిపోతూంటే శాస్త్రి గేటుమీదే చేతుల్నివుంచి

రాస్తూ 'మీమీదపడ్డ పూలన్నింటినీ దులిపేశారుకాని యింకా మీ బిందెలో నీళ్ళమీద ఎర్రగా బొడిపెలూ తెల్లగా సున్నితంగా అపారిజాతాలు.... పాపం వాటినేం చెయ్యకండి....నన్ను తీసిపారేశినట్లు....అబిందెలోనే అట్లా నవ్వుతూ తిరగనియ్యండి.'

'మీ నాటకాలవాళ్ళని కొంపలోకి రానివ్వద్దని గట్టిగా వొట్టేసుకున్నాను.' రెండు చేతుల్తో బిందెను కావిలించుకుంటూ ముఖం కాస్త ప్రక్కకుపెట్టి అదోలా నవ్వింది.

ప్రసాదరావు శాస్త్రిని వెనకనుంచి చొక్కాపుచ్చుకు లాగుతున్నాడు.

'ఉండవోయ్! ఆవిడ నిన్నేమీ పీకపిసిగెయ్యదులే నేనుండగా.... ఏవండోయ్, మీరేమన్నా చెయ్యదల్చుకుంటే ముందర నాపని పూర్తిగానిచ్చి ఆతర్వాత మనవాడిపంతు. సరా-'

గేటుమీద చేతుల్నివేసి దారికి అడ్డంతప్పుకుంటూ - 'ఆయన్ని రానిస్తాను....పాపం!' అంది మీరా తలుపులాగుతూ.

శాస్త్రి - 'తమ్ముడూ, ఆడవాళ్ళనోటినుంచి 'పాపం!' అన్నముక్కరాత్తే ముందుజాగ్రత్త చాలాఅవసరమన్నమాట. నాకేం నిష్పూచీ.... నన్నెవరేంచెయ్యగల్రు?'

'ఈవాళమీనాక్షిచేత పాడిద్దామనుకుంటున్నాను. మాస్టారువినాలె.... సూర్యనారాయణగారింటికెళ్ళి ఆపిల్లను తీసుకురారాదూ నేను రమ్మన్నానని.'

'అన్యాయం! అన్యాయం! నేను రమ్మంటేమాత్రం రాదా - నేను పాడమంటే ఆపిల్ల పాడదా? నాకేం వ్యక్తిత్వంలేనట్లూ కేవలం ఆడపిల్లల్ని అక్కడ్నించి యిక్కడకీ యిక్కడ్నుంచి అక్కడికీ వెంటబెట్టుకు తీసికెళ్ళే పెద్దమనిషిగా చిత్రించేసారు. అవమానం! ఘోరం! ఆగోడకు మేకు కొట్టండి. ఈ బొగ్గులబస్తా సాయంపట్టండి. వెళ్ళి జట్కాపిల్చుకురండి. ఈ హార్మోనియం బాగుచేయించండి. ఇందుకా నేను పుట్టింది?'

'ఉప్మాచేసి సిద్ధంగా వుంచుతాను. టీ తయారుగా వుంటుంది మీరూ మీనాక్షీ వచ్చేసరికి. సరా—'

'పదవోయ్ ప్రసాదరావు....'

'ఎందుకు? ఆయన్ను వుండనివ్వండి....మీరిద్దరూ వెళ్తే మళ్ళీ తిరిగిరారు.'

'ఐతేవుండవోయ్....వుప్మాలోకి మిరపకాయల ముచ్చికలుతీస్తూ.' శాస్త్రి యింకా గుమ్మం మెట్టు దిగకుండానే మీరా బిందెబరువుతో ప్రసాదరావు అనుసరించగా లోపలికి వెళ్తూ 'మీరెక్కడన్నా దారిలో అలా వస్తూ వోఅరా నిమ్మకాయలు తెండి. వుప్మాలోకి నిమ్మకాయ పిండకపోతే యేంబావుంటుందీ?'

శాస్త్రి రోడ్డుదాకా పోయొచ్చి 'సూర్యనారాయణను పిలవ్వొచ్చా....' అని బిగ్గరగా అడిగాడు.

'ఆయన్ను పిలవొద్దు. తండ్రి దగ్గరుంటే మీనాక్షి సరిగా పాడదు' అని మీరా లోపలకు వెళ్ళిపోయింది.

సందుదాటి శాస్త్రి కాలవకట్టమీదకొచ్చాడు. ఏదో బస్సు దుమ్ము రేపుకుంటూ వచ్చిఆగింది వంతెనమీద. అదుమ్ములో సైకిలు త్రొక్కుకుంటూ పోతున్న సూర్యనారాయణను శాస్త్రి కేకేసి ఆపుచేశాడు. తన కెక్కడో ఫొటో ఆర్డరుందని తీసుకుందుకు యేదోగ్రామం వెళ్తున్నానని చెప్పాడు.

'మరి కెమేరా—?'

కెమేరాబస్సులోవెళ్తోందనీ, పైగా కుర్రాడువున్నాడనీ, తను యెందుకు బస్సులో అనవసరం సైకిలుమీదపోతే కలిసొస్తుందనీ అనేసి కాస్త నవ్వాడు. సూర్యనారాయణ సైకిలుకి ఒక ముక్కోణాకారపు కాన్వాసుసంచీ కట్టించాడు. అందులో ఒక అద్దం దువ్వెనా పవుడరు డబ్బా రెండురకాల 'సైెలు, ఒకటిరెండు జరీమడతల వుత్తరీయాలు యింకా ఫొటోలుతీయడంలో వుపయోగపడే చిల్లరసామగ్రి వుంటుంది. గాలి కొట్టేందుకు పంపుకూడా వుంటుంది.

శాస్త్రి దిగులుగా చిన్న మందహాసం విసిరాడు - 'మీయింటికే వెళ్తున్నా....'

ఏమన్నట్లు సూర్యనారాయణ చూశాడు.

'మీ మీనాక్షి యింట్లోవుందా - స్కూలుకెళ్ళిపోయిందా ?'

'ఏం ? దాన్నెక్కడికేనా తీసుగెళ్దామనా ? నీ పొడంటే గిట్టదు మాయావిడకు. అది నోరుచేసుకుంటుంది. ముందేచెబ్తున్నా జాగ్రత్త !'

'అవంతానీకనవసరం. ఆవిషయం నేను చూసుకుంటానులెద్దూ_' అని కదిలిపోయాడు శాస్త్రి. కాలువనీళ్లు నల్లగావున్నాయి. మేఘాలు చెట్టాపట్టాలువేసుకుని పేరంటానికెళ్ళివస్తూన్న ముత్తైదువుల్లా గుంపుగా నిలబడి వంగినీళ్ళల్లోకి తొంగిచూస్తున్నట్లున్నాయి. కాలువగట్టమ్మటే శాస్త్రి నడకసాగించాడు. శాస్త్రిని వెంబడిస్తూ కాలువలో తళతళా మెరిసి పోయే మబ్బుతునకల్నీ. గట్టుమీది కొమ్మలు రెమ్మల నీడల్నీ, చీల్చు కుంటూ యేదో బురదపాము నీళ్ళల్లో యీదుకుంటూ సాగిస్తున్నది పందానికి. ఎవరో స్త్రీ అరటిపువ్వురోపురంగు చీర చుట్టుకుంది - ఆ ఎండలో, కాలవలోంచి, నీళ్లోడుతున్న కేశాల్తో, ఎర్రలామరిమొగ్గలా లేస్తోంది. ఆ తాళ్ళమీద కాళ్లు నొక్కుకుంటూ వొంగుని నున్నటి గుండ్రటి బుజాలమీదుగా చుట్టలుచుట్టుకుని వుడుకుతున్న పాయలు పాయలైన జుట్టు, బట్టల్ని పిండుకుంటే స్పష్టమయే సౌందర్య రేఖల్నూ పోల్చుకుంటూ ఆరోడ్డు దిగి వూళ్ళోకి రద్దీగావున్న జనంలోకి వెళ్లి పోయాడు శాస్త్రి.

బజార్లు, దుకాణాలు, అరుపులు, గ్రామఫోనుప్లేట్లగోల, క్రిక్కిరి సిన మేడలు, మిద్దెలు, లాంతరుస్తంభాలు, సైకిళ్లు, రిక్షాలు, కార్లు, ముష్టివాళ్లను తప్పించుకుని దల్లో ఎక్కడో నెరసినపెంద్రుకలా, సొంట రిగా, దిగులుగా, గతుకులుగా, మెలికలు అష్టవంకరలు తిరిగిన కాలిబాట గుండా సూర్యనారాయణ నివాసాన్ని సమీపించాడు. ఆ వీధిలోకివున్న పెద్దతరహాయిళ్లన్నీ ముఖాల్ని పెద్దరోడ్డుకేసే త్రిప్పుకుని, ప్రక్కవాటా

లపూ, వొద్దిగుమ్మాల్నూ యీ పీఠిపైపు కనబడేటట్లు - జీబురుగా-సూర్యరశ్మిరాదా ఘామినిరాకనిస్తుకుండా, పరాయివాళ్ల వొడ్ల లోంచి జుబ్లుపిరనోసుకున్న జామ, సపోటా, మామిడి, కొబ్బరి చెట్లూ - పడుల మీద ప్రాకుతూపోయే గుమ్మడి, ఆనప పాదులూ - యిళ్లల్లో పనుల్లో చిన్నబట్టలు కట్టుకుని హడావిడిగా తిరిగే ఆడవాళ్ళూ, ఒకరు పడిమించి, యింకొకరు అడుగుమీదనుంచుని కబుర్లాడే అమ్మలక్కలూ, గాలికి ఎగిరే దండాలమీది చీరెలూ, యీ లోకంలోంచి సూర్యనారాయణ పెంకుటిల్లుముందుకొచ్చి నిలబడ్డాడు. ఇల్లు పీఠిమీదకు లేదు. లోపల ఎత్తుగావేసిన పునాదిమీద చక్కగున్నంచెయ్యని గోడలతో ముందు అవసరార్థం పెంచిన అనవసరపు వసారా అష్టవంకర్లతో, ఎవడో చిత్రకారుడు కాన్వాసుమీద సగంసగం పనిచేసి విడిచిపెట్టిన బొమ్మలా చుట్టూ యేపుగా శ్రద్ధతో పెంచిన అరటిచెట్లు, కొబ్బరిమొక్కలు, బంతిపూలచెట్లు, వెనకవేపునుంచి యింటిమీదకు ప్రాకుతున్న మొండి తీవర్లతో చూపర్లకు యెట్టి ప్రాముఖ్యాన్ని ప్రత్యేకతను కలిగించలేక పోయినప్పటికీ, అక్కడ 'సూర్యనారాయణ, ఫొటో ఆర్టిస్టు' అని యింగ్లీషు అక్షరాల్లో కట్టిన బోర్డును చూస్తే కాస్త నవ్వు రాకమానదు. శాస్త్రి పశువులు మేకలు వచ్చి తోట పాడుచెయ్యకుండా నామకార్థం నిర్మించిన గేటును త్రోసుకుని వసారాలోకి యింకా రాలేదు—

'అక్కా - అక్కా - అక్కా -' ఒకటే బుల్లిబుల్లి కేకలు విడవకుండా. వెనువెంటనే 'చుట్టాలొచ్చారే - చుట్టాలొచ్చారే....' మళ్ళీ అదే మాటల్ను పదేపదే అంటోంది. శాస్త్రి కాస్త తటపటాయించి చూశాడు. ఎవ్వరూలేరు బైట. వసారాలో అంతరిక్షాన పంజరంలో చిలుక రెక్కల్ను టపటపా కొట్టుకుంటోంది. పూచల్ను ముక్కుతో పొడుస్తూ - వొకకాలుతో పంజరాన్ని గీరుతూ, మళ్ళీ అదేధోరణి. 'అక్కా - అక్కా - అక్కా -' మాసిపోయిన పరికిణీ చిరుగులకు చేతుల్ని అడ్డంగా కప్పుకుంటూ వచ్చింది మీనాక్షి. పరిసరాల్తో నిమిత్తం లేకుండా విజృంభించే భావాల్లా యెదిగిపోతున్న ఆమెవొళ్ళు - బంగారం

నగా నవ్వటా అవసరంలేకుండా యేదో పొరపాట్ల మిన్నట్టు తళతళా మెరిసి పోయే దేహకాంతీ, హల్వాముక్క కోసినట్టు మృదువుగా - వ్రేలు ఆనిస్తే మాసిపోతుందనిపించే చెంపలూ, పొడుగాటి వ్రేళ్ళూ - ఏదో అపూర్వ కళాసృష్టిని దర్శిస్తూన్నట్టు క్షణకాలం స్తంభించిపోయాడు శాస్త్రి.

'కాఫీ తెచ్ - చ్చావా! చుట్ - ట్టాలొచ్చారు -' మళ్ళీమళ్ళీ అదే ముక్క రెక్కల్ని టపటపా కొడ్తూ ముక్కుతో వూచల్ని పొడుస్తూ 'అక్కా - అక్కా - అక్కా -' చెవులు గింగుర్లెత్తిపోయేలా గుంది.

అరవింద అంటచేత్తో లోపల్నుంచి 'పలకవేం మొద్దా....ఎవరు వాకిట్లో?' అంటూ వచ్చి శాస్త్రిని చూడగానే 'అయ్యో; గుమ్మంలోనే నిలబడ్డావేం రా తమ్ముడూ! బొత్తిగా యీ గుమ్మం త్రొక్కడం మానే శావులే - అదేవిటే పిచ్చిమొద్దా మావయ్యను కూర్చోమనకుండా ఆ దిక్కులుచూడ్డమేవిటేం?'

మీనాక్షి దాచుకుంటూన్న చేతుల్ని అయిష్టంగా తీసేసి, మంచం వాల్చి, కూర్చున్నాక, 'మంచినీళ్లు కావాలా?' అని సూటిగా కళ్ళలోకి చూస్తూ అడిగింది శాస్త్రిని.

లోపల 'యేం చెప్పను' అనుకున్నాడు. ఆమె దాచుకున్న దేన్నో అతడి కళ్లు దోచుకుంటున్నాయి. క్షణంలో ఆ మైకంనుంచి తెప్పరిలి 'ఈ మీనాక్షి యిల్లా ఎదిగిపోతోందేమా అని ఆశ్చర్యంలో మునిగి పోయా, చెప్పొద్దూ! నేను మనస్సులో వున్నమాట పైకనేస్తాను.'

'అవునా, నీపాటి జ్ఞానం యిన్నేళ్ళొచ్చాయి ఆ పెద్దమనిషి కుండొద్దూ! వెధవజులాయిసజ్జసంతా వెంటేసుకుని వూళ్లో బజా లూపగానే సరా! ఇంట్లో కూతురు యీడేరిందని ఆపాటి తెలుసుకో లేని తండ్రి యేంతండ్రయ్యా?'

శాస్త్రి కాస్తపులిక్కిపడ్డాడు. అనుకున్న తుఫాను ఎల్లానూవచ్చింది. దాన్ని తాను ఎట్లానూ అడ్డలేడు. కాస్త ఎగసనదోస్తేనే మంచిది. తానూ ప్రవాహంలో పడాలి.

'కట్టుకోడానికి సరైన గుడ్డముక్కలేక యీవాళ నాకూతురు స్కూలుకి పోలేదు. దానివొళ్ళు కప్పలేకపోతున్నామనే జ్ఞానం యేమన్నా వుందా యీ మనిషికి? ఆ స్టూడియో కాలిపోనూ, అందులో కిటికీతెరలకు కట్టిన పరదాగుడ్డలు నా కూతురికి యేడాది కట్టుగుందుకు వస్తాయి' అని చేత్తో తుడిస్తూ కళ్ళనీళ్ళబెట్టుకుంది అరవింద.

'ఈ భూమి పగిలిపోవలసిందే అంటాను శరత్తు యిట్లాటిచోట్లప్పుడు' - అనుకున్నాడు శాస్త్రి.

'పిల్ల నాటకాలు పిల్ల సినిమాలు బొమ్మలు సంగీతాలు కవిత్వాలు అన్నీ తగలబెడిపోనూ - కట్టుకున్న పెళ్ళాన్నీ కన్నకూతుర్నీ అలో లక్షణా మని యేడ్పించి యేంబావుకుంటాడు?'

ఈ మనిషి నోరువిప్పితే ఒక్కక్షణకాలం నిల్చోలేకపోయానే, జీవితకాలమంతా యీ హంసధ్వనిరాగాల్ని వింటూ సూర్యనారాయణ యెట్లాజీవిస్తున్నాడబ్బా! అని పీవుతడుముకున్నాడు శాస్త్రి.

మీనాక్షి సమయానికి విశాలాక్షి వచ్చింది మంచినీళ్ళగ్లాసుతో - 'అంటచేత్తో నిల్చున్నావేం! లోపలికిపోవేం' అన్నది తడవుగా.

అరవింద 'ఇప్పుడేవస్తా' నంటూ లోపలకు తప్పుకుంది.

'మీనాన్నచెప్పాడు: యింటికిపోవద్దు, అరవింద నిన్నూ నన్నూ కలిపి తిడుతుందని.'

'నాన్న కనిపించాడా....' కొంచెం నవ్వింది మీనాక్షి. ఆమెపళ్ళు ఏదో కుంచెలో గీసిన తైలవర్ణచిత్రంలో తెల్లని రేఖలా అందంగా కనిపించాయి. బుగ్గలు కాస్త పొట్టపడ్డాయి. ఆ కళ్ళలో ఏదోదైన్యం, బాధ దిగులు చీకటితెరలకుమల్లే దిగసాగాయి. శాస్త్రి సిగ్గుపడుతూ తలకాయ వాల్చుకున్నాడు. రెండుబుజాల్ని అరచేతుల్తో కప్పుకుని దాచుకుంటూ మంచాన్నానుకుని నిలబడింది మీనాక్షి.

'స్కూలుకు పోలేదేం?'

'నాన్న డబ్బు తెస్తానన్నారు. బజారుకు పోదామనుకున్నాం.' గొంతుక ఆగిపోయింది.

'చీరె కట్టుకోరాదూ ?'

'నేను చీరకట్టుకుంటే దావుంటానా ?'

శాస్త్రి తలపూయించాడు. ఆ పిల్ల ముఖమంతా మెఱుపుమెరిసినట్లయింది.

'కాపీ తెచ్చ్ - చ్చావా ! చుట్ - ట్టాలొచ్చారు -' పంజరంలో చిలక పదేపదే అర్థంలేకుండా పలుకుతోంది. సమయమూ సందర్భమూ లేకుండా పిల్లలు మాట్లాడతారు. సమయమూ సందర్భమూలేకుండా పక్షులు మాట్లాడుతాయి. అందుకే ఆనందిస్తాము. శాస్త్రి మీనాక్షిని చేయిపుచ్చుకుని ప్రక్కన కూర్చోబెట్టుకుంటూ - 'మీనాన్న నిన్ను బజారుకు తీసుకెళ్ళి బట్టలుకొనిపెట్టమన్నాడు నన్ను.'

'నిజంగా ?....' శాస్త్రిచేతిని విదల్చుకుంటూ 'అమ్మాఅమ్మా' అంటూ లోపలికి పరుగెత్తింది మీనాక్షి. పంజరంలో చిలక టపటపా రెక్కల్ను కొట్టుకుంటోంది. 'అక్కా - అక్కా - అక్కా' అంటూ. శాస్త్రి లేస్తూ 'చప్పున వస్తావా రావా - నాకు బోలెడు వనుంది' అంటూ త్వరపెట్టాడు. లోపల తల్లితో తను కట్టుకునే చీర యేదన్నా యిమ్మని అడుగుతోంది మీనాక్షి. అరవింద మళ్ళీ చదువుతుందేమో ననుకున్నాడుగాని—పెద్ద చీరెలో బుట్టబొమ్మలా వచ్చిన మీనాక్షిని వెంటేసుకుని శాస్త్రి పన్నెండుగంటలకి 'మీరా' గడపముందు నిల్చాడు. సూర్యుడప్పుడే నడినెత్తికి ప్రాకాడు.

'రావేఁ మీనూ -' మీరా ఆప్యాయంతో శాస్త్రి చేతుల్లోంచి లాక్కుంది ఆ పిల్లను. మాస్టారు తలెత్తిచూశారు. వజ్రంలాంటిపిల్ల ! ఆ చేతకానికట్టు ఆ చీరెలో బుట్టబొమ్మలా - అర్థంతెలియని పదాల్ని వాడిన అసందర్భకవితలా యిమిడికగాలేదు. ఆభావం మాస్టారిలోంచి మీరా చప్పున లాక్కుంది తెలివిగా. ప్రసాదరావుకు మీనాక్షి చాలా

బావున్నట్లే ఎక్కడా యేలోపమూలేనట్లే తోచింది. కృష్ణమూర్తిగారు ఎంబ్రాయిడరీపని చేస్తున్నారు. తెల్లటి లాంగ్‌క్లాత్‌మీద చక్కటి రంగు దారాలతో కుట్టిన 'మేనకావిశ్వామిత్రము' గోడకు తగిల్చివుంచారు. సూదీదారం పుచ్చుని వోపిగ్గా 'గాంధీజీ' బస్టును లాంగ్‌క్లాత్‌మీద ఎంబ్రాయిడరీ తీస్తున్నారు. శాస్త్రి నోరుతెరుచుకుని నిలబడ్డాడు - మీరా, ప్రసాదరావు, వుషా్మ, అరవిందవడ్డించిన తిట్లు, మీనాక్షికి యిచ్చిన వాగ్దానం అంతా మర్చిపోయి.

కృష్ణమూర్తిగారు ఆ కుడుతూన్న ఫ్రేమును క్రిందవుంచుతూ 'ఇప్పటికి పందొమ్మిదిసార్లు యీ కన్ను కుట్టాను - విప్పాను. గాంధీజీ దృష్టి - ఆచూపు లాక్కురావటం సాధ్యంకావటంలేదు. అదితేలేకపోతే యీ బొమ్మంతా వృథా—'

శాస్త్రి - 'వింటున్నావా - నీ నాటకం కొంచెం జాగ్రత్తగా జీవితాన్ని ప్రతిబింబించేట్లు రాయరా నా తండ్రీ! మీకు మళ్ళీ కాపీరాయటానికే చిరాకు. మహాకవివాక్కులా వ్రాసింది కొట్టెయ్యననే సెంటిమెంటు! రాస్తే క్లుప్తంగా ఘాటీగా శక్తివంతంగా వుండాలి ఏద్రైనాసరే! కళాప్రపంచంలో ప్రథమశ్రేణి పనితనానికే విలువ! అదే కీర్తి! అదే డబ్బు! ఏరచనకైనా శిల్పం చాలా గొప్పబలాన్ని యిస్తుంది. క్రొత్తదనం ఎప్పుడూ పోకుండా వుండాలి. శాశ్వతమైన విలువల్ని పోషించుకుంటూ హృదయంలోంచి యేరచనఐతే ప్రవహిస్తుందో - (కొంచెం ఆగి) - యివన్నీ వుత్తమరచనాలక్షణాలు-'

మీనాక్షి లోపల్నుంచి బ్లూ జార్జెటు చీర కట్టుకుని బంగారు చిలకలా పరహాలమొలకలా వచ్చింది నవ్వుతూ. శాస్త్రి చిటికెవేస్తూ—

'తళుకుతో నీరూపు తలుసుకొని తలుసుకొని
పీకట్లో నా కళ్ల పిల్లులడ సూడాలి
ఆరిపేయవె దీపమూ—'

'ఫో మావయ్యా!' ఒక చిన్న హస్తముద్రపారేసింది మీనాక్షి.

'మీనాక్షీ, పాడవే బంగారమ్మగారిపాట -' మీరా వుప్మా పంచి పెడ్తూ - 'మాస్టారూ, బంగారమ్మగారికవిత విన్నారూ, మీనాక్షే పాడాలి—'

శాస్త్రి - 'నాకూవచ్చు, నేపాడలా - నన్నెవరూ పాడమన్రే?'

మబ్బుపిల్లలా మడికాళ్ళేసుకుని కూర్చుని ఆ పొడుగాటిఁవేళ్ళతో కోవాముక్కలాటి చెంపమీద చేతినాన్చి మోచేత్తో నడుంలోకి గుచ్చుకుంటూ తల కాస్తవంచి నాజూగ్గా కుడిచేత్తో నేలనువ్రాస్తూ గొంతు విప్పింది మీనాక్షి—

'అందాలు తానె చూసింది,
నీటిలో చందాలు తానె చెప్పింది
నాతోటి,
వొద్దున్న మందార వొంగి బొట్టెట్టుకుని,
అందాలు తానె చూసింది!'

చెరువుగట్టున చెరువులోకి వంగున్న మందారచెట్టు నీళ్ళలో తన అందాన్ని తాను చూసుకుని బొట్టెట్టుకుంటోన్నట్టు వుందిట.

'సొగసెల్ల చూసేను సొమ్మసిలిపోయేను.'

కాదామరి! ఆ అందం అల్లాటిది. ఈ వొక్కటేకాదు యింకా వింతల్ని చూపెడ్తాను రమ్మంటున్నది.

'చెట్లంటిపాములే చెరువెల్ల పాకేయి,
అందాలు తానె చూసింది.'

చెట్లంటిపాములు చెరువెల్లా పాకాయట. చెప్పటం చాలా కష్టమనిపించే దృశ్యాన్నికాని భావాన్నికాని, సొంపుగా పొందిగ్గా చెప్పటం యిందులో ప్రత్యేకత. మాటలు వెదుక్కుంటూ ఆవిడదగ్గరకు వస్తాయి. సాధారణంగా పొడుగాటి లేతకొమ్మలు నీళ్లలో అపైనుంచి నీరు పరుగెత్తుతూన్నప్పుడు ఆ కదలికలు చెట్లే పాములని భ్రమింపచేసేటంత అందంగా పాకుతూన్నట్లుంటాయి. ఈ వింతల్ని చూస్తూండగా సంధ్యపడ్డది.

'ఆవింతల్ని చూసింది,
అప్పుడే ఆకాశ పడలిపోయింది
గజగజా వొణికి తా గట్లపై కొరిగింది,
సూర్యుడే చెట్టెక్కి చూడ భయపడ్డాడు!
అందాలు తానె చూసింది!

ఆ సంజె యెల్లాగుందంటే: యీ వింతల్ని చూసిన ఆకాశం గజ గజా హడలిపోయి చెట్లమీదకొరిగింది. సూర్యుడంతవాడే చెట్టెక్కి చూడ్డానికి భయపడ్డాడు. తరువాత చీకటి—

'జుట్టెల్ల విరియబోసింది
మందార బొట్టెట్టి చెదిరి రాలింది!'

మందారచెట్టు జుట్టు విరబోసుకున్నట్లుగా వుంది' ఇట్టె అట్టె బొట్టుకాస్తా చెదిరి రాలిందట. ఆడదానికి బొట్టు చెదిరిరాలటం ఎట్లాటి బీభత్సం - మరి ఆ మందారపువ్వురాలిపడిపోయింది. ఆ కొమ్మ ఆ పువ్వు అట్లా బొట్టులా వంగుని నీళ్ళలో అందాలుచూసుగోవటం, సంజెరావటం. తరువాత చీకటి, జుట్టు విరబోసుకున్నట్లు, బొట్టు చెదరి రాలినట్లు అశుభంగా—

'గట్లగుండెలు కలగ, మెట్లకన్నులు చెదర—
వొంగున్న మందార వొంగియే వుంది ఆ
అందాలు తానె చూసింది,
నాతోటి
మందార మాటలాడింది.'

ఆపాట ఆగిపోయింది. ఆ రసతరంగాల్లో యింకా వూగిసలాడుతున్నట్లే వున్నాయి వాళ్ల మనసులు. ప్రసాదరావు కాస్త బెరుకుగా 'కప్పతల్లిపాట నాకు చాలాయిష్టం -' మీనాక్షికేసి చూసి తలదించేసుకున్నాడు.

మీరా - 'శాస్త్రిగారూ, మీరూ పాడరాదూ . వొచ్చుగా.'

శాస్త్రి కాస్త గొంతు సవరించుకుంటూ - 'అంతా వరుసగా వినండి, కాస్త జాగ్రత్తగా వినండి. నేను 'ఉంటి' మాచుట్టాలమ్మాయి పెళ్ళి కెళ్లాను. మనదేశంలో పెళ్ళిళ్ళంటే బోలెడంత డబ్బు ధ్వంసమన్న మాటేగా—'

ప్రసాదరావు కొంచెం నొచ్చుకుంటూ - 'మనదేశంలో పెళ్ళిళ్ళ అనే విషయంమీద మీరు ఒకవ్యాసం వ్రాయచ్చుగా. అది ఇప్పుడెందుకు?'

శాస్త్రి గ్రుడ్లురిమిచూశాడు - 'పెళ్లి నాలుగురోజులూ తిండీ, వడ్డనలు, పేకాట, తగూలు యథావిధిగా గడిచిపోయింది. నాలుగోనాడు పెళ్ళికూతురుచేత పాడించారు. ఆఅమ్మాయి సిగ్గుపడుతూ ముద్దుముద్దుగా పాడింది.

'ఏమి ఆనందమహా, ఏమినీ
చందమూ, ఈజిహ్వా చాలదెటు
వెఱుకసేయుదు దేవ !'

'పెండ్లికొడుకుకూడా సిగ్గుపడనారంభించాడు. అంతా నవ్వాము. నేను చెవులు రిక్కపొడుచుకు విన్నాను—

'కాంతిమయమగు రూపు గాంచలేనుర ప్రభూ!
కంటిలో
చినపాప,
కరిగినీరౌతుంది,
గట్లురికిపోతుంది!
ఏమి ఆనందమహా, ఏమినీ....'

'ఆపిల్ల పెండ్లికొడుకుమీద పాడుతున్నదనుకున్నారంతా. నాకు కాస్తలోకాస్త అర్థమయింది. ఇదేదో తాత్త్వికరచన! భగవంతుడి కాంతిమయరూపాన్ని సాక్షాత్కారంచేసుకున్న జీవి ఆ కాంతిమయ రూపాన్ని చూడలేక ఆఖరికి 'కంటిలో చినపాప, కరిగినీరౌతుంది!'

అంటే ఆనందబాష్పాలన్నమాట. నేను యింత అందమైనపాట గూఢా ర్థంతోవున్నది యీపిల్లకెవరునేర్పారుచెప్మా అని విస్తుపోయాను.

'ఆవరించిన హావ మలుముకున్నది నన్ను
వియుక్తనై నిరోస అతికిపోతానురా
ఐక్యమవుతానురా, ఏమి ఆనందమహో!'

గొల్లుమన్నారు ఆడవాళ్లు యిదేదో పెళ్లిబ్రయినింగు సంగీతమను కుంటూ. నేను పెళ్లిపాటన్నీ అడిగాను. బంగారమ్మగారు చెప్పింది. ఆవిడ యిక్కడేనా వుంటున్నది - అన్నాను అమ్మాయి. కలుసుకోవాలి మాట్లాడాలనే ఆశతో పరుగెత్తుకెళ్లాను. అంతకుముందే 'కన్నతల్లిపెళ్ళి' అహాంటి.' పైవాళ్ళల్లో చదివి, పాడి ఆనందించినవాళ్ళమే: నాకు ఎందుకు గర్వమనిపించిందంటే - తెలుగుదేశాన, ఒక గ్రాసుపట్టా పదవులు నింపడానికి పనికొచ్చే కవితాసంపుటితో మదరాసుపరుగెత్తి హైదరాబాదు పోయి పూలదండలు సన్మానపత్రాలు చదివించుకునే కవులకు పట్టుపడని తెలుగుపుట్టింటిమమకారం కమ్మదనం యీపెలోని ప్రత్యేకత. పెద్ద పండితురాలు కాదు - ఎక్కడ విద్యావంతురాలు కాదు. తెలుగు గ్రామాల్లో పల్లెపట్టుల్లో పుట్టి పెరిగిన యిల్లాలు. ఈకవితావేశం యింత సహజంగా ఎక్కడ్నుంచి వచ్చింది? ఎంతపూహ - యేమి గొప్ప కళాసృష్టి? ఛాయావాదైనా సొగసుగా అందంగా సహజంగా చెప్పటం ఆవిడసొత్తు. నేను మీకోసంవచ్చానండీ అన్నా - అంతే - ఎంతో సంతోషించింది. నేను మీకన్నతల్లిపెళ్లి పాడతారండీ అన్నా. పాపా - ఆవిడ 'పెద్దదాన్నైపోయాను నాయనా. ఏవోరాసాను. మా జనార్దనరావు వుండేవాడు పాపం, వాడు నేరాసిన గీతాలకు పేట్లుపెట్టి ఉడయిని, ఛాయల్లో వేయిస్తూండేవాడు' - అంది. ఆవిడ కవితమీద కురిసిన వుత్తరాలవర్షం తెచ్చి చూపించింది. 'బెజవాడ వెళ్తున్నావు. సత్యనారాయణగారికి నమస్కారాలు చెప్పు! ఏమో అనుకున్నాను, శ్రీ శ్రీ బాగా వ్రాస్తాడే....' చాలాకాలానికి నన్నుచూస్తే ఆవిడకు కవితావేశం కలిగిందికాబోలు. 'మహాప్రస్థానంచూశా - 'ఈ నిరాశామయలోకంలో కదనశంఖం పూరిస్తు

న్నాను - అందుకో యీ చాచినహస్తం - ఆవేశించునాలో' - అంటాడు. ఈముక్కలన్నాక ఆవిడ కళ్ళనీళ్ళు పెట్టుకుంది. ఇప్పుడేం వ్రాయటంలేదా అని అడిగా. ఏదో ఆడవాళ్లు వచ్చి యేమన్నా పాటలు రాసిపెట్టమని వేధిస్తే వ్రాస్తాను. వినమంటూ ఆవిడ 'అసూయ' అన్న పాట విని పించారు.

'వంగి చూచెనే ఆ
యంగన మనమున గినియుచు వంగి, వంగీ చూచెనే!
మురిపెములో నీదు మోము
ముద్దులాడు సఖుడు విభుడు
మరపున నన్నుంచితె యనుమాటయె
బోయై నిను పగ నొంగీ చూచెనే
వంగి, వంగీచూచెనే!
రంగులెన్నో చేసి పతిని
లొంగదీసుకొన్నది మును
ఇంగితంబెరుగక నా సంగనాచి దొంగ గంగ!
వంగీ చూచెనే -
తొంగి, తొంగీ చూచెనే!
మనసులోని యుడుకునకును
జడలయుడుకు తోడుగాగ
వడివడి పొంగలగ పుడమిని
బడువెపమున బడతి ని న్నొంగీ చూచెనే
వంగి, వంగీ చూచెనే!'

(ఈ కవిత గంగా పార్వతుల కయ్యంనించి ఉద్భవమయింది.)

చప్పున మీనాక్షి- మావయ్యా, ఆపాట నాకు రాసివ్వవూ?' అంది.

'నాతోకలిసి పాడు. పాట దానంతటదే వస్తుంది నీకు.'

ప్రసాదరావు 'కన్నతల్లిపాట' పాడమంటూ మీనాక్షిని బలవంతం చేశాడు.

శాస్త్రి ప్రేలాకేసి తిరిగి - వానకురుస్తూంటే ఏదో చిత్రం గీయాల నుంచన్నారు మీరు. వానకురవటంచూసి ఆవిడ యీపాట అల్లారు - 'కష్టమ్మ గడపతొక్కినదీ, శుభమన్న సూచనలు చూరు చెప్పినది: కష్టాలెగిరే వానలమ్మా, పొలములూ కనకమే పండురాయమ్మా:' ఈ జాతీయమైన కవితాసంపత్తిని కాలేజీలలో, స్కూళ్ళలో చదువు కుందుకు మన పిల్లలు నోచుకోలేదు. శాంతి పావురాయిల్ని నెత్తి నెక్కించుకుని బుట్టలో పెటిపెటకపోవుంచని చెప్పేకవితకు యెంత విశిష్టత వున్నదవుందో 'పొద్దున్నమందార పొంగిదొ పెట్టుకుని అందాలు రాసె చూసింది నీటిలో చందాలు రాసెచెప్పింది' అన్నప్పుడు అంతనవ్యత, అంతవిశిష్టత కనిపించి ముగ్ధన్నయిపోయాను. ఇటువంటి కవితను పొందడానికి మనం సరియైన వారసులమనిపించుకునే స్థితిలో లేము.'

కృష్ణమూర్తిగారు యిలాగన్నారు: 'ఈనాటి కవితారంగంలో ప్రతిబింబిస్తున్న భీతి, ఆందోళన, అసంతృప్తి, కసి - వీట్లమధ్య నిజమైన కళాదృష్టి శాంతిసౌందర్యాలు అడుగునపడిపోతున్నాయి. ఏ గూఢ కవిత్వాన్ని బంధకవిత్వాన్ని నీరసమని, జటిలమనీ, ప్రయోజనరహితమనీ తిరస్కరించాల్సివచ్చిందో అంతకన్నా క్లిష్టమూ, జటిలమూ. కుటిలమూ అయిన కవితను దిగుమతిచేసుకుని మురిసిపోయారు నవ్యులు. చివరకు కమ్యూనిటీప్రాజెక్టులమీద పంచవర్ష ప్రణాళికలనుగూర్చి కవితాగానం చేయవలసిన దుర్గతి మనకు పట్టేట్లుంది.'

మీనాక్షిబుజాలమీద చేతులుంచి మీరా యిలాగన్నది: 'ఈప్రజా స్వామ్యంలో లలితకళలన్నీ యిలాగే గుంటపువ్వులు పూస్తాయి. ఇవి ఎవరికీ అక్కర్లేదు. ఎవరూ ఆదరించటంలేదు. ప్రజలకోసమంటూ వీటిని చెక్కబుచ్చుకు బలపంతాన గుంజి నలుగుర్లో పడవేయటమే కనిపిస్తోందిగాని యీ లలితకళలు ప్రజలజీవితంతో ఒక అంతర్భాగం కాలేకపోతున్నాయి. అంటే ఎవరికోసం రాస్తున్నామో చేస్తున్నామో వారికివేమీ అక్కర్లేదు. ఇది ఒక ప్రలోభం, యిదంతా మోసం, నటన:

ప్రజలజీవితంలో స్థానం ఆక్రమించుకున్నదల్లా ఒక్క సినీమాయే! చాలా చవకరకపు కళాసాధనం! ఇది ఈయుగంలో తతిమ్మాలలితకళలు సంగీతం, నాట్యం, నాటకం - వొహటేమిటి అన్నింటినెత్తినా తలో మొట్టికాయవేసి మూలనుకూర్చోమంది. ప్రపంచపుబాధఅంతా మనకు పట్టుకుందిగాని మనబాధ యెవరికీ అక్కర్లేదు. మనమంతా 'అనవసరం.'

కృష్ణమూర్తిగారు - 'సాహిత్యం యెవరు ఆదరిస్తున్నారు? కేవలం పత్రికలు-అవి ఎవరు కొంటున్నారు? చాలాభాగం మధ్యతరగతి మనుష్యులు....ఈమధ్యతరగతే యింకా బాగా బలపడాలి, పటిష్ఠంకావాలి. సాహిత్యం వచ్చిపడేది పిల్లలోనే. పిరంతా స్కూళ్లలోనూ, కాలేజీల్లోనూ ఆపుదం - చేదుమాత్ర మింగినట్లు తెలుగుభాషాభ్యాసంచేస్తారు. మన భాషలో సాహిత్యంలో వెల్లువలా వచ్చిన మార్పులూ చేర్పులూ వుజ్వలమైన కవితా పైపైన బయటేతిరుగాడుతున్నాయి. ఈ మధ్యతరగతిలో వుత్సాహాన్ని ఆసక్తిని అభిలాషను కలిగించటానికిమారుగా మన విశ్వవిద్యాలయాల్లో బిళ్లలో తెలుగు మొక్కబడిచదువుకింద తయారయింది. ఈవిశ్వవిద్యాలయాలు ప్రభుత్వం మన తెనుగుసాహిత్యానికి ఆధునిక మహాయుగానికి చేసినటువంటి అవమానం అగౌరవం యేదేశంలోనూ యేభాషకూ జరిగివుండదేమో! వ్యావహారిక భాషోద్యమం సాధించవలసిన అంతిమవిజయం యిదే. ఇటీవల తెలుగుసాహిత్యం పోయిన తీరు తెన్నులు-ఆసంపదనంతా పంచుకుందుకు వారసులు తయారుకావటంలేదు.'

శాస్త్రి కొంచంఅయిష్టంగా - 'ఈమధ్యతరగతి అంతా దొంగలు బాబూ! చాలా స్వార్థపరులు....ఏయెండకాగొడుగు పడతారు. ఉచ్చనీచాలులేనిజాతి. పుస్తకాలు పత్రికలు కొనకుండా చదువుతారు. ఆడబ్బులు మిగిల్చి సినీమాలు చూస్తారు. లైబ్రరీల్లోంచి పుస్తకాలు కొట్టేస్తారు. పదిమందికుపయోగించే ఆయోజన ఏదన్నావుంటే దాన్ని స్వార్థం కోసం ధ్వంసంచేయడానికి వెనుకాడరు. కవితాకన్యను తీసికెళ్ళి పీళ్ళ వొళ్లో కూర్చోబెట్టడమా....గబ్బిలాలు.'

మీరా ఇటూఅటూ చూసింది - 'మాటలసందట్లో పీక్లేమయి నట్లు....' మీనాక్షి ప్రసాదరావు కనపడ్డంలేదు. కృష్ణమూర్తిగారు ఎత్రాయిడకేగుడ్డను మళ్ళీ వొళ్ళోకి తీసుకుని గాంధీజీకన్నా సరిచేయనారం భించారు. మీరా చేత్తో సైగచేసి శాస్త్రినికూడా లేపుకెళ్ళి దొడ్డిగుమ్మం లోంచి చాటుగా చూడమంది - పారిజాతపుమొక్క క్రింద బట్టల ఖాతిమీద మీనాక్షిచూప్పుని కప్పతల్లి పెళ్ళిపాట కాదోలు సన్నగా పాడుతోంది. ఏదో గడ్డిపరకను పంటితో కొరుకుతూ నూతిగట్టునానుకుని నిలబడి ప్రసాదరావు ఆమెకేసిచూస్తూ వింటూ మురిసిపోతున్నాడు. శాస్త్రి మీరా లోపలికొచ్చేస్తూండగా, శాస్త్రి 'మొదటిపాఠం.' అని ముసిముసిగా నవ్వాడు. మీరా ఆలోచించుతుంటోంది - ప్రసాదరావు మంచికుర్రాడు. మితభాషి. ఏదో ప్రత్యేకమైన వ్యక్తిత్వాన్ని కాపాడుకుంటూన్నట్లుంటాడు. చిన్నవాళ్లకావటంచేత వాళ్ళిద్దరూ ఒకచోటచేరి పాడుకుంటున్నారు, మాట్లాడుకుంటున్నారు. ఇద్దరూ ఆరోగ్యంగాఉన్నారు. ఆ యిద్దరూ వొక ర్నొకరు మెచ్చుకు ప్రేమించుకోకూడదూ? అల్లాజరిగితే చాలా బాగుం టుందికూడా. వాళ్లు పెళ్ళాడితే పెద్దయి సుఖపడ్తారు. జీవితంలో వాళ్లను సుఖపడనివ్వకుండా అడ్డుకొనేదియేదీ వున్నట్లులేదు. మీరాహృదయ మంతా పానుభూతితో నిండి పోయింది యీారకంగా.

శాస్త్రి - 'తెల్లారిలేస్తూనే యివాళ నాచేత దొంగనాటకమాడించారు. మీనాక్షికి బట్టలుకొనిస్తానని వాళ్లనాన్న డబ్బు నాచేతికిచ్చాడని అబద్ధ మాడేశాను. అల్లాచెప్పి వాళ్ళయింట్లోంచి ఆపిల్లను బయల్దేరదీసు కొచ్చాను యిక్కడికి. నిజంగా కట్టుకోడానికి బట్టలులేవు. స్కూలు కూడా మానేసి యింట్లో కూచ్చుంది. ఇక్కడ ప్రసాదరావు ప్రేమపాఠాలు మొదలెడ్తున్నట్లున్నాడు....'

మీరా కాస్తనొచ్చుకుంటూ - 'ఈచిన్నతరంవాళ్ళ ప్రేమని మనం మన్నించడం నేర్చుకోవాలిసుమండీ! అల్లాఅనకండి. బాగోదు....' అంది.

'మీకేం! మీరు అల్లాగే అంటారు. మధ్యన నేను తినాలి వాళ్ల అమ్మచేత చివాట్లు సాధింపులూను. ఇప్పుడీపిల్లను యిట్లాగే యింటికి గనుక తీసుకెళ్తే వాళ్లమ్మ మళ్ళీ గడపతొక్కనివ్వదు నన్ను.'

'మరి బట్టలుకొంటానని ఎందుకు చెప్పాడు?'

శాస్త్రి కాస్త విచారంగా కనిపించాడు - 'నేను నిజంగా చాలా జాలిపడ్డాను, ఆపిల్ల బట్టలులేక స్కూలుకెళ్లలేదంటే విని. వాళ్లమ్మ ఏమందో తెలుసా! ఆ స్టూడియోలో తెరలకు కట్టినగుడ్డలు పెడితే నాకూతురు యేడాది శుభ్రంగా బట్టలు కట్టుకోగల్గుతుందనీ....సూర్య నారాయణ అసమర్థతను నేనుగూడా పంచుకోవాలనిపించింది. అట్లా ఎందుకనిపించిందో నేనిప్పుడు సరిగా చెప్పలేను.'

ప్రసాదరావు మీనాక్షీ యిద్దరూ ఒక్కసారే లోపలికొచ్చారు. వాళ్ళిద్దరూ నవ్వుతూన్నట్లున్నారు. ఆయిద్దరి కళ్లల్లోనూ ఏదో క్రొత్త కాంతి మెరుస్తోన్నట్లుగావుంది. ఆ స్వచ్ఛతను సహజతను కాపాడవలసిన వాళ్లు లామేనని భావించుకుంటూ శాస్త్రీ, మీరా వొకరికేసొకరు చూసు కున్నారు.

మీనాక్షి - 'మామయ్యా, బజారుకు వెళ్తాపున్నావ్?' అని మీరా కేసి తిరిగి 'నీచీర యిక వొదిలేస్తాను....'అంది.

మీరా - అగవే, నువ్వుహూం తొందర....' అని బుజాల్నిపట్టుకుని నొక్కింది గట్టిగా. మీనాక్షి నవ్వుతూ రెక్కల్ని టపటపాకొట్టుకునే చిలకలా గిజగిజ లాడుతూండగా 'ఇప్పుడే వస్తానమ్మా! వచ్చి నిన్ను తీసుకెళ్తాను. మనం బట్టలు కొనుక్కుందాం' అంటూ ప్రసాదరావుతో సహా అదృశ్యమయ్యాడు శాస్త్రి.

# 7

సూర్యనారాయణ లాంతరు స్తంభం వేయించినచోట వ్రేలాడుతున్న 'నేషనల్ ఫొటోస్టూడియో' బోర్డుకు దిగువను యిటీవల్నే ఒకకుర్రాడు 'బూట్ పాలిష్' కేంద్రాన్ని స్థాపించాడు. అక్కడో తూముకూడావుంది. ఆతూముకివతలనుంచిపోయే పెద్దరోడ్డుమీద కొంచెందిగువగా వొకపెద్ద

చింతచెట్టు వుంది. దానిక్రిందను యిటీవల్నే వొకకిల్లీదుకాణం వెలిసింది. చింతచెట్టునానుకుని ఒక 'ఏకపాత్రఏకాంకిక'లా కాఫీ కేంద్రంకూడా వెలిసింది. ఒక కుంపటితోకలిసిన యిత్తడిబాయిలరు, కెటిలు, నీళ్ళ బాల్చీ - యిదీ సన్నాహం. ఈనడుస్తూండే కాఫీహోటలుకు రోజంతా ఎన్నోచోట్ల నియామకంగా కాతాదారులుంటారు. ఈ కిల్లీషాపు ఎదురుగా రెండు మామిడిచెక్కబెంచీలు రోడ్డుమీదకు వేసుంటాయి. ఇంకా రెండు యినుపకుర్చీలు ప్రాతవికూడా వున్నాయి బయట. ఈకాఫీ త్రాగటానికి వచ్చేవాళ్ళ ఎప్పుడన్నా యీబల్లలమీద కూర్చోవటం సంభవిస్తే తప్ప కుండా తగూవస్తుంది. సూర్యనారాయణ లాంతరుస్తంభంవేయించాక యీకాఫీబాయిలరు రూముకట్టువైపు 'బూట్‌పాలిష్' కుర్రాడు ప్రక్కకు వెళ్ళిపోయింది. ఆజాగాలో వొక ముసలమ్మ చక్కిరాలదుకాణం పెట్టింది. అందులో వేరుశనగకాయలు చెఱుకుముక్కలు జామికాయలుకూడా దొరుకుతాయి. ఈ కిల్లీదుకాణంలో పగలల్లా ఎవరో మీసాలవ్యక్తి కూర్చుంటాడు. దీపంపెట్టగానే పెదిమలకు రంగేసుకున్న వొడుగాటి వెకిలిచూపుల అమ్మాయి వొకర్తి కొట్టులోకూర్చుంటుంది. సినీమాలకెళ్లే టప్పుడు సినీమాలు వదిలేశాకకూడా జనమంతా యిటే వస్తూపోతూం టారు. ఎప్పుడన్నా కుంటీ గ్రుడ్డీ ముసలివాళ్లు యీఛాయలకువస్తే వాళ్లను కిల్లీకొట్టుమీసాలవ్యక్తి తరిమేస్తూంటాడు. చక్కిరాలముసలమ్మ, బూట్ పాలిష్‌కుర్రాడు, నడుస్తూన్నకాఫీకొట్టు అంతా యీ మీసాలవ్యక్తి కను సన్నల్లో మెలగవల్సిందే. ఈ మీసాలవ్యక్తిమీద 'జెంట్స్ అండ్ లేడీస్ అవుట్‌ఫిట్టర్సు షాపు' మస్తాను అధినేత. ఆవలయంలో యేంజరి గినా సర్వాధికారి మస్తాను. మస్తాను, యీ మీసాలవ్యక్తి, అందరూ కూడా సూర్యనారాయణను చాలాగౌరవిస్తారు. అతడి లాంతరుస్తంభం ఆకీర్తికి నిదర్శనం. ఇటీవల్నే ఆ లాంతరుస్తంభానికి వో ఖాళీచెక్క బోర్డును సూర్యనారాయణ తగిలించాడు. మేడమీద ముందుభాగంలోకూడా చాలాపెద్దసైజు ఖాళీసైనుబోర్డు చేయించి వీధిమీదకు నదరగావుండేట్లు యేర్పాటుచేశాడు. ఈ రెంటిమీదా సినీమాలు నాటకాలపోష్టర్లు అంటింపు

తూంటారు. ఈ ప్రకటనసదుపాయానికిగాను నాటకాలు సినిమాలవాళ్ళు కొంత అద్దెకూడా ఆరుమాసాలకో యేడాదికో మాట్లాడుకుని యిస్తూంటారు.

మస్తాను దుకాణంలో సూర్యనారాయణ తీసిన అందమైన ఆడవాళ్ళ ఫొటోలు యింకా రకరకాల పోజులు - ఆ పటాలు - వ్రేలాడతీసి వుంటాయి. ఆ కిల్లీదుకాణంలోకూడా కొన్నిఫొటోలు ఏవోవంతెనలు ఎవరో దుబ్బుజుట్టుమగాళ్లా వెకిలినవ్వులఆడవాళ్ళూ, వొంగుని, కూర్చుని నిల్చుని వొకరిమీదవొకరు జారిపోతూ, ఒకఅమ్మాయి సైకిలుమీద కూర్చుని చేయిని తన ప్రియుడిబుజంమీద వేస్తుంది, మరోచోట అమ్మాయి సైకిలుకమ్మీమీద కూర్చుండగా అబ్బాయి సీటుమీద కూర్చుని ఫెడలుమీద కాలువేసి రెండోకాలు నేలమీద ఆన్చుతాడు. ఈ ఫొటో అన్నీ దుకాణాలదగ్గర జనం ఆగి నిలబడినిలబడి చూసి - ఆ ప్రేమను - వాళ్లసాహసాన్ని మెచ్చుకుంటూంటారు. ఆ ఫొటోలో వాళ్లు ఎంతోధైర్యంతో దేన్నోజయించిన హీరోల్లా వాళ్ళకళ్ళకు గోచరిస్తారు. ఆఖ్న యీ ఫొటో యెవరుతీశారు అని అడిగితేఅడుగుతారు. అడక్కపోయినా మస్తాను, మీసాలవ్యక్తి పూసగ్రుచ్చినట్లు 'నేషనల్ ఫొటోస్టూడియో' వివరాలు చెప్పితీరతారు. అచ్చుకాగితాలు రేట్లు వివరమూ వొక్కమాటు మాట్లాడిపొమ్మని, ఆఫీసు వుదయం తొమ్మిది గంటలనుంచీ తెరిచేవుంటుందనీకూడా చెబ్తారు. కొందరుకొందరు ఆ సైకిలుమీద అమ్మాయి కూర్చున్న పోజును చూడ్డానికి దొంగతనంగా ఏదోమిషను సోడాత్రాగో కిల్లీ వేసుకునో వచ్చిచూసి వెళ్ళిపోతూంటారు.

మస్తానుకు సూర్యనారాయణ యెప్పట్నుంచో తెలుసును. అతడి మిత్రబృందమంతాకూడా తెలుసు. వీళ్ళంతా యేదో మరోలోకంలో జీవిస్తున్నట్లుంటారని అతడనుకుంటూంటాడు. ఏ దేవలోకంలోనో స్వర్గంలోనో ఎక్కడోవుండవలిసిన వీళ్ళంతా యీ ప్రపంచంలోకొచ్చి యీ మనుష్యులమధ్యపడి నలిగి యమయాతన పడుతున్నారని అతడి

ధావన. ఏంమాట్లాడుకుంటారో యేయేపనులు చేస్తూంటారో అవి అంతగా బోధపడకపోయినా, హఠాత్తుగా వూహించరాని పరిధుల్లోకి వీరంతా వెళ్లిపోతారని కూడా మస్తాను విశ్వాసం. మస్తాను యింత వుంది సూర్యనారాయణబృందాన్ని లోతుగా పరిశీలించి అసంతృప్తి చెందిన సమయాలు లేకపోలేదు. కాని వాళ్ళందరి గమ్యంకూడా చాలా ఎత్తుగా మనోహరంగా గంభీరంగా వుంటూన్నట్లే. దాన్ని చేరుకోవ టంలో యీపాటి కష్టనిష్ఠూరాలు వుండకపోవని సరిపుచ్చుగుంటూ వచ్చాడు.

ఆరోజువుదయం సూర్యనారాయణ స్టూడియోతలుపులు తెరవ కుండానే వో ఆసామీ వచ్చికూర్చున్నాడు. ఆ వ్యక్తి ఎర్రగా కాస్త పొట్టిగా బలహీనంగావున్నాడు. చంకలో వో పక్కచుట్టమాత్రం వుంది. మస్తాను యిట్లాటి అసాధారణవ్యక్తి తారసిల్లితేమాత్రం వోమాత్రాన వదిలేసెయ్యడు. కొట్టులోకి పిలిచి కాఫీపోయించి బీడీలుకొనియిచ్చి కబుర్లలోపెట్టాడు. ఫోటోతీయించుకోవాలని వచ్చాడట. ఇంతలో సూర్యనారాయణ హడావిడిగా వచ్చాడు. మస్తానుకూడా మేడమీద కొచ్చాడు 'పంతుల్‌గారూ, శవ్‌ఫోటో బాగా తీస్తారూ!' అంటూ. ఆ వచ్చినతను పక్కచుట్టలోనుంచి ఏదోచిత్రంలోని రాణి నిండుభంగిమ ఫోటో పైకితీసి ఆశగా 'నాఫోటో తీసి యీపక్కన అతికించాలి... ఫోటో మేం యిద్దరం కలిసితీయించుగున్నట్లుండాలి.' జేబులోనుంచి పదిరూపాయలకాగితంకూడా తీసి చూపించాడు. మస్తాను విరగబడి నవ్వనారంభించాడు.

'ఎందుకు! ఆవిడ రేపుప్రొద్దున్న నామీద కేసుపెడితే....'

ఆ వ్యక్తి వెర్రిగాచూస్తూ – 'నాకాఫోటో కావాలండీ. మేమిద్దరం కలిసి తీయించుకున్నట్లుగా —'

సూర్యనారాయణకర్థంకాలేదు. చిరాకుపడుతూ – 'ఆవిడఫొటోతో నీఫోటో కలిపి రేపు నన్ను జైలుకెళ్లమనా... నీవుద్దేశం....' యిదేమిటి

గొడవంతా అన్నట్లు మస్తానుకేసి చూశాడు. మస్తాను ప్రశ్నలువెయ్యటం మొదలెట్టాడు—

'పంతులూ, నీకు పెళ్లికాలేదూ ?'

'అయింది.'

'పెళ్ళాం వుందా ?'

'వుంది.'

'పిల్లలూ ?'

'ఆడపిల్ల.'

'వుద్యోగం ?'

'నాకు టైపువచ్చు. మెట్రిక్కు ప్యాసయా.'

'యిప్పిస్తే చేస్తావా ?'

'చెయ్యలేను. వుద్యోగం మానేశా.'

'ఎక్కడ-?'

'మద్రాసులో....'

'ఎందుకని ?'

'రాణికోసం.'

'అదేఁ ? పాపం, పెళ్ళాం....'

'ఛా' ఛూ! అది డోకొస్తుంది.'

'ప్రయత్నించావా ?'

'పొలం అమ్మేశా....మూడేళ్ళ మద్రాసులో తిరిగా.'

'ఉద్యోగం-?'

'పోయింది. తీసేశారు.'

'రాణి !'

'జోడుతీసుకుకొట్టి మెడపట్టుకు గెంటేశారు.'

'దెబ్బ తగల్లే....'

'బావుంది. మెత్తగావుంది-'

'సిగ్గులేదూ ?'

'కోపంవస్తే ఆడవాళ్లు బావుంటారు.'

'దెబ్బలు తిన్నాక బుద్ధొచ్చిందా ?'

నవ్వాడు వెకిలిగా. 'డబ్బులేదు. డబ్బుంటేనా - మద్రాసుపోనూ ? కారేసుగెళ్తాను.'

'మర్చిపోగూడదూ ?'

'ఎట్లా మర్చిపోను ? అదేధ్యాస....'

''మరిప్పుడెల్లాగ....'

'సినీమావస్తే రోజూ హాల్లో కూర్చుంటాను.'

'పోనీ మద్రాసు వెళ్లు.'

'డబ్బో....'

'వుద్యోగంచెయ్యి-'

'అహఁ, అది నావల్లకాదు. నే చెయ్యలేను.'

'మరి పదిరూపాయలెక్కడివి ?'

కాస్త తటపటాయించాడు. మస్తాను గ్రుడ్లురిమి మీసాలు గడ్డం కాస్త దువ్వాడు.

'నా....వి....'

మస్తాను మెడమీదచెయ్యేసి పళ్లు పటపటలాడించాడు, ఆ ఆసామీ గింజుకుంటూ 'నా పెళ్లాం సొమ్ము నేను తెచ్చుకుంటే....'

'ఛప్ ! నోర్మూయ్ ! పళ్ళురాలగొడ్తాను.'

'నేనెప్పుడూ దొంగతనం చెయ్యలేదు తెలుసా ! నా పొలం అమ్ముకున్నాను, నన్ను వుద్యోగంలోనుంచి తీసేశారు.'

'ఆడకూతురు అడ్డమైనగడ్డీ కరిచి సంపాయించి పోషిస్తున్నది గాలక సిగ్గులేక డబ్బుకూడా ఎత్తుకొస్తున్నావ్ ?'

'నీకేం ? నీసొమ్మా ?'

మస్తాను తపీమని చెంపమీద వోటిచ్చుకున్నాడు.

'ఇదేమిటోయ్, పిల్లిబ్రహ్మహత్య.........' అన్నాడు సూర్య నారాయణ.

ఆ ఆగంతకుడు పరుపుచుట్ట పారేసి నేలమీద కూలబడి గొల్లుమని యేడువసాగాడు. రాణిపటం గుండెలకదుముకుంటూ. ఎవరో ఆడ మనిషి పైకొచ్చింది. అతను యేడుపు మానేసి చొక్కాతో కళ్లు తుడుచు కుంటూ లేచి నించున్నాడు, పల్చగా పంజరంలాగుంది మనిషి, తెల్లగా పాలిపోయి, నడుంబద్దలా వంగిపోయి....

'పదిరూపాయలిటివ్వు ?'

'పదిరూపాయాలేంటి-?'

'చూడండయ్యా, పెట్లోంచి ఎత్తుకొచ్చాడు. అయ్యోదేవుడా-!' నారాత యిల్లా రాసిందా అన్న అర్థంవచ్చేట్లు చేతుల్నిఆడించింది.

'బోడిసొమ్ము, నీ సొమ్మేంటి ? నాకొక్కవలిసి నేతీసుకున్నాను.

'నేను చీమూనెత్తురూపోసి సంపాయించుకుంటున్నాను. సిగ్గులేక ఆడదానిసొమ్ము యెత్తుకొచ్చాడు.'

మస్తాను మధ్యలో కల్పించుకుంటూ - 'సైపుప్యాసయ్యావుగా వుద్యోగం ఎక్కడన్నా చేసుకోరాదూ....' అన్నాడతన్ని చూచి.

'అబ్బబ్బా - నడవలేను. కాళ్లు నొప్పులు....' మోకాళ్ళుపట్టుకుని వంగుంటున్నాడు. మస్తాను జబర్దస్తీచేసి పదిరూపాయలనోటు లాక్కొని ఆ ఆడమనిషికిచ్చేశాడు అందరూ చూస్తూండగా.

'చెప్పండయ్యా - చీకటిపడి యింటికెళ్తే తలుపులువేసేసి కిటికీ లోంచి బైటకు పొమ్మంటుంది, వర్షంకురుస్తూన్నా - చలివేస్తున్నా -'

మస్తాను - 'అందుకే పక్కచుట్ట మోసుకుంటూ తిరుగుతూం టావా ?'

తలవూయించాడు,

'కాదండీ'- యింట్లో పరాయివాళ్ళ గుడ్డలూఅప్పీ వుంటాయిగదా, ఎత్తుకుడోతే నేనేంగాను? ఇదివరకు నమ్మి పడ్డ అవస్థలు చాలకనా-?'

'పోనీ తిండి పెట్టగూడదాయేం? రోజూ వో బేడా అణా పారేస్తే నీజోలికి వస్తానాయేం?'

'బాదో! నేను లేనప్పుడు యింట్లో జొరబడి పిల్లకన్నా మిగల్చకుండా అన్నమంతా తినేసి చేతికిదొరికింది పట్టుకుని పారిపోలాడు. ఎట్లా రానిచ్చేది?'

'మద్రాసులోవున్నప్పుడు రిక్షాలమీద కూర్చోబెట్టుకుని తిప్పానే - అదంతా యేమయింది? అన్నంకూడా నాకోసం అట్టే పెట్టదు. అంతా మింగేసి తలుపులు మూసుకూర్చుంటారు.'

ఆ ఆడమనిషి గోలగా 'నా కొంప కూల్చేశాడుబాబూ! పండంటి సంసారం నిప్పుల్లో త్రోసేశాడు. పీడి సినీమాలు వల్లకాడుగాను....'

మస్తాను ఆమెను వోదారుస్తూ - 'నువ్వెళ్ళమ్మా. ఇతను యిక్కడుంటాడు. నేను చూస్తాగా-'

ఆ పదిరూపాయలకాగితం బొడ్డులో దోపుకొని ఆమె అక్కడ నుంచి తృప్తిగా వెళ్ళిపోయాక - 'పెళ్లాంవుంది, పిల్లలున్నారు. వుద్యోగం చేసుకో హాయిగా....యిదేంబుద్ధి? సినీమాలుచూసి అందులో ఆడవాళ్లు కావాలంటే వస్తారా!' - అన్నాడు మస్తాను.

'అమ్మో! వదల్లేనండి. ఒక వెయ్యిరూపాయలుంటేనా -' పటం ఎదురుగా పెట్టుకుని గోముగాచూసుకుంటున్నాడు బొమ్మను.

సూర్యనారాయణ కాస్త బాధపడ్డాడు. ఆ భార్యాభర్తల సంభాషణ విన్నాక అతనికి తలతిరిగినట్లయిపోయింది. ఇదంతా మదమంటారు కొంతమంది. తెరమీద చూసిన తారకోసం వుద్యోగం వదిలేశాడు. పెళ్ళాన్నీ పిల్లనూ కాదనేశాడు. అంత వ్యామోహమా ఆ తారమీద! పొలంఅమ్మేసి కారుల్లో యింటిచుట్టూ తిరిగాడు! తనెవరు? తనకేం

అవుతుంది కోరరానికోరికలు కోరటానికి? పిచ్చి బాగా యెక్కిపోయింది. ఆ తారదర్శనంకోసం రోజులకురోజులు తపస్సుచేశాడు .ఆఖరికి మాట్లాడాడుకూడా. చెప్పుదెబ్బలు తిన్నాడు, మెత్తగా బావున్నాయట. ఆడవాళ్ళకు కోపంవస్తే బాగుంటారట! సూర్యనారాయణ గబగబా ఏదో అర్ధరుందని కెమేరా కూలివాడిచేత పట్టించుకుని సైకిలుతీసుకొని వెళ్ళిపోయాడు.

మస్తాను పిచ్చిపంతుల్ని తెచ్చి కొట్లోకూర్చోబెట్టుకుని వచ్చీపోయేవాళ్లని ప్రోగుచేసి రాణి గురించి అవాకులూ చెవాకులూ ప్రేలిస్తున్నాడు. మధ్యాహ్నం హోటల్నుంచి భోజనంతెప్పించి పెట్టించాడు. కిల్లీకొట్టు మీసాలఆసామీకూడా వచ్చి సోదాయిస్తాను రమ్మంటూ యితగాడ్ని తన దుకాణండగ్గరకు తీసుకుపోయి బెంచీమీద కుదేశాడు. జనం వస్తూపోతూ నవ్వుతూ అతడిచేత ఆత్మకథను మళ్ళీమళ్ళీ చెప్పిస్తున్నారు. ఈ విధంగా ప్రొద్దుపోయిపోయి రెండుగంటలు దాటేవేళకు చంకలో పెద్ద కాగితంపొట్లంతో శాస్త్రి చెమటలు గ్రక్కుకుంటూ వచ్చాడు మస్తానుకోసం.

'ఈ కోటు అమ్మిపెట్టాలోయ్, అర్జంటుగా డబ్బు కావాలి.'

మస్తాను పొట్లం అందుకుని విప్పాడు. అందులో ఇటాలియన్ గేబర్డైన్‌కోటు కలరావుండలవాసన కొడ్తోంది.

'ఈ కోటు యిప్పుడు నేనేంచేసుకోను? 'జపాను గేబర్డైన్ వచ్చాక అందరూ దానికే యెగబడ్తున్నారు. మడత బాగా నిలుస్తుంది కదండీ. చవక. పదకొండూపన్నెండూ గజం.'

'అదేవిటోయ్, ఇటాలియన్ గేబర్డైన్ గజం యిరవైయెనిమిది రూపాయలప్పుడు కొన్నాను. జీవితమంతా వస్తుంది. మడత నిలబడదు. నూలు ఎక్కువవుంటుంది గనుక జపానుగుడ్డ నిలబడ్తుంది.'

'ఇందులో మోసంలేదుబాబూ. కట్టుకున్నపెళ్లాం జీవితంలోంచి విడిపోవచ్చుగాని యీ యిటాలియన్ గేబర్డైన్‌కోటు జీవితంపొడుగూతా వుంటుంది.'

'రైటు! సరిగ్గా చెప్పావోయ్. ఇది పద్మినీజాతి స్త్రీ. మన కక్కుర్లేదోయ్!' శాస్త్రి కాస్త ప్రసాదంగా నవ్వాడు.

'ఇప్పుడింత అర్జంటుగా ఎక్కడ అమ్మగలమండీ. వారంపది రోజులన్నా పడ్తుంది దీనికి.' అంటూ కోటును వంకీనతగిల్చి 'చెప్పండి మీ అభిప్రాయం -'

నా అభిప్రాయానికేంవుందోయ్. ఎనభై రూపాయలు పెట్టి కుట్టించాను. తెలీదేమిటి దాని విలువ. ఓ యాభై రూపాయలిప్పించు -'

'చాలాకష్టమండీ! అయినా ప్రయత్నిస్తాను -' మన్తాను ఆలోచిస్తూ కొట్లోంచి బైటకొచ్చాడు. శాస్త్రి అనుసరిస్తూ దెబ్బతిన్న అభిమానంతో - 'డబ్బు అర్జంటుగా కావాలన్నానుగా. ఇప్పుడేకావాలి.! నువ్వో పదిరూపాయలు మినహాయించుకుందూ చంపక -' చిన్నగా నవ్వాడు.

'రోజులేం బాగులేవండి. మనదేశంలో వులెనుబట్టలు సూట్లు లాంగ్‌కోట్లు యెవరూకట్టరుగదండీ. కాలేజికుర్రాళ్లు యెవరో కొద్దిమంది మోజుకు తొడుగుతారు. అంతా డబ్బున్నవాళ్లుకూడా సిల్కుబట్టలు ఖరీదైన మిల్లుగుడ్డలుకడ్తారు. పెద్దపని చేయించుకునేవాళ్లు వుండరు. నేను ఆడవాళ్ల బట్టలు కుట్టటం మానేశాను. కాని వచ్చినబట్టలన్నీ మీరాగారికి పంపిస్తున్నాను. ఆవిడకవసరమయ్యాగానే తిరిగి పంపించేస్తారు. మంచి ఓపికా శ్రద్ధావున్న మనిషి. ఆ డబ్బు వసూలుచేసి వారంవారం యిచ్చేస్తుంటాను. ఈవాళా రేపు మాకు పిల్లలగుడ్డలూ ఆడవాళ్ల వసంతా పడిపోయింది. ఒకరినోట్లో అన్నం చూస్తూచూస్తూ లాక్కోలేంగదండీ! ఏమంటారు: దేశం మారిపోతోంది.'

శాస్త్రి చిరాగ్గా - 'దేశంగురించి అడగటానికొచ్చానుటయ్యా నీదగ్గరకు. నన్ను చంపక డబ్బుపారేద్దూ - అర్జంటుగా పోవాలన్నానుగా -' మన్తాను బనీనుజోబీలోంచి అతికష్టంమీద రెండు పదిరూపాయలనోట్లు లాగాడు. శాస్త్రి ఆ రెండునోట్లు వేగంగా లాక్కుని 'గుడ్‌బై!' చెప్తూ గబగబా వెళ్ళిపోయాడు మారుమాట్లాడకుండా.

'ఇంతేనా' అంటాడేమో అనుకున్నాడు మస్తాను,కాని....! మస్తాను హాల్లోకివచ్చి పంకీనున్న కోటుకేసి చూశాడు. శాస్త్రి వెళ్ళిపోయినవెస చూశాడు. దేనిమీదా వీళ్ళకి ఆసక్తి లాలస అభిమానిమూ లేవు. మామూలు మనుషులకి ఏవైతే చాలా గొప్పవి గౌరవమైనవి అనిపిస్తాయో వాట్లన్నిం టినీ తృణప్రాయంగా చూడగలుగుతారు. మస్తాను వొక్కమాటు గజగజా వొణికాడు కోటుకేసిచూస్తూ. ఇసవై రూపాయలు పోతేపోయాయిగాని సింహంనోట్లోంచి బైటకువచ్చినట్టుగావుంది. ఈసంఘటనవల్ల మస్తాను శాస్త్రిమీద గౌరవం అధికంచేసుకున్నాడు. కాళ్ళక్రింద కుట్టుమిషను గిరగిరాతిరుగుతోంది చప్పుడుచేసుకుంటూ. డబ్బుతోకూడా కొనలేని మనుషులు కొందరుంటారనే అభిప్రాయం మనస్సులో మిషనుచక్రంలా గిరగిరా తిరుగుతోంది. కుర్రాడు దిక్కులుచూస్తూ కాజాలుకుడ్తున్నాడు. 'సరిగా పనిచెయ్యరా వెధవా-' మస్తాను విసుక్కున్నాడు కోపంగా. ఆసినిమాపిచ్చాడు మరీ చిత్రమైనమనిషిలాగున్నాడు. తనకు ఫలానా లారకావాలి-ఆవిడకు తను అర్హుడో కాడో అవసరంలేదు. ఈవ్యామోహం పన్వేత్రాఫిక్కు....మనుషుల్ని యింత మరీ యిదిగా రెచ్చగొడ్తున్నది కాబోలు యీ సినీమా. పుస్తకాలు, సంగీతం. బొమ్మలు, సినీమా, నాటకం యేదైనా యింతేకాబోలు - మనుష్యుల్ని రెచ్చగొట్టి వెర్రెత్తిం చేస్తాయి. మస్తాను బీడీముట్టించి మిషనుమీదకూర్చునే కాళ్ళాడిస్తూ రోడ్డుకేసిచూశాడు-.

ఎవరో కావడి బుజాన్నేసుకుని కాలవనించి నీళ్లు మోసుగొస్తు న్నాడు - ఎండలో బుజాలు, వొళ్లు చెమటలుకార్తూ నిగనిగలాడ్తున్నాయి. అడుగులు వేగంగా కొలిచినట్లు పడుతూంటే కావడికుండలు లయబద్ధంగా కదుల్తున్నాయి.

తల్లోమందారపువ్వుపెట్టుకుంది, దభాల్న దొడ్డితలుపుతీసి అంట వి స్తరి కుండీలోకివిసరిపారేస్తూ వీధిలోకి పనిబెట్టుకున్నట్లు పరధ్యానంగా విలబడి దేన్నోచూస్తూ భధాల్న తలుపువేసుకుంది భామిని వయ్యారంగా.

ఆ అరిటాకు ఎంగిలిమెతుకులమీదకు కుక్క తోకాడించుకుంటూ కలియ బడ్తోంది.

రిక్షావాడు సుస్వరాన గీచినయాళ్ల కర్రగీతలా మస్తాను కొట్టుముందు నుంచి పోనుకున్నాడు — అందులో ఆసామీ రిక్షాతొక్కేవాడికన్నా ఎక్కువపసుపటలు గ్రక్కుతున్నాడు. పంగుని వదిలిపోయి కర్రతో కొట్టుకుంటూ రోడ్డుకు సమాంతరరేఖలా ముందుకు నడుచుకుంటూ పోతున్నది ఎవరో ముసలమ్మ కొంపమునిగిపోయినట్లు.

ఒక కాకీనిక్కరు కుర్రాడు యీలపాడ్తూ పోతున్నాడు.

ముగ్గురమ్మాయిలు పోతులబండిని తప్పుకోవటంలో కంగారు పడ్తున్నారు.

కంగారుపడకుండా యిద్దరబ్బాయిలు సైకిలుత్రొక్కుకు పోతు న్నారు.

ఒకస్కూలుకుర్రాడు జేబీలోంచి వంగలకర్రతీసి గురిపెట్టి చెట్టుమీద పిట్టను చేన్నో కొట్టాలనుకుంటున్నాడు. దూరంగా కొబ్బరిపట్లల్లో అదృశ్యంగా దోబూచులాడ్తున్న డాబామీదనిలబడి ఎవరో విధవరాలు కచ్చ మార్చుకుంటున్నది. మస్తానుజేబీలో యిరవై రూపాయలు హరించి పోయాయి. మస్తానుకొట్లో యెనభై రూపాయల గేబ్రిడైన్ కోటు వంకీన అలంకరించింది.

# 8

సెప్టెంబరునెలలో వోరోజుమధ్యాహ్నం మూడుగంటలకే దట్టంగా మబ్బులు క్రమ్మేశాయి. కొంతసేపు గాలిలేచి గడ్డిపరకల్నీ ఎండుటాకుల్నీ అంతరిక్షంలోకి పైపైకితీసుకెళ్ళి మళ్ళీ ఎటో పనున్నట్లు మాయమైపోయింది. రైలుస్టేషనుకెదురుగా నిలబెట్టివున్న వొకేవొక వొంటెద్దుబండిలో నిద్రపోతున్న 'బండివెంకన్న' హఠాత్తుగా కళ్లు

నులుపుకొంటూ లేచి సమయంతెలీక బండీవచ్చి ప్రయాణీకులుఅంతా వెళ్ళిపోయారేమోనని పరుగెత్తుకుంటూ బుక్కింగుకిటికీదగ్గరకు వెళ్ళి టైముఅడిగి వచ్చాడు. ఇంకా రైలురావటానికి అరగంటవుంది. ప్లాటుఫారంమీద యెవరో గ్రామీణులు మూటల్నిపెట్టుకుని బండీకోసం యెదురుచూస్తున్నారు. సిమెంటుబల్లమీద వోపోలీసు టోపీ గుండెల కదుముకుని వెల్లకిలాపడుంచి కునుకుతీస్తున్నాడు. స్టేషనుమాస్టరు బనీను లుంగీతో బైటకువచ్చి పోర్టరుకు గంటకొట్టమనిచెప్పి మళ్లీ లోపలకు వెళ్ళాడు. వెంకన్న బండిదగ్గరకువెళ్ళి లోపలజంబుఖానా దులిపి, ఎద్దు ముందు నాలుగుగుప్పెళ్లు పచ్చగడ్డివడేసి కమిచీతో వీపుగోక్కుంటూ నిల్చున్నాడు. తర్వాత రైలువచ్చింది. ప్లాటుఫారంమీదపల్చగా నిలబడ్డ నలుగురూ తోసుకుంటూ తుమ్ముకుంటూ ఒకేపెట్టెలోకి ఎక్కాక గార్డు బలవంతాన దింపేసిన వొక జంగిడీలకుర్రాడు, ఒక గ్రుడ్డిమనిషీ వాడిచేతిలోకర్రపట్టుకుని నడిపించే వొక ఆడమనిషి. వెనుక మూట, మూటలో గుండ్రటి, నల్లటి బొద్దుపిల్లాడు, యింకా రెండుమూడు సిల్వరుచొక్కాలలో పీళ్ళుమిగిలాయి. వెంకన్న కమిచీ నేలకుజారిపోగా నిరాశలో తిట్టుకుంటూ వెనక్కి నాలుగడుగులువేసాడు. కదుల్తున్న రైలు మళ్ళీవొక్కసారి ఆగింది. రెండవతరగతి పెట్టెలోంచి ఎవరో మిలిటరీ ఆఫీసరులాగున్నాడు గార్డుతో యిది ఫలానాస్టేషనేనా అని అడుగుతున్నాడు. స్టేషనుమాస్టరు వెంకన్ననుపిలిచాడు. వెంకన్న గబ గబా సామాన్ను అందుకున్నాడు. ఆమిలిటరీఅతను దిగాక రైలు వెళ్ళి పోయింది. అతడిదగ్గర వొకపెద్ద నల్లటి ట్రంకుపెట్టి - ఆఫీసర్లువాడేది వుంది. మరొక కాశ్మీరుపేముతో అల్లిన తమాషాసజ్జబుట్ట, చిన్న తోలు పెట్టి, నీళ్ళసంచీ. పెట్టిమీద మేజరువరహాలు యింకా ఏవో పొడి అక్షరాలు రాసున్నాయి. అతడేవో కాగితాలుతీసి వాటిమీద స్టేషను మాస్టరు సంతకాలు తీసుకున్నాడు. ఈలోగా వెంకన్న సామాను బండిలో సర్దివచ్చి దూరంగా చేతులుకట్టుకు నిల్చున్నాడు. ప్లాటుఫారంమీది పోలీసువచ్చి యెదురుగా టెంషన్‌గానిలబడి శాల్యూట్‌కొట్టాడు. వరహాలు

తలపంకించారు. స్టేషనుమాష్టరు ఇతగాడూ ఏమో మాట్లాడుకుంటూ బండి దాకా వచ్చారు. వరహాలు విష్‌చేసి బండీలోకి వోమారుచూసి 'పోనియ్యి సేను నడుస్తాను' అని నెత్తిమీద టోపీతీసి బండిలో పడేలా విసిరాడు. ఎద్దు గంటలు చప్పుడు చేసుకుంటూ చక్రాలు రాళ్ళమీదనుంచి టకటక మని కటువుగా దొర్లుతూ బండిబయల్దేరింది. వెంకన్న నమ్రతగా 'మన్ది యేవూరుబాబూ ?' అన్నాడు.

'ఈవూరే.' అని చంకలోని చిన్న పొట్టి నల్లటి చేవకర్రతో బండిగూడుమీద అంటించిన ఏదోపోస్టరును పొడుస్తూ - 'నాటకమూ యీవూళ్ళో....' అని అడిగాడు.

'తెల్దు బాబూ, ఏటో సచ్చినోళ్ళు కాగితాలు అంటిస్తారు. లోన కూకోరాదూబాబూ, సెనంలోవూళ్లోకి వెళ్ళిపోతాం.' గొణుగుతున్నాడు వెంకన్న.

'కూర్చునికూర్చుని బండీలో నాలుగురోజుల్నుంచీ నడుంవిరిగి పోయిందిరా అబ్బీ ! నడపనీ-'

బండీ దొంకలోంచి తాటితోపులోంచి ఈతరెమ్మల్నీ దుబ్బుల్నీ రాసుకుంటూ చప్పుడుచేసుకుంటూ పోతోంది,

'సుట్టముక్క అరిపోనాది. అగ్గిపెట్టె యిప్పించుకుంటారాబాబూ!'

వెంకన్న అగ్గిపుల్లగీసి 'శానారోజులాయి యిటేపు రానేదు కావోసు. బాబూ, వూరు యేంమారిపోనాది, సూత్తారుగా ! నాయుళ్ళు కాపీహొటేళ్ళు తెరిచేసినారుబాబూ ! కల్లుదుకాణాలు మూసేసినారు. పాలూ పెరుగూమాట అడక్కండి. యిస్కూళ్ళు, బయస్కోపులు, వూరినిండా జులాయిముండలు, కాలం యేపీ బాగోనేదు. రూపాయి అప్పడిగినా పుట్టకుండావున్నాది. వడ్డీయాపారం మీరిపోనాది. ఆస్తులు దోచేసుకుంటు న్నారు. మానాటోళ్ళ కడుపులు మాడిపోతూంటే యీ సొమ్ములన్నీ పట్టికెళ్లి పట్నాల్లో తగలబెట్టేస్తున్నారు జనం. నాయంపోనాది. డబ్బే నాయం ! డబ్బేధర్మం ! నీతినిజాయితీనేక బతికేందుకుబాబూ ?'

మేజరువరహాలు తనలోతాను నవ్వుకుని — 'ప్రపంచమంతా యిప్పుడు నువ్వుచెప్పినలాగే నడుస్తోంది.'

బండివెంకన్న అసమ్మతిగా తలవూయిస్తూ - 'యింత పచ్చికలి యెక్కడా బద్దలవనేదు బాబూ. పీకార్చుకుపోతున్నా మజ్జిగసుక్క పుట్టకుండా పోతున్నాది. విలవిల్లాడిపోతున్నా పిడికెడుమెతుకులు విద ల్చటంమానేశాట జనం. కాపీలు తాగేస్తున్నారు - బయస్కోపులకు పెట్టేస్తున్నారు సొమ్ము. ఏటి బాబూ యిదంతా—'

'అంతేలే-'అని వరహాలు బండిగూటుమీద పోస్టరును యథా లాపంగా కూడబలుక్కుని చదివాడు.

"అద్భుతనాటకప్రదర్శనం! పద్యాలూ పెడబొబ్బలూ లేవు.
స్టేజీమీదకి యేనుగులూ లొట్టిపిట్టలూ రానక్కర్లేదు.
ఒక పతితస్త్రీ దుస్సహదుర్భర జీవితగాధ! కన్నీటిలో కలం
ముంచి వ్రాశాడు కవి!

గోవాలో, అల్జీరియాలో, అక్కడా ఇక్కడా యెక్కడా యెప్పుడూ ప్రజ్వలించే స్వాతంత్ర్యపిపాసను సామాన్యుల్లో గుర్తించి ప్రస్తావించిన సముజ్వల సాహసోపేత రచన—

"దాహం!"

చూడండి! 'కవి! 'ప్రసాద్' హీరో: 'శ్రీహరి' హీరోయిన్ 'మీరా' డైరెక్షన్: 'శాస్త్రి' మానేజిమెంటు: 'సూర్యనారాయణ.'

షరా - రూల్సు మామూలే. టౌనుహాల్లో రాత్రి 9-30 ని॥ లకు.

రేట్లు - కుర్చీ రూ. 2/- బెంచీ 1/- (స్త్రీలకు, పిల్లలకు 12 సం॥ లోపు -/8/-).

అడ్వాన్సుబుక్కింగు - మస్తాను లేడీస్ అండ్ జెంట్సు టోపు ఫిట్టర్సు షాపు. నేషనల్ ఫొటోస్టూడియో.

గమనించవలెను: ఏకారణంచేత నాటకం ఆపబడిననూ సొమ్ము వాపసుయివ్వబడదు."

'మనవాళ్ళకి యీ నాటకాలపిచ్చి యింకాపోలేదు.' మేజరు వర హాలు తనలో తాను నవ్వుకున్నాడు.

బండివెంకన్న అంటున్నాడు — 'నాటకాలపిచ్చి అంటారా బాబూ! మన్యూళ్ళో మునుపట్లా భాగవతభాగోతాలు అడ్డంనేదు బాబూ. బాగోతాల సుబ్బిగాడు పాలెంలో పూసలమ్ముకుంటున్నాడు. సాలీలు సంగం పెట్టారు. మంగమ్మ యిళ్ళకొచ్చి కామందులకు వన్లుసేయటం మానేసారు. సాకలోళ్ళు అంటా సాపులు తెరచేసినారు. అళ్ళకీ సంగం; రిచ్చావోళ్ల సంగం. కామందులకొంపల్లో ఆడోళ్ల నాటకాలాడ్డం యెక్కు వన్నాయంటా బాబూ? రిచ్చావోళ్ల యెక్కువై పోనారు. మడిసికిమనుసుంటే మడిసి బాగటం! ఊ! ఎడవకాలం! సిగ్గూ నజ్జా రెండూ పోనాయి పెజకి.'

బండి పట్టంతవాటి ట్రంకురోడ్డునందుకుంది. రోడ్డుకిరుప్రక్కలా చింతచెట్లు దాగాపెరిగి మెత్తగా చల్లగా నీడనిస్తున్నాయి. ప్రక్కప్రక్కల నుంచి అనేక కాలిబాటలూ. పంటకాలువలు నిండుగా ప్రవహిస్తున్నాయి. వరహాలు ఒక్కడూడు ఆగి నాలుగువైపులా పరకాయించి చూశాడు. ఊరు దగ్గరపడ్డట్లుంది. వీధుల్లో దీపాలువచ్చాయి. బండివెంకన్న చమిడీతో చూపించి చెబుతున్నాడు - 'అల్లదే ఆడోళ్ళ కాలేజీబాబూ. మునుపటి యిస్కూలు పడగొట్టి పెద్దమేడ కట్టేసినారు. ఆసుపత్రి పెద్దదై పోనాది. బస్సుస్టాండు అల్లక్కడ్నుంచియెత్తేసి సంతపాకలమీద వాలవతావల పెట్టారు.'

'ఏవన్నా హోటలుకు తీసుకుపో-' వరహాలు వూళ్లోకి వచ్చామని తెలిశాక హెచ్చరించి సిగరెట్టుతీసి ముట్టించాడు.

వెంకన్న బండిని బజార్లోంచిత్రిప్పి 'హోటల్ శకుంతలా' లాడ్జింగ్ అండ్ బోర్డింగుహావుసు ముందు ఆపాడు. గదితాళంచెవులు పుచ్చుకున్నాక సామాన్లు మీదకు చేరవేస్తూ బండివెంకన్న 'మనూరన్నారు. హోటల్లోదిగారేంబాబూ?'

వరహాలు చిరునవ్వునవ్వి - 'అంతేలే.' అని రూపాయి తీసి చేతులోపెట్టి 'ఈవూరింత డాబుగావుంపెగవా స్టేషన్లో ఒక్క రిక్షా అన్నా లేదే.'

'ఈబండికెవరూ రారుబాబు. అదీగాక యిక్కడ పెజంతా బస్సుల్లోనే పోతారు.'

బండివెంకన్న వెళ్ళిపోయాడు. వరహాలుస్నానంచేసి ఆలివ్ జీన్ వాగూ కోటూ వేసుకున్నాడు. చికెన్ కర్రీ, మటన్ ఛోప్, రెండుప్లేట్లు ఆమ్లెట్లు తెప్పించుకుని తిన్నాక బిల్లుపారేసి కుర్రాడ్ని వెళ్ళిపొమ్మని పెట్టెతెరిచి సీసా పైకిలాగి యెవరూచూడకుండ గటగటా సగంసీసా కొట్టేసి పెట్టెమూసి గదితలుపులు వేసేసి గబగబావీధిలోకొచ్చి సందుల్లోకి దూరిపోయాడు. అక్కడ్నుంచి అతను వొళ్ళంతా కళ్ళుపెట్టుకుని వీధివీధి సందుసందూ పరిశీలనగా చూస్తూ తిరిగాడు. ఒకచోట ఆగకుండా ఒకరికి అనుమానంపుట్టనివ్వకుండా జనం ఎదురుబడితే ఠీవిగా హోదాగా చూపుల్ని తప్పించుకుంటూ వచ్చాడు. కొంతమంది నిలబడి చూశారు. ఎవరూ అతడ్ని పలకరించలేదు. అతను కాలవదగ్గర రేవుమీదనుంచి ఏవో రహదారి పడవలు వస్తూంటే, వాటిని చూడ్డంకోసం నిలబడినట్లు నించుని కాలవ చుట్టూ ఎన్నిపేధులున్నాయో ఎక్కడెక్కడ వూరు పెరిగిపోయిందో గమనించాడు. ఆచాంద్రాయణంలో అతను సూర్యనారాయణ ఫొటో స్టూడియోదగ్గర కాస్సేపు తచ్చాట్లాడ్తూండగా ఆవలిస్తే పేగులులెక్కబెట్టే మనిషి 'మస్తాను' మాటల్లోకిదింపబోతే ఒక నాటకంటికెట్టుకొని బైట పడ్డాడు. అక్కడ్నుంచి మళ్ళీ తిరగటంలో రాత్రి యెనిమిదిగంటలకి చూరులు భూమిమీదకువ్రాలి మొక్కల్తో రకరకాల తీగలు లతల్తో ప్రశాంతంగా సుందరంగా వున్న 'మీరా' యింటిముందర వచ్చినిల్చొన్నాడు. అతను ఆ జాగాను అంగుళమంగుళమూ చాలాశ్రద్ధగా దేనికోవెతుకుతున్నట్లు చూసి తృప్తిపడ్డాడు. 'మీరా' యింటిముందు పూలమొక్కల మధ్య పేముకుర్చీలో కూర్చుని కృష్ణమూర్తిగారు సైగలురికార్డు పెట్టుకుని వింటున్నారు.

వరహాలు నెమ్మదిగా గేటుత్రోసుకుని కృష్ణమూర్తిగారిదాకా వచ్చి 'ఈయిల్లు యెవరిది? ఇక్కడ యెవరుంటున్నారు?' అని అడిగాడు.

ఆయన రికార్డు మూసేసి 'నేనూ మాఅమ్మాయి వుంటున్నాం' అని అయిష్టంగా జవాబిచ్చారు.

వరహాలు సందేహంగా - 'మీఅమ్మాయినోమాటు పిలుస్తారూ?' గుప్పున సువాసన కృష్ణమూర్తిగారికి కొట్టగానే ఆయన కోపంగా - 'యూ డామిట్, గెటవుట్!' అని ఆ సైగలురికార్డు తీసి విసిరి నేలకు బద్దలుకొట్టారు. ఆయనకు కోపంవస్తే తన ప్రియమైన వస్తువు వొకటి నష్టమవుతుంది.

వరహాలు పారిపోలేదు. 'ఒకమాటు లోపలికెళ్లి చూడొచ్చా—' ఆకి ప్రత్యుత్తరంకోసం ఆగకుండానే బుర్రవంచి తలుపుత్రోసుకుంటూ లోపలకు దూరాడు.

ఎవడో తాగుబోతువచ్చి అల్లరిపెడ్తున్నాడని వూహించిన కృష్ణమూర్తిగారు విసుగ్గా 'అక్కడ నీ శ్రాద్ధం-ఏముందయ్యా, చూసేందుకు పూరిపాకలో....' అంటూ వచ్చి వెనక నిలబడి 'నీకేంకావాలయ్యా, ఇల్లా కొంపలోదూరి రాక్షసుడిలా అల్లరిబెట్టడానికి యీపూరిపాకలో యేముంది?'

వరహాలు తొణకలేదు, బెణకలేదు. లోపల గోడల్నున్న చిత్రాలను కుట్టుమిషను సామానులు వంటిల్లు అన్నీ కలియచూశాడు. చూసి చూసి 'ఈయిల్లు నాదిలాగే కనిపిస్తోందండీ! ఇప్పుడిందులో యెవ రున్నారోగాని—'

'చాల్చాలు! నడవ్వయ్యా బైటకు - ఈయిల్లు నాదంటావు. ఇతే కట్టుకుపో.... చూస్తావేం?'

వరహాలు బైటకొచ్చాడు. కృష్ణమూర్తిగారివంక సందేహంగా చూస్తూ-'ఈయింట్లో యెవరన్నా ఆడమనిషి వురిపోసుకు చచ్చిపోయిందా?'

'అదేం ప్రశ్న? శుభమల్లే కొంపలోకొచ్చి యివ్వేంమాటలయ్యా?'

'అహ్హా! అడిగాను. మొగుడొదిలేస్తే దిక్కులేక—'

కృష్ణమూర్తిగారు ఇకలాభంలేదని నింపాదిగా — 'అబ్బాయీ, నువ్వెవరో మందుమీదున్నావు. లేక మనస్సు సరిగాలేకపోవచ్చు. ఇక్కడేం అట్లాంటివి జరగలేదు.'

వరహాలు ముందుదొడ్డిఅంతా చూపిస్తూ-'ఈనూయి ఇక్కడేవుంది. ఈపాకవున్నచోట వొక పెంకుటిల్లు పాతది వుండాలి. అది మాది. అందులో నాపెళ్లాన్ని వొదిలేశాను. అది యీనూతిలోగాని వురికి చావలేదుగదా! ఏమండీ, యీనూతిలో యెవరైనా పడ్డారా? మీకు తెలిసినంతమటుకూ....'

కృష్ణమూర్తిగారు అయోమయావస్థలో పడ్డారు. 'మీ అమ్మాయి యెవరో వున్నారన్నారు. ఆడవాళ్లకు తెలుస్తాయి సంగతులు. ఇప్పు డొస్తారా? నన్ను కొంచెం మాట్లాడనిస్తే....'

'ఇప్పుడిక్కడలేదు. నాటకానికి వెళ్ళింది.'

'ఐతే వస్తానండీ. క్షమించాలి.' వరహాలు వెనుదిరిగి గేటుదాటి చీకట్లో సందులూగొందులూ చుట్టి టౌనుహాలుదగ్గరకొచ్చి కాస్సేపు అటూయిటూ తిరిగి నాటకంహాల్లోకిపోయి కూర్చున్నాడు.

తొమ్మిదిన్నరకు టంచన్‌గా తెర లేచింది. జనం బాగావచ్చారు. మొదటిసీను ముప్పావుగంట లాగింది. తండ్రికూతుర్ని వదిలేసి వెళ్ళిపోవటం, అమాయకురాలైన భక్తురాలిగా రాధవేషం మీరా జాగ్రత్తగా నటించింది. ఒకపక్క మూఢత్వం ఒకపక్క హాస్యం ఒకపక్క జీవితం: రాజకీయబాధితుడు, కృష్ణమూర్తిగా శ్రీహరి వేషంవేశాడు. రెండవ సీనులో కృష్ణమూర్తి రాధ సంసారికజీవితంలో హాలాహలం బైల్దేరుతుంది. అతన్ని తను యెన్నికష్టాలు పడుతున్నది, వుద్యోగం మోసంచేసి ఎల్లాసంపాయించినది అన్నీ చెప్పుకుంటాడు. అన్నిటికీ భగవంతుడే వున్నాడంటుంది ఆపిల్ల. తరువాత కోర్టుసీను - రాధ కోర్టులో కృష్ణ

మూర్తి జీవితకథనంతా నిజంచెప్పేస్తుంది. దేవునియెదుట అబద్ధమాడ కూడదు గనుక. కృష్ణమూర్తిని జైల్లోవేస్తారు. ఈరువాతసీనులో మీరా అద్భుతంగా నటించింది. డైలాగులు తక్కువ। అంతా మూగచిత్రం మాదిరి మాటలు తక్కువలో లైటింగ్ ప్టేజిసర్దుబాట్లు ఆశ్చర్యకరంగా చేశారు. పసిపిల్లనితీసుకుని నానాఅగచాట్లూ అవమానాలూ బాధలూ ఎంతో హృద్యంగా నటించింది సీను. ఇక్కడ విశ్రాంతికోసం నాటకం కొంచెంసేపు ఆపుచేశారు. మళ్ళీ జూదం, వ్యభిచారం, జేబులుకొట్టడం వగైరాల్తో ప్రారంభమవుతుంది కథ. లాంతరుస్తంభందగ్గర కృష్ణ మూర్తి రాధను పట్టుకున్నప్పుడు మళ్ళీ యిద్దరూ డైలాగులు చెప్తారు. ఆఖరిసీను చాలాపెద్దసీను। హరిశ్చంద్రలో శ్మశానఘట్టంలాటిది. గోవా వెళ్తారు యిద్దరూ। అక్కడి విమోచనోద్యమంలో కాల్పులు హత్యా కాండ - పీటిలో కృష్ణమూర్తిని కాల్చేస్తారు. అపడికి కప్పిన రక్తసిక్త మైన జాతీయపతాకాన్ని తాను తీసుకుని గోవా అంతర్భాగంలోకి ఆఅమ్మాయి వెళ్ళిపోతుంది.

నాటకం పూర్తిపగానే జనం కిక్కురుమనకుండా లేచి నిల్చు న్నారు. శాస్త్రి ప్టేజీమీదకు ప్రేక్షకులకోరికపై ప్రసాద్‌ను శ్రీహరిని మీరాను తెచ్చి పరిచయంచేశాడు.

వరహాలు లేచి గడియారంచూచుకున్నాడు. రెండున్నరఅయింది. హాల్లోంచి జనమంతా వెళ్ళిపోయాక నెమ్మదిగా ముందు కుర్చీలన్నీ దాటి ప్టేజీమీదకెక్కి ప్రక్కతెరల్లోంచి గ్రీన్‌రూములోకి వెళ్లాడు. ఎవరిహడావిడిలో వాళ్లున్నారు. శాస్త్రి గొంతుచించుకుని అరుస్తున్నాడు. ఆక్టర్లు వేషాలు విప్పుకుంటున్నారు. ముఖాలు కడుక్కుంటున్నారు. వేషాలు దుస్తులు జోళ్లు కర్రలు కంపలు ఫర్నిచరు అంతా చిందర వందరగా వుంది.

మీరా అద్దంముందు కూర్చుని ముఖం తుడుచుకుంటున్నది. వరహాలు నెమ్మదిగా వెనుకనుంచివెళ్ళి ఆమె రెండుభుజాలమీదా చేతులు వేసి 'మీరాదేవిగారూ, బ్రహ్మాండంగా నటించారు.'

మీరా ఒక్కమాటు కెవ్వుమని కేకేసి కుర్చీలోంచి ప్రక్కకు వాలి పడిపోబోయింది. వరహాలు పట్టుకుని 'ఇంత ప్రజ్ఞకలదానివని తెలిస్తే నిన్ను వదలకనేపోదును.' నాలుగువైపుల్నించీ శాస్త్రీ సూర్య నారాయణా శ్రీహరీ యింకా అంతమందీ పరిగెట్టుకొచ్చారు యేవి టేవిటని.

'ఎవఁడ్రానువ్వు?' అని మస్తాను గుడ్లురుముతూ వరహాలుమీద కొచ్చాడు. శాస్త్రి వరహాలుపట్టులోంచి మీరాను గుంజుతూండగా - సూర్యనారాయణ ముందుకొచ్చి 'ఎప్పుడొచ్చావురా? నువ్వీ నాటకాని కొచ్చావా? అని తెల్లబోతూ ఆశ్చర్యంగా అడిగాడు. మీరా శాస్త్రి చేతుల్లోంచి వరహాలుచేతుల్లోంచికూడా జారిపోతూ తల టకాటకా కొట్టేసుకుంటున్నది.

వరహాలు - 'ఒకచుక్క బ్రాందీవుంటే పొయ్యండి, ఇప్పుడే చిలకల్లే మాట్లాడుతుంది.'

మస్తాను సోడాకాయ తెచ్చాడు, శాస్త్రి గ్లాసులోకిపోసి అందిస్తూ సూర్యనారాయణకేసి అర్థంగాకుండా చూస్తున్నాడు. 'ఈ నాలుగైదు రోజులూ రిహార్సలూ అవీ చేసి శక్తిలేక నువ్వు పిలిచేసరికి తట్టుకోలేక పోయింది. ఐనా యిదేంపనిరా, తిన్నగా రాకూడదూ?'

'మీరంతా డ్రామావాళ్లు గదోయ్! సస్పెన్స్ ఎల్లాగుంది?'

శాస్త్రి చిరాగ్గాచూస్తున్నాడు. మీరా చన్నీళ్లు ముఖానకొట్టేసరికి లేచి నీరసంగా వరహాలుమొహంలోకి చూసి తలదించేసుకుంది. జనం చుట్టూ నిలబడిపోయి చూస్తున్నారు. నాలుకలు బైటకుపెట్టి లోపలకు లాగి తర్జనభర్జనలు పడ్తున్నారు.

సూర్యనారాయణ జనాన్నితోస్తూ 'ఏముందీ? వాడు దాని మొగుడు....'

శాస్త్రి - 'వచ్చాం! అల్లుడుగారూ, చూపువాసిలో మీకు బాజా అయిపోయివుండేది యిల్లాటి అఘాయిత్యం తలపెట్టినందుకు.'

జనమంతా నెమ్మదినెమ్మదిగా సామాన్లు మోసుకుంటూ యిళ్ళకు చేరుతున్నారు. శాస్త్రి, సూర్యనారాయణ, మీరా వరహాలూ పోయి కారులోకూర్చున్నాక ప్రసాద్‌ను శ్రీహరిని పిలిచి 'మీరిద్దరూ వృద్ధిలోకి రావలసినవారుగనుక స్టేజీమీద యీ రాత్రికి కాపలాపడుకోండి. నీ నాటకం వేయించినందుకూ, నీకు హీరోవేషం యిచ్చినందుకు మీరు యావజ్జీవితం కృతజ్ఞులైవుండాలి మరి.'

కారు దూసుకుని వెళ్లిపోయింది మీరాయింటికి. గుమ్మందగ్గిరే వరహాలు కృష్ణమూర్తిగారితో - 'ఇదుగో, యీ అమ్మాయిగురించేనండి మిమ్మల్ని యిందాక అడిగింది' అన్నాడు మెట్లు ఎక్కుతూ.

'హోరి అప్రయోజకుడా!' అని కృష్ణమూర్తిగారు నోరు తెరిచారు.

# 9

'మీరా'ని హోటల్‌శకుంతలాకు పిల్చుకుపోయాడు మేజర్ వరహాలు, నాటకంనీరసం పోకుండానే. యెటూ పైకిపోతున్నాంగదా అని లోపల పరికిణీ పిల్కుడి వేసుకుని మీద పల్చటి మబ్బుమడతల ఐదుగజాల చీర చుట్టుకుని అదేగీరల తెలుపునీలం చోళీ వేసుకుని ముస్తాబు చేసుకుంది. ముక్కుపుడక పెట్టుకుని నువ్వుగింజతిలకం దిద్దుకుంది. జాగ్రత్తగా చేతివ్రేళ్ళకు పాలిష్‌చేసుకుని, చక్కని జోడువేసుకుని, కనుబొమలు కుంచెతో సర్దుకుని అందాలబరిణల్లే నింపాదిగా వయ్యారంగా కూడా నడిచి హోటల్‌గదిలోకి వచ్చింది.

వరహాలు పెట్టితెరిచి బంగారువాచీతీసి - 'పెట్టుకో, బావుంటావు.' అని అందించాడు.

'నాకవసరంలేదు.'

'నేను నీకివ్వంగూగగా ?'

'మీరెవరు - నేనెవరు ?'

'యిదేం వేదాంతం ? నిన్ను తీసుకుపోదామని వచ్చాను.'

'నేను రాను !'

'నిన్ను పెళ్ళాడాను కదా ?—'

'మీ మంగళసూత్రం ఏనాడో పీకిపారేశాను.'

'కాదంటే తప్పుతుందా ?'

'మీతో నే నెటువంటిసంబంధం పెట్టుకోదల్చుకోలేదు.'

'జరిగిందేదో జరిగిపోయింది. నువ్వు నాతో వచ్చెయ్యాలి ?'

'అవసరంలేదు - రాను.'

'ఇదుగో, నేను మర్యాదగా బ్రతిమాలుతున్నాను, విను - '

'విన్ను. మీరనవసరంగా నామీద ఎటువంటి అధికారము హక్కులు వున్నట్లు భావించుకుని మాట్లాడకండి.'

'నిన్ను లొంగదీసుకోవడం నాకు చేతకాదనుకుంటున్నావు కాబోలు - '

'మీరిక్కడనుంచి మర్యాదగా వచ్చినదారిని వెళ్ళండి. నాతో జోక్యం మీ కనవసరం - '

'ఐతే నేను రావటం నీకేమీ యిష్టంలేదా ? నన్ను వదిలించుకోవాలని త్వరపడ్తున్నావా ?'

'అల్లాటి అభిప్రాయాలు నాకేమీలేవు. నాకు అసహ్యంగా వుందని నే ననలేదు.'

'నన్ను చూస్తే నీ కెట్లాగుంటుంది ?'

'ఎందుకడుగుతారు అనవసరపు ప్రశ్నలు -'

'నన్ను నువ్వు రెచ్చగొడ్తున్నావు ? చెబ్తున్నాను : నేను చాలా ప్రమాదకరమైన మనిషిని.'

'మీ యోగ్యత వేరే మీనోట వినక్కర్లేదు.'

'నేను చచ్చిపోయానని అనుకుని వుంటావు - అవునా !'

'నేనెవరి కీడూ కోరను.'

'నువ్వు బరితెగించిపోయావు, నీకు వెనకాతల బలగంవుంది. ఆ ఆసరా చూసుకుని నోటికొచ్చినట్లల్లా వాగుతున్నావు.'

'నేను మళ్ళీ చెబుతున్నాను. జాగ్రత్తగా వినండి. నాకూ మీకూ ఎటువంటి సంబంధమూ లేదు. మీ బ్రతుకు మీరూ నా బ్రతుకు నేనూ బ్రతుకుతున్నప్పుడు, యీవాళ హఠాత్తుగా వచ్చి మీ హక్కులన్నీ పున స్థాపితం చేసుకున్నట్లు మాట్లాడకండి, నేనేమీ మిమ్మల్ని పరుషవాక్యం అనలేదు. మీరు నోటికొచ్చినట్లు మాట్లాడొద్దు.'

'ఐతే నాతో కూడా యెందుకొచ్చావ్ యిక్కడికి?'

'మీ కభ్యంతరం లేకపోతే మీరు మీసామానుతో నేనున్నచోటుకి వచ్చి నా కతిథిగా వుండవచ్చును.'

వరహాలు పళ్లు పటపటా కొరికి - 'నేను నీ మొగుడ్ని కాదని అంటున్నావు. అవునో కాదో యిప్పుడే తేల్చుకుంటాను.'

మీరా వెంటనే తలుపుకేసి పరుగెట్టింది. వరహాలు రెక్కపట్టు కుని 'ఇప్పుడు విడిపించుకో.'

ఆమె గింజుకుంది, రక్కుతూ. అతడు వొక్కలాగు లాగి - 'వెఱ్ఱిమొఱ్ఱి వేషాలు వెయ్యకు.'

చేత్తో మొత్తుతోంది. 'నన్ను విడిచెయ్యండి. ఇదేం మర్యాద కాదు.'

'మర్యాదేవిటే - ' తర్వాత బూతులుతిడుతూ చీర లాగేశాడు. కాళ్లతో తంతోంది విడిపించుకోవటానికి. అతడు ఎడమచేత్తో మెడ బలంగా వంచి ఆమెచెంపలను కఠినంగా తన రొమ్ములతో అదిమి నొక్కుతూ కాళ్లతో లుంగలుచుట్టిన చీరను వెనక్కు వెనక్కు తోస్తున్నాడు.

'నన్ను చంపేస్తారా? చంపెయ్యండి.' యేడుస్తోంది రొప్పుతూ.

'నిన్ను చంపుకుంటానా - ' వీపుమీద చోళీవెనక పట్టుదారాల్ని నిర్దయగా త్రెంచేశాడు. పట్టుచోళీ చిరిగి అతడి చేతులోకి వచ్చేసింది.

మళ్లీ కోపంగా గోడకుపడేసి మనిషిని శూన్యవస్త్రిను చేస్తూ మంగళ సూత్రం త్రెంచేశానన్నావుగదూ !' అని, ఆవేశంతో మీరాను రెండు చేతులతోనూ బొమ్మనుపట్టుకున్నట్టు మీదకెగరేసి నడుం పొదివిపట్టుకుని గుండెలపరహా యెత్తుకోబోయాడు. ఆమె అక్కసుతీరేలా తన రెండు మోకాళ్లతోనూ ఎదురుబొమ్మలమీద బలంగా పొడిచింది. వరహాలు పట్టు వదిలేశాడు. మీరా పరుగెత్తి గదిలో మూల మోకాళ్లమీద ముడుచుకకూర్చుని దిగువనుదొరికిన చీరను వొంటిమీదకు లాక్కుంటోంది, వరహాలు 'అం - కానా ! గుండెలమీద తంతావుటే -' తర్వాత అశ్లీలంగా తిడుతూ మూలకూర్చున్న మీరాపాదాలు దొరకపుచ్చుగుని బరబరా నేలమీద యీడ్చుకుంటూవచ్చి కాళ్లు కదలకుండా తను వ్రాలి పోయి రెండుచేతుల్తో బుజాల్ని నేలకదిమేశాడు.

'అబ్బా, చచ్చిపోతున్నాను నేను. నన్ను చంపెయ్యండి.' ఇంకా మీరా నేలమీద తన యావచ్ఛక్తీ వినియోగించి కాళ్ళు లాక్కుందామని చూస్తోంది, తల యిటూఅటూ నేలకేసి కొట్టుకుంటూ.

వరహాలు తన ముఖాన్ని ఆమెచెంపలకు అదిమి 'చెప్పినమాట వినకూడదే ? ఇదేమి నీకుకొత్తా ?....'

మీరా తలను లాక్కుని తుప్పుక్కున మొహంమీద వుమ్మేసింది. వరహాలు మోకాలుమడిచి ఆమె తొడమెముకమీద బలంగా వొక్క పోటు పొడిచాడు. అమ్మో' అని అరిచింది. ఆమె రెండవకాలును కూడా వెనక్కుమడిచి కీళ్లు పట్టుతప్పేలా వంచాడు. దీన్తో ఆమెకాళ్లు నేలమీద ఎక్కడపడపేసినవి అక్కడే చలనంతప్పి నేలకు కర్చుకు పోయాయి. తరువాత చేతుల్ని మెలిత్రిప్పేసి వాటికికూడా పట్టు తప్పి పోయేలాచేసి దురాక్రమణ సాధించుకున్నాడు.

మీరా కేవలం గ్రుడ్లప్పగించి చూస్తున్నది. ఆ అమ్మాయి కంటి చివరలనుంచి చెంపలమీదుగా వెచ్చటి కన్నీరు నేలకు పాడుతోంది.

వరహాలు ఆమె అశక్తతను లొంగుబాటును విజయంగా స్వీకరిస్తూ - చిన్నగొంతుకతో పలకరించటం మొదలెట్టాడు.

'నువ్వేం మడిగట్టుకు కూర్చున్నావా? ఎన్నిచేతులు మారావో - నాకెందుకు? నేనేం తక్కువతిన్నానా? మేం పలుగురై దుగుడుం జట్టుగా తిరిగేవాళ్లం. ఏదిదొరికినా నలుగురం పంచుకునేవాళ్లం. జీప్ మీద షికారికి పోయొచ్చేవాళ్లమా - అక్కడ అడివిలో కొండజాతుల వాళ్లు కలిస్తే - వాళ్లు యెంతబలంగా పుష్టిగా వుంటారనీ - ఆడవాళ్లను పట్టడం మహాప్రమాదకరం. ఒంటరిగా దొరికితే చుట్టుప్రక్కలెవరూ లేకుండాచూసి బలవంతాన లాక్కొచ్చి జీపులోయెత్తుకుపోయి యే చెట్టు కిందో, యేటిపర్రల్లోనో, దుబ్బులమాటునో - వొకరు తుపాకీ గురిపెట్టు కుని ఒకరు స్టీరింగుదగ్గరా మాటేసి కాపుండేవాళ్లం! ఆ ప్రాంతం ఆ పెరపెరా వాళ్లలో తిరిగేవా - అరిగేవా? పట్నవాసంముండలకుమల్లే డబ్బుకావాలా యేమన్నానా? అగ్గిపెట్టెలు బిస్కట్లపొట్లాలు పారేసి వచ్చేవాళ్లం.'

పరహాలు ప్రక్కకు వొత్తిగిలి మీరాను లాగి మీదను పడవేసు కుని - 'నేనెందుకు పనికిరాలేదు నీకు? ముందేచెప్పానా నాకు తిర స్కారం పనికిరాదని? నీకు కావాలసినంత డబ్బు యిస్తానన్నాను - నాతో తీసుకెళ్తానన్నాను. ఏంతీపు దిగదీసింది? నువ్వు ఎల్లా మాట్లా డావో తెలుసా - పౌరుషమున్న మగాడు అంతపనీ చేస్తాడు. లే, ఏడవకు. వొళ్లునొప్పులుగా వుందా? వేడ్నీళ్లు తెప్పిస్తాను. వుడుకుడుకునీళ్లు పోసుకుందువుగాని. నిద్రపోయేముందు వొక పెగ్గు బ్రాందీ యిస్తాను. తెల్లారేసరికి నవ్వుతూ లేస్తావు. ఇన్నాళ్ళూ వదిలేశానని రోషంకొద్దీ అలాగన్నావు. నీకుమట్టుకు తెలీదూ నేనెందుకోసంవచ్చానో.... లేచి పైజామా తొడుక్కుని పంగుని చేతినందివ్వబోయాడు. మీరా చేతులమీద లేవబోయి టక్కున వెనక్కువ్రాలి పడిపోయింది. మనిషంతా చెమట ముద్దకట్టిపోయింది. అవయవాలు భగ్గున మండిపోయి తనువంతా కాలి పోయినట్లయిపోయింది. పరహాలు పెట్టెమూతతీసి గాజుగ్లాసులో రెండవు న్సులు కలుపుకొచ్చి కాసినినీళ్ళుపోసి మెడను తనవొళ్ళోకి తీసుకుని నోట్లో వ్రేలుపెట్టి అదంతా గుటకవేయించాడు. తరువాత మీరాను రెండు అరచేతుల్తో యెత్తి బాత్‌రూంలోకి తీసుగొచ్చి తొట్టిలోపడుకోబెట్టి

'వుండు. యిప్పుడే వస్తాను'. అని షవర్ బాత్ త్రిప్పి, బొట్టెతీసుకుని క్రిందకువెళ్ళి వేన్నీళ్ల పట్టుకొచ్చాడు. మీరా నిర్జీవంగా కళ్ళుమూసుకుని శవంలాపడివుంది. ఆమెతలకు పసుపురాసి జుట్టుముడివేసి నెత్తిన తడి పడకుండా మల్లెపువ్వులాంటి తువ్వాలు చుట్టాడు. తొట్టిలో చన్నీళ్లు వంపేసి వేణ్ణీళ్లు పాళంగాకలిపి ఆమెను వెనక్కిముందుకూ పిల్లరుబొమ్మలా కదిలిస్తూ సబ్బులో తొట్టిఅంతా నురుసులుగ్రక్కేట్లా ఒళ్లురుద్ది స్నానం చేయించి 'ఇకరె'మ్మని చేతినందిచ్చాడు. తొట్టెలోంచి లేచి నిర్చే కలిగింది ఆమె, వరహాలు టర్కిష్‌తువ్వాలులో ఆమెచెంపలు ముక్కు కనుబొమలు మెడ భుజాలు వీపు శ్రద్ధగా తడి అద్దుతున్నాడు. 'కాలు సరిగాపెట్టు –' ఆమె చెప్పినట్లే చేసింది. అతను ఆమెపాదాలను అతి శ్రద్ధతో చలువరాతిబొమ్మను తుడిచినట్లు కూర్చుని అద్దుతున్నాడు. 'లేచి నడు –' ఆమె వెనకాలే నడచి మళ్ళీ గదిలోకివచ్చింది.

ఆగదిలో యెక్కడిభీభత్సం అక్కడ అల్లానే చెక్కుచెదరకుండా వుంది.

తలపిన్నులు రాలివున్నాయి. పగిలినగాజులు చెదరిపడ్డాయి, పొడుగ్గా నీలంగా ఆకుపచ్చమీద యెవడో చిత్రకారుడు బండకుంచెతో రాసినట్లు చీర నేలమీద పొడుగ్గా పన్నగంలా చుట్టుకొనున్నది, వటకా తెగిపోయిన పట్టుపరికిణీ నడుమునుంచి జారినప్పుడు ఎట్లా కుప్పలా కూలిందో అట్లానే నురుసులుగ్రక్కుతున్న పాలసముద్రంలా ముడుచుకొనివుంది. వాలికలూపేలికలయిన చోళీ గోడవారను పొడుగ్గా మిలమిలా మెరుస్తున్నది. వరహాలు వంతావేసొచ్చి మీరాభుజాలమీద చేతుల్ని వేసి నడిపిస్తూ 'పడుకో, దుప్పటీ కాస్సేపాగికప్పుతాను.'

మీరా మంచంమీద గోడవారగా ముఖంపెట్టి అరచేతుల్తోగుండెలు పత్తుకుంటూ పడున్నది. అతడు హిమాలయాబుకే డబ్బాతీసి ఆమెమీద గట్టింగా చల్లి, చిన్న పౌడితువ్వాలు తీసుకుని ఒళ్లంతా అద్ది, తెల్లటి దుప్పటితెచ్చి మీదవాకా కప్పి. 'పడుకో' మళ్ళీ మెలకువచ్చేవేళకు పాలు

రెండుఆపిలుపళ్లు ద్రాక్షపళ్లు యీస్టూలుమీద పెట్టాను. ఒంటిగంటయాక లేపుతాను నిద్రపోదువుగాని, నేనోసారి క్రిందకెళ్లి వస్తాను. అని వరహాలు క్రిందఅడ్డదిడ్డంగా పడేసివున్న బట్టలన్నీ జాగ్రత్తగా దులిపి మడతలుపెట్టి వంకీన వ్రేలాడేసి తలుపు బయటలాగి గొళ్ళెంపెట్టి వెళ్ళిపోయాడు.

పంకా పెడ్డిగా తిరుగుతున్నది 'బంయ్' మంటూ. చిన్న 'బ్లూ' దీపం చల్లగా పరిమితంగా వెలుగుతున్నది గదిలో. మీరా చూస్తూన్నదల్లా ఎప్పుడు కళ్లుమూతలుపడ్డాయో తెలీకుండా నిద్రపోయింది. తిరిగి ఆమెకు మెలకువొచ్చేసరికి గదిఅంతా చల్లగా గడ్డకట్టుకుపోయినట్లనిపించింది. ఎప్పటిలా వరహాలు ఆమెను పెనవేసుకుని పడున్నాడు. పాతబ్రాండీ వాసనకు ముఖంత్రిప్పుకుని రెండుఅరచేతుల్తో ముఖాన్ని రాసుకుంటూ అతడి సర్పపరిష్వంగంలోంచి విడల్చుకుంటూ మంచంమీద కూచ్చుని కిటికీలోకి చూసింది. ఒళ్లంతా బద్ధకంగా బరువుగా లాగుతోన్నట్లుంది. కాళ్లు నేలమీద ఆన్చి నెమ్మదిగా లేచినిలబడి ఆవలించి వొళ్లువిరుచుకుని మబ్బుల్లో కరిగిపోతున్న జాబిల్లిని దీక్షగాచూస్తూ జుట్టు ముడివేసి మంచాన్ని తప్పుకుని స్టూలుదగ్గరకొచ్చి నిలబడింది. నిజంగా దారుణంగా ఆకలవుతున్నట్లు తోచింది. గ్లాసుతీసుకుని పాలన్నీ త్రాగేసి వంకీన పరికిణీ చీరా గబగబా చుట్టేసుకుని బాడీకట్టుకుని చీలికలువాలికలయిన చోళీ తొడుక్కొని గదితలుపువేసి బాల్కనీలోకొచ్చి వీధిలోకి చూసింది. అంతా నిశ్చలంగా గంభీరంగా మంత్రించినట్లుంది. ఎన్నో గుమ్మాలు మెట్లు, జనం తొక్కివిడచిన బాట కూడా విశ్రాంతితీసుకుంటున్నాయి. మురికికాలవలో నల్లటినీళ్లు పొర్లి రోడ్డు అంచుల్ని మలినపరుస్తున్నాయి. దీపస్తంభాలచుట్టూ పురుగులు ఎగిరి ఆడుకొంటున్నాయి. కొమ్మలు రెమ్మలు మంచులోతడిసి బరువెక్కిపోయి దిగులుగా చీకట్లో నేలకు చూస్తున్నాయి. ఎక్కడో సుదూరాన ఒకకేక - తర్వాత ఒక కుక్క మొరుగు - కాస్సేపాగాక ఒక యీల తప్పితే వాతావరణమంతా నిశ్శబ్దంగా వుంది. మీరా మెట్లుదిగి అడుగులు చప్పుడుచెయ్యకుండా షోటలుబల్లల్నీ కుర్చీల్నీ తప్పించుకుంటూ వంటశాలలోకొచ్చింది. పెద్ద

పెద్ద పొయ్యిలు గొంతుకవూట్చున రాక్షసులల్లే వున్నాయి. ఖాళీపాత్రలు గాబులు గరిటలు గ్లాసులు పళ్లాలు అన్నీ పేర్చబడి అడ్డదిడ్డంగా వున్నాయి. అక్కడే గుమ్మానికడ్డంగా మెవరెవరో నల్లటి మురికితువాళ్లు చుట్టుకుని పడి దొర్లుతున్నారు. మీరా క్షణకాలం తటపటాయించి, వాళ్ళను దాటుకుంటూ గుమ్మందాటి, దుర్గంధంతో కుప్పలుకుప్పలుగాపోసిన కుళ్ళిన ఆహారపదార్థాలతో పారుతూన్న మురికికూపాలన్నీ దాటు కుంటూ, ఆ సందులోంచి బైటకు వెనకవైపునవున్న తలుపు గొళ్ళెం తీసి, వీధిలోకి వచ్చింది. గాఢాంధకారం! ఆ గొంది నానాపాడుగానూ మెగుడుదిగుడుగానూ బీభత్సంగానూ వుంది. గుండెలు వేగంగా కొట్టు కొంటున్నాయి. రొమ్ముల్ని చేతుల్తో కప్పుకొని వేగంగా నడిచింది. దోమలు కుళ్ళగుంటల్లో పొర్లుతూండటంవలన యీగలు జుమ్మని రొదచేస్తున్నాయి. కాళ్ళక్రింద తేమతేమగా నానాకళ్మలమూమా.... మీరాకు తలతిరిగిపోతున్నట్లుగా తోచింది. ఆ నరకాన్ని దాటి దీప స్తంభం చేరుకోకుండానే కుక్కలు బొయ్యిమంటూ మొరుగుతూ వెంబ డింప నారంభించాయి. ఆమెకు ముచ్చెమటలూ పోశాయి. ఒగరుస్తూ వేగంగా అడుగులువేస్తూ రోడ్డుమీదకొచ్చి ఒక్కక్షణం నిలబడి ముఖం తుడుచుకుందామని చేతులోకి పయటచెంగు లాక్కోపోయింది. అప్పటికిగాని తెలివేసు - అంతసేపూ ఆమెచేతిలోవున్నది ఆపిల్‌పండని, ఆ పండును చీరెకు తుడిచి గట్టిగా కొరికి ఆ నీళ్ళనములుతూ వీదు లన్నీ దాటి 'నేషనల్ ఫొటోస్టూడియో వద్దకు వచ్చి ఆగిపోయింది. ఆమెకాళ్ళు గజగజ వణుకుతున్నాయి. అరుగుమీదకెక్కి లోపలకు తొంగిచూసింది. 'జెంట్స్ అండ్ లేడీస్ ఔటు ఫిట్టర్స్ మస్తాను కట టాల వెనక చాపమీద గళ్ళలుంగీమీద దొర్లుతున్నాడు. ఒకప్రక్కన చూలిపోకుండా కటకటాలగజాల్ని వ్రేళ్ళతో బలంగా పట్టుకుని - 'మస్తానూ - మస్తానూ!' అని పిలిచింది. మస్తాను లేవటంలేదు. ఆపిల్‌పండుముక్క విసిరికొట్టి 'మస్తానూ!' అని కేకపెట్టింది.

మస్తాను లేచి ఎవరంటూ తలుపుతీసి - 'ఏవమ్మా, యిప్పు డొచ్చావ్?' అని ఆశ్చర్యపోయి అడిగాడు.

మీరా వణికిపోతూ - 'నన్ను పట్టుకో మస్తాను. పడిపోతున్నాను. మీదకు తీసుకెళ్లు.'

'మస్తాను మీరానుపట్టుకుని మెట్లమీంచి నడిపించి తీసుకెళ్తూ - 'ఏంతల్లీ - యింతరాత్రప్పుడొచ్చావ్ ?'

'నన్నేమీఅడక్కు. నేనేచెబ్తాను. మీదెవరైనా వున్నారా ?'

'అదేంటమ్మా, గజగజా వణికిపోతున్నావు ? నిద్రలోగాని లేచి నడిచొచ్చావా ? తెలివుందా ?'

'వుందిమస్తానూ - ' రొప్పుతూ 'ఇక నువ్వెళ్ళిపో - '

మస్తాను దిగిపోయాడు. వరండాలో శాస్త్రి పడుకున్నాడు. శాస్త్రి ప్రక్కమీంచి దొర్లిపోయి కటికనేలమీదకు వచ్చేశాడు. స్టూడియో తెరలు యెత్తి మీదకు కట్టేశారు. హాల్లోని దీపం మాత్రం వుంది. నవారుమంచంమీద సూర్యనారాయణ వాలుగా శేష శాయిలా పడుకున్నాడు. మీరా కళ్ళనిండా నీళ్లు క్రమ్మాయి. గుండె ల్లోంచి కట్టలుత్రెంచుకొని దుఃఖం పుప్పెనలా వుబికివస్తోంది. గోడల్ను వ్రేలాడతీసిన భాగీరథిగారి చిత్రాలు కళ్లకు అలుముకుపోతున్నాయి. గది కన్నీటిపొరల్లో కాగితంమీద చిత్తరువులా రెపరెపలాడిపోసాగింది. ఇక ఆట్టేసేవు నిల్చొనేశక్తికూడా వున్నట్లులేదు. సూర్యనారాయణ మంచంమీద కూర్చుని వెక్కివెక్కి యేడుస్తూ చుట్టలా అతడిమీద వ్రాలిపోయింది.

సూర్యనారాయణ వుక్కిరిబిక్కిరై లేవబోయాడు. గుండెలమీద బరువుగా చెంపల్ను తాకుతున్న జుట్టుముడి, తలనూనెవాసన అతడు చేతుల్ని లాక్కోబోతే, ఆ చేతుల్ని పట్టుకుని, ముఖానికి హత్తుకుం టున్న వైనం - అంతా కలలా తోచింది. నెమ్మదిగా అతనికళ్లు విచ్చు కున్నాయి, తెలివొచ్చింది.

'ఎవరు ? - యిదేమిటిది మీరా ? ఎట్లావచ్చావ్ ?'

మీరా అతడి మెడను పెనవేసుకుంటూ తన చెంపలలో అతడి గుండెను హత్తుకుంటూ 'ఇట్లా నన్ను కాస్సేపు యేడవనివ్వండి.'

సూర్యనారాయణ కంగారుగా - 'వుండు, నన్ను లేవనీ, నేను నీపుంచందగ్గిరే కూర్చుంటా. ఏంజరిగిందో చెబుదుగాని.'

'ఉహ్హూ:' తల పెంకెతనంగా వూయించింది. 'మీరు కదలొద్దు.'

సూర్యనారాయణ అరచేత్తో కళ్ళుతుడుస్తూ - 'ఇదేవిటిట్లాగున్నావ్? ఎప్పుడన్నా యిల్లా వచ్చావా ? నాకేవిటో మతిపోతోంది.' అతడి గొంతుక బొంగురుపోయింది. మీరా అతడ్ని త్రోసి చోటుచేసుకుని పడుకుంటూ అతడి చేతుల్ని పట్టుకుని తన మెడలు కాళ్లు చూపిస్తూ 'కాళ్లు విరిచేశాడు, మెడవంచేశాడు, చేతులు విరిచేశాడు, కోడిపెట్టను నులిమేసినట్లు నలిపేసి చంపాడు.' ఏడుస్తోంది దీనంగా - 'చెప్పండి ? యీ దేశంలో ఆడదాన్ని వాడుకునేవిధం యిదేనా ? వివాహం యేనాడో యిచ్చిన హక్కులు యీవిధంగా ఆడదాని శరీరంమీద దయాదాక్షిణ్యాలు లేకుండా అమలుజరుపుకోవటానికేనా ? ఆడదానికి యిష్టంలేదన్న విష యాన్ని మీ మగజాతి యెన్నడూ గుర్తించి గౌరవించదా ? ఈ శరీ రాన్ని యెంతో గౌరవంగా సుకుమారంగా చూసుకున్నాను. ఈనాడు ఆ లజ్జా నాకున్నగౌరవం అభిమానం అన్నీ చిత్రవధ చేశాడు, అమాను షంగా. రాక్షసులు మనుష్యు యిట్లానే చూసేవారేమో ! మీరంతా నన్ను ఎంత ఆదరించి కడుపులోపెట్టుకుని రక్షించారు ? నేనేం పాపంచేశాను ? చెప్పండి! ఈమెడమీద గాయాలు చూడండి. బుజాలు కొరికేశాడునీచుడు. తొడయెముకలమీద పోట్లుపొడిచాడు. నడవలేక నడవలేక ఎల్లా నడిచా నని....యేమని యెవరితో చెప్పుకోను ? నా కట్టుకున్న బట్టలన్నీ చింపి పోగులుపెట్టాడు. పేగులు చుట్టుకుపోతున్నాయి. లోపల....'

సూర్యనారాయణ ఆమెను దగ్గరగా లాక్కుని గుండెలకదుము కుంటూ - 'ఏడవకమ్మా! పిచ్చితల్లీ ! ఆ దుర్మార్గుడ్ని నమ్మి యెందుకెళ్ళా

పమ్మా! కూడా శాస్త్రినో ప్రసాదునో తీసుకెళ్లకపోయావా? మేమింత మందిమి వుండగానే నీకింత ఘోరం జరిగిపోయిందా? ఛీ! ఛండాలుడు -'

మీరాచెంపల్ని తన చేతుల్తో తుడుస్తూ - 'ఇంక నిన్నేమీ చేయలేను. జరిగిందేదో జరిగిపోయింది. భయపడకు. నిద్రపో.... నేను వెళ్లి శాస్త్రిపక్కన పడుకుంటాను.' అని సూర్యనారాయణ ఆమెచేతుల్ని నెమ్మదిగా విడదీస్తూ మంచంమీంచి లేవబోయాడు.

మీరా వెఱ్ఱిదానిలా నవ్వింది - 'ఈ శరీరం దీని పవిత్రత అందచందాలు వీటితో నాకింకేమీ ప్రసక్తి లేదు. నాకున్నదేమో అంతా నేలపాలైపోయింది. ఇక నేను కోల్పోయేదేమీ లేదు. మీరెందుకు మాస్టారూ అనవసరంగా కంగారుపడతారు? ఈ రాత్రి యెప్పటికీ అంతంగాకుండావుంటే, నా యీ శరీరం యీ మంచానికంటుకుని హరించిపోతే యెంత బావుణ్ను?'

'నువ్విలాగంటే నేనింకేంచెప్పగల్ను -' సూర్యనారాయణ అరచేతుల్లో ముఖందాచుకొని 'నీ యీ అవమానాన్నిగూర్చి తల్చుకుంటూంటే - యిదే నా కూతురికి, నా భార్యకు, నా అక్కకు, చెల్లెలికి జరిగినట్లు కుమిలిపోతున్నాను.'

మీరా నెమ్మదిగా సాలోచనగా - నాకిప్పుడిప్పుడనిపిస్తోంది. నే నెందుకు యిల్లా లజ్జాహీనంగా యీ శరీరాన్ని ఆ హోటలుగదినుంచి యింతదూరం మోసుకొచ్చానా అని. ఏ నూతిలోనన్నా వురికి ప్రాణాలు తుదముట్టించుకొనివుంటే పీడా విరగడయివుండేది. నాకు ఆ ఆలోచన యెందుకురాలేదో....'

సూర్యనారాయణ ఆమెను ఆప్యాయంగా పొదివిపట్టుకుని - 'మా అదృష్టం యింకా బాగుంది. నిజంగా నువ్విలాంటిపని చేస్తే మే మెంతగా కుమిలికుమిలి బాధపడేవాళ్ళమో తెలుసా! మీరా, యిదుగో చెబుతున్నాను విను: నువ్వేమీ ఖిన్నపడకు. నువ్వంటే మా కెంతగౌరవమో, అభిమానమో అందులో పిసరంతకూడా మార్పువచ్చిందని నీవనుకో

నక్కర్లేదు, నిజంగా మేమంతా నిన్ను సమానంగా ప్రేమించి ఆదరించి గౌరవిస్తున్నాము. ఈ సీదను నీ కష్టాల్ని మర్చిపోయి జీవించమని నేను సాహసించి అడగలేక అడుగుతున్నాను.'

మీరా అతడి చేతుల్ని తీసుకుని తన చెంపలకు రాసుకుంటూ - 'మీ దయను కోరివచ్చాను. ఇంత వాత్సల్యం అమృతంలా కురిశాక నాకింకేమీ వొద్దు. నాకస్సలు వ్యక్తిత్వమే వొద్దు. కరిగి మీ అందర్నీ చుట్టుకొని గోదావరిలా ప్రవహిస్తాను. మీరంతా అందులో మునకలేస్తూ వుండండి.'

దూరంగా పోలీసుఠాణాలో నాలుగుగంటలు వినిపించాయి.

స్టూడియోతెరలు నాజూగ్గా అందంగా వూగిసలాడుతున్నాయి. సూర్య నారాయణ ప్రక్కమీదనుంచి లేచి అలమార్లో ఫ్లూటు తెచ్చి మీరా ప్రక్కనే నేలమీద మంచంకోడునానుకొని ఏవో రాగాలు ఆలాపనచేస్తూ కూర్చుండిపోయాడు.

# 10

చీకట్లు విచ్చి వేకువవచ్చి మేలుకొలుపు పాడుతోంది. మీరా అస్పష్టంగా గొణుగుతోంది - 'అయ్యో! యీ వెలుగులో కెందుకు వస్తున్నాను నేను? నన్ను కన్న ఆ తల్లి కడుపులోని చీకట్లు నన్నెందుకు మింగెయ్యలేదు? ఆకారమేలేని నేను తల్లికడుపు చీల్చుకొని పురిటిచావన్నా చావకుండా యీ వెల్తురులోకి ఎందుకువురికాను? అబ్బా....' మూలుగుతోంది.

రాత్రికి మెలకువవొచ్చి దిండుమీద చెవిఆన్చి-'సూర్యనారాయణా, క్రొత్తపోర్షన్ యేదన్నా రిహార్సలు చేస్తున్నావా ఆడగొంతుకతో? లేవండోయ్!!! కంకలా.... మరిచాను, ఈ కుర్రవాడు మధుర స్వప్నాలు గంటున్నట్లున్నాడు పీడ్ని లేపకూడదు. శ్రీహరీ! రంగ

మార్తాండా - కాఫీతో మొహంకడుక్కొని సాంబారుతో స్నానం చేసే సమయం కావచ్చింది. డామిట్! ఒక్కడూ లేవడు. సూర్య నారాయణా! ఈ ప్రసాదు మీఅమ్మాయిని ప్రేమిస్తున్నట్టున్నాడు. నీఅనుజ్ఞ అయితే కనిపెట్టి వీడికి మన తడాఖా చూపించమని కలవా....' శాస్త్రి ప్రసాద్ వీపుమీద గట్టిగా చరిచాడు.

'అమ్మబాబోయ్....ప్రొద్దున్నే ఎంతదెబ్బ కొట్టారండీ?' ప్రసాద్ వీపు తడుముకుంటూ లేచాడు. సూర్యనారాయణ వసారాలోకొచ్చి తలకాయ వంచుకునే - 'రాత్రి మీరా వచ్చింది. లోపలుంది....'

శాస్త్రి - 'హ్హా! చచ్చితిమి! అని, చాపచుట్ట చంకకెత్తుకుని కళ్ళు నులుముకుంటూ స్టూడియోగుమ్మంపొదిగిట నిలబడి - 'నమస్కారం దేవిగారూ! బ్రహ్మచారిముండా వాడిని నా కెందుకు, అడక్కూడదుగాని, యేమల్లాగున్నారు?'

మీరా దగ్గరకురమ్మని చేత్తో సంజ్ఞచేసింది. శాస్త్రి సమీపానికి వెళ్ళి ఆమెను పరీక్షగా చూసినమీదట అంతా అవగాహన చేసుకున్నాడు. కూర్చోమని తన ప్రక్కను చేత్తో చూపించింది. 'వుహ్హూ!' అని శాస్త్రి అడ్డంగా తల వూయించి, 'నా బ్రహ్మచర్యాన్ని పాడుచేయకండి. పరస్త్రీని అంటితే భగ్గునమండి కాలిబూడిదవుతానని భయం నాకు.' చేతులు త్రిప్పి అభినయించి చెప్పాడు.

మీరా ఫక్కుమని నవ్వేసింది. కనుకొలకుల్లోని నీరు టప్పుమని రాలి దిండుమీదకు చిందగా - 'ఏవిటి అంటున్నారు? మీనాక్షిని ప్రసాదు ప్రేమిస్తున్నాడనా? అతణ్ని పిలవండి - '

ప్రసాదు నెమ్మదిగా బెదురుతూబెదురుతూ వచ్చి దూరంగా నిల్చు న్నాడు. మీరా అతికష్టంమీద లేచి ప్రసాదుని చేయిపుచ్చుకుని లాక్కొని తన ప్రక్కన కూర్చోబెట్టుకుని అతడి మెడమీద చేతుల్నివేసి బుజం మీద తలఆన్చుతూ - 'చూడండి, ఈ అబ్బాయి గుండె యెంత వేగంగా కొట్టుకుంటున్నదో - నాకిక్కడికి వినిపిస్తోంది. సిగ్గుగావుందా - భయం వేస్తోందా? చెప్పు! నన్నుచూస్తే నీకెల్లాగనిపిస్తోంది?'

ప్రసాద్ మృదువుగా ఆమెచేతుల్ని నొక్కిగించుకుని చూడంగా జరుగుతూ తెలతెల్లబోయి గజగజావణికాడు.

శాస్త్రి వంగుని మీరాచెవిలో 'శుభ్రమైన కుర్రాడిని చెడగొడ్తే స్తున్నారు' అంటే మీరా నవ్వుతూ 'నేను చెడిపోయానా?' అని తలెత్తి అడిగింది.

శాస్త్రి నవ్వాడు. 'నేనల్లా అనగల్నా? శివుని జటాజూటం నుంచి భగీరథుడి నెత్తిమీద దూకినట్లు యీమంచంమీద వచ్చిపడ్డారు. సూర్య నారాయణ తట్టుకున్నట్టు యీప్రవాహం తట్టుకోగలడా అని అన్నాను అంతే-'

'ఐతే నదీనదాలు కొండలూ అడవుల్నీ ముంచెత్తి పాతాళంవరకూ ప్రవహిస్తాను. నన్నెవరూ ఆపకండి!'

సూర్యనారాయణా, శ్రీహరీ లోపలికొచ్చారు. ప్రసాదు వొళ్లో తలపెట్టుకొని మీరా నలుగురివంకా చూస్తూ పడుకుంది. ముగ్గురూ మంచం చుట్టూ కూర్చున్నారు. ఎవరూ మాట్లాడ్డంలేదు.

సూర్యనారాయణ - 'చెప్తానువినండి' అని ప్రారంభించాడు—

'వరహాలుసంగతి మీకెవరికీ తెలీదు. వాడు చాలా చిత్రమైనమనిషి. మా అరవింద కాపురానికొచ్చిన కొత్తలో వోరోజు నాదగ్గరకొచ్చి నీపెళ్ళాం చాలా బావుంటుంది అన్నాడు. నీకెల్లా తెలుసు అని అడిగా. రేవుదగ్గర్నుంచి నీళ్లబిందె బుజాన్నెత్తుకుని స్నానంచేసి వస్తూంటే కూడా వచ్చా మీయింటిదాకా. అప్పుడు తెలిసింది అన్నాడు. సంతోషించాం లన్నా. మాఆవిడ గోలపెట్టింది. ఎవడో వచ్చినాడు రోజూ వెనకాలే యింటిదాకా తగులడ్తున్నాడని. ఫరవాలేదులే అన్నాను. తరువాత కొన్నాళ్లకి అరవింద పుట్టింటికెళ్లింది. అక్కడ్నుంచి వెల్లాళ్ళయాక ఉత్తరంవ్రాసింది - 'యీ వరహాలువచ్చినాడు ఇక్కడికూడావచ్చాడు! మీరు స్నేహితులని పేరుచెప్పి యింట్లో నాయోగక్షేమాలు అడిగి కాఫీ త్రాగివెళ్ళిపోయాడ్ట? వీడెవరే అని అంతా నవ్వుయా ఎగతాళీపట్టించారు. మీకు చీమకుట్టినట్లయినా వుండటంలేదు. నాప్రాణం వచ్చిపోతోంది'

అని వ్రాసింది. నాకు పొట్టచెక్కలయేలా నవ్వు! వోరోజు మీయావిడను చూసివచ్చానోయ్' అని నాతో వచ్చిచెప్పాడు. ఏమంది? ఎల్లాగుంది? కులాసాగావుందా?' అని అడిగాను నవ్వుతూ. 'ఆహా! చెప్పాను: 'ప్రేమిస్తాను. చూడందే వుండలేను. వచ్చాసన్నాను.' నేను వేళాకోళంపట్టిస్తూ - 'వాళ్ళేమన్నారు?' అన్నా. ఛీ! ఛీ! అవతలకు పొమ్మన్నారు. మీఆవిడ యేడుస్తూ వెళ్ళిపోయింది. అదిచూసి నేను రోడ్డుమ్మీదకు వచ్చేశా-'నన్నాడు. నేను కొంచెం సీరియస్‌గా 'పరాయివాళ్ళ స్త్రీలను అట్లా అవమానించొచ్చా?' అని అడిగాను. 'ఇందులో తప్పేవిటోయ్, నేను కావాలన్నాను. నువ్విచ్చెయ్యాలి. అది ధర్మం! నన్నేదన్నా అడుగు నేనల్లాగే యిచ్చేస్తాను. ఈప్రపంచంలో యేదీ మన్దికాదు. అందుచేత నిర్మొహమాటంగా అడిగితే యేది లేదనకూడదు. నేను అవహేళనగా దీన్నే గుండుచెంబు 'వేదాంతం అంటారు' అన్నా. వరహాలు సీరియస్‌గా 'అడుగేదన్నా! నీకు వరంయిచ్చాను;' అన్నాడు. 'మాటతప్పవ్వుగదా-' అన్నాను. 'అడిగిచూడు-' అని కవ్వించాడు. అప్పుడు మీరా అనాథశరణాలయంలో వుంటున్నది. కుట్టుపన్లూ అల్లికలూ సంగీతమూ చదువూ నేర్చుకుంటూ. శరణాలయానికి తీసికెళ్ళి 'ఈపిల్లను నువ్వు చేసుకోవాలి: కనీసం వొక్కప్రాణినన్నా నువ్వు వుద్ధరించి ఆశ్రయమిస్తే గొప్ప ఆదర్శప్రాయమైనవాడివవుతావు' అన్నా. వరహాలు అల్లాగేనన్నాడు. నేను పొంగిపోయాను. ఇద్దర్నీ తీసుకెళ్ళి నవీనపద్ధతిని రిజిష్టరువివాహం చేయించబోయాను. పిల్లకు వయస్సు తక్కువ, పనికిరా'దన్నారు. అప్పుడు దేవుడిగుళ్ళో మూడుముళ్ళూవేయించి 'టీపార్టీ'యిచ్చి తెచ్చి యింట్లో పెట్టుకున్నాను. కాని వాడితో నేను కాపురంచెయ్యనని యీపిల్ల పెంకెతనం ప్రారంభించింది. 'అదెల్లాగే! ఆసంగతి ముందే యెందుకు చెప్పలేదు?' అని విసుక్కున్నాను.' అనాథశరణాలయంవాళ్ళు వొదిలించుకోవాలని చూస్తున్నారు. మీరు యెవరికో అంటగట్టాలని చూస్తున్నారు. అప్పుడు నామాటెవరు వింటారు?' అని యేడ్చింది. నేను నాలిక్కొట్టుకున్నాను. నేనింట్లో లేనప్పుడు యిద్దరూ

తగూలాడుకుని నేనువచ్చేసరికి గుమ్మానికి చెరోప్రక్కనానుకుని 'అది నన్ను కర్చిందనో, చూడండి నన్నెలా కొట్టాడో' అనో యిద్దరూ వొకర్నిమించి వొకరు నేరాలు కుప్పలుతిప్పలుగా చెప్పిపోసేవాళ్లు. రాత్రిళ్లు నేను ఎక్కడ మంచంవేసుకుని పడుకుంటే ఆక్రిందను చాప తెచ్చి వేసుకుని తానూ పడుకునేది. వోరాత్రివేళ వడహాలువచ్చి పిలిచే వాడు. వాడిచేయికరిచేసో, ఒక్కో, అరిచో, నానాగొడవాపెట్టి నన్ను కూడా నిద్రలేపి కూచోబెట్టేవాళ్లు. నేను చెబ్తాలే అని వాడ్ని సముదా యించి నంపి మీరాను భయపెట్టేవాణ్ని: 'మిమ్మల్ని యింట్లోంచి తరి మేస్తాను తిన్నగావుండకపోతే....' అని. నన్ను మళ్లీ అనాథశరణా లయంలో చేర్పించెయ్యంటే అని అడిగింది. చేర్చుకోరనిచెప్పాను. పోనీ మీరు స్టూడియో పెట్టండి అందులో పనిచేస్తాను అంది. నీకోసం నన్ను స్టూడియోపెట్టమన్నావా ? అన్నాను. నాకుచేతిపనులువచ్చు. కాగితంపూలు చేస్తాను. కుట్టుపనులు చేస్తాను. పుస్తకాలు బైండు చేస్తాను. బొమ్మలు రాస్తాను. నేను వుద్యోగంచేస్తానుకాని కాపురంచెయ్యనని కచ్చితంగా చెప్పేసింది. నాకు కోపంవచ్చి కేకలేసి తిట్టాను. సామానుతెచ్చి వీధిలో పెట్టి యిద్దర్నీ పొమ్మని గేటువేసేసి లోపలికొచ్చాను.'

సూర్యనారాయణ కథ ఆపుచేసి 'మీరా'కేసి చూసి చిరునవ్వు నవ్వాడు. మీరా మెడను ప్రసాదువొళ్లోంచి తీసుకుంటూ 'కాళ్లు నొప్పు లెట్టాయా ?' అని అడిగింది. ప్రసాదు సిగ్గుపడి తలకాయవంచుకున్నాడు. లేచి కూర్చొని కాళ్లమీద చీరను సర్దుకుంటూ అనాథశరణాలయంలో మమ్మల్నెవరూ మనుష్యుల్లా చూచినపాపాన పోలేదు.' నన్నెవరు కన్నారో యెవరు తెచ్చి శరణాలయానికప్పగించారో ఆవైనం నాకేమీ తెలీదు. ఆసుపత్రిలో పురుళ్లోసుకుని అప్పగింతపెట్టి వెళ్ళిపోయిన ఆ స్త్రీ యెవరో ఆతల్లి కడుపు ఎంతశోకించిందో అదంతా వూహించలేను. కాని అప్పుడప్పుడు పిల్లలకోసం యెవరెవరో వచ్చి చూసుకుని పెంచు కుందుకు తీసుకుపోతూంటారు. నాకు రెండేళ్లప్పుడు నన్నెవరో శ్రీమం తులు ఆడపిల్లకావాలని యెంచుకుని ముచ్చటపడి తీసుకెళ్లారట. నాకు

మూడేళ్లన్నా నిండకముందే ఆదంపతులకు సంతానంకలిగి మళ్ళీ నన్ను తెచ్చి అనాథశరణాలయానికి వప్పగించేశారు. నాకేదో కొంత డబ్బు యేర్పాటుచేశారు పోషణకు, పెంపకానికి. ఆడబ్బు నాకోసం యెంత కర్చుపెట్టారో, యేంచేశారో ఆవివరాలు యెవరడుగుతారు ? నన్నెవరు పెంచుకున్నారో వారిపేరులు వివరాలు నాకుగాని, యెవ్వరికీగాని తెలియనివ్వకుండా కట్టుదిట్టాలు జరిగాయి. శరణాలయంలో మేమే అన్నిపనులూ చేసుకోవాలి. దిక్కులేనిపిల్లల్ని తెస్తే వాళ్లకు సంరక్షణ, వంటా, నీళ్లు తోడటమూ, బట్టలుతకటమూ యీ చాకిరీలన్నీ చేశాక క్లాసులకు పోయే వాళ్లం. మమ్మల్నెవరూ ఆదరించేవారుకాని, పలకరించి మా ఆటలు, పాటలు, చురుకుతనం, తెలివితేటలు మెచ్చుకునేవారుకాని యెవరూ వుండరు. ఏవో చవకరకం గుడ్డలు అందరూ వొకేమాదిరివి కట్టుకునే వాళ్లం. మేంకాస్త పెద్దవాళ్ళమవుతున్నకొద్దీ మా కష్టాలు హెచ్చేవి. మాశరణాలయం కమిటీనిండా యెవరెవరో వర్తకులూ, శ్రీమంతులూ, అధికారులూ వుండేవారు. మా వసతిగృహాల్లోకి మగవారెవరూ రాకూడదని నియమాలున్నా యీ పెద్దలెవరూ అడ్డగించటం నేనెప్పుడూ చూడలేదు. మానివాసాల్లోకి ఎవరెవరో వచ్చి మమ్మల్నిచూసి విషపునవ్వులు నవ్వి, విరాళాలు, చందాలు ఘనంగా యిచ్చి, మాకు సందేశాలు నీతులూ చెప్పిపోతూండేవారు. మా మేనేజరు వొక వృద్ధజంబుకం వుండేవాడు. అతడి కబురు యే శరణాలయంపిల్లకు వచ్చిందో ఆఅమ్మాయి గజగజా వొణుకుతూ మమ్మల్ని వదల్లేక కళ్లుకాయలుగాచేలా యేడ్చియేడ్చి వెళ్ళి విక్టోరియాబండిలో కూర్చునేది. మేమంతా గదికిటికీల్లోంచి ఆవిక్టోరియా బండి యెటువైపు పోతున్నదో చూసేవాళ్లం గుమిగూడి. ఈపిలుపు చేనాకు యెవరికి వస్తుందో తెలీదు. ఎవరు వెళ్లనంటారో, వెళ్లి అల్లరి చేసి యెవరువస్తారో, వాళ్లను మా స్నానాలగదిలోకి తీసుకెళ్ళి బట్టలు వొలిచేసి వొంగోమనేవారు మోకాళ్ల మీద చేతులాన్చి. మా ప్రిన్సిపాలు వచ్చేది. ఆవిడ పేముబెత్తం తీసుకుని పిరుదులమీద పన్నెండుదెబ్బలు కొట్టేది. ఎప్పుడన్నా ఆవిడకు తీరికలేకపోతే దాదులో పనిమనుషులో

మా వీపులు సాఫుచేసేవారు. నామాటలు మీకు నమ్మకంలేకపోతే నావీపు చూడండి. చర్మం కమిలిపోయి పేముబెత్తంచురకలు తగిలినచోట్లల్లా పొంగి పొరలు విడిపోయేవి. నేనెన్నిసార్లు అట్లా దెబ్బలుతిన్నానని? తరువాత అయోడిన్ తెచ్చి మావీపులమీద ద్రిమ్మరించి తడిగుడ్డలుకప్పి వరుసగా వొక్కరిబుజాలమీద వొకరిచేతులుంచి వసండాలోంచి నడిపించి తీసుకెళ్లేవారు. నేనెప్పుడూ విక్టోరియాబండి ఎక్కలేదు. ఆదింటె వారం వారం వచ్చిపోయేది. నావీపు పిరుదులు చిట్లిపోయి సొమ్మసిలి స్నానాల గదిలో పడిపోయేదాన్ని. నాకోసం నాతోటి నిర్భాగ్యబాలికలు శరణాలయం నవుకర్లకు లంచాలిచ్చి దెబ్బలు నెమ్మదిగాకొట్టమనో, కాసిని తగ్గించి తప్పుడు లెక్కలు చెప్పమనో బ్రతిమాలుకొనేవాళ్ళు. ఆనరకం నుంచి బైటపడేందుకు సూర్యనారాయణగారు నాపాలిటిభగవంతుడిలా వచ్చారు. నాకీయనపరిచయం ఎల్లాకలిగిందంటే - శరణాలయం వార్షికోత్సవాల్లో యీయన నాకు 'మేకప్' చేసేవాడు. అప్పుడు నాకు పన్నెండో పద్నాలుగో - జ్ఞాపకంలేదు. నాకు రంగులు వేసేందుకు దగ్గర కూర్చున్నారు. కాస్సేపయాక నాటకందుస్తులు యిచ్చి వెళ్లి ఆచీకట్లో కట్టుకు రమ్మన్నారు. నేను చీకట్లోకి వెళ్ళి ఎంతసేపటికీ రాలేదు. నాబట్టలు వీపుమీద పిరుదులమీద పుళ్ళకంటుకుపోయాయి. అవి రావటంలేదు. నేను యేడుస్తున్నాను. ఆయన నన్ను వెతుక్కుంటూ వచ్చి మీరా, మీరా' అని పిలిచారు. నేను యేడుస్తూ చెప్పాను. ఆయన వపుడరు కొబ్బరినూనె తెచ్చి నా వొళ్లంతారాసి క్షణంలో నాకు ముస్తాబు పూర్తి చేసి నన్ను ముద్దెట్టుకుని వొళ్ళో కూర్చోబెట్టుకున్నారు. అవునా?' మీరా క్షణకాలం కథను ఆపుచేసి సూర్యనారాయణకేసి చూసింది.

సూర్యనారాయణ - 'అప్పుడు నువ్వు చిన్నపిల్లవు. నాకడుపు తరుక్కుపోయింది. నిన్నానరకంనుంచి ఎల్లాతప్పించడమా అనే చింత నన్ను పట్టుకుని వేధించేది. అప్పుడు యుద్ధం ఆఖరయినరోజులు. హిరోషిమా నాగసాకీలమీద బాంబులువేసిన సంవత్సరం. మనదేశంలో నాయకులంతా జైళ్ళలో మగ్గుతున్నారు. తిండికరువు, బట్టకరువు వచ్చి పడింది. బెంగాలులో వొకప్రక్క క్షామం మనుష్యుల్ని తుడిచిపెట్టేసింది.

హిందూముస్లిం ఘర్షణలు ఎక్కడచూచినా. ఎర్రకోటలో ఐ. ఎన్. ఏ. వీరుల్ని విచారిస్తున్నారు. నాజీవితం అప్పుడూ యిప్పుడూకూడా అస్థిరమే గదా! నా ఫొటోలందుకాణం ముఖం ఎవరూ చూసేవారుకారు. మా మీనాక్షికి ఐదేళ్లు. నేనూ అరవిందా వొకపూట వుంటే తిని రెండోపూట పస్తులు పడుకునేవాళ్ళం. అల్లాంటప్పుడు నిన్ను తెచ్చి యెక్కడ పోషించగల్ను? ఊరుకున్నాను చేతగాక!'

శాస్త్రి యింతసేపూ నోరుమెదపకుండా వింటున్నవాడల్లా అందుకున్నాడు! 'ఆరోజుల్లో నేను విశాఖపట్నంలో మిలటరీఅకౌంట్సులో పనిచేసేవాడ్ని. ట్రక్కులో వెళ్ళటం వోచర్లు రంగుపెన్సిలుతో టిక్కులు పెట్టడం, మిలిటరీ ఆఫీసర్లు బిస్కెటుటిన్నులు, సిగరెట్లు తెచ్చియిస్తే అవి తీసుకుని బిల్లులు ప్యాసుచేయడం. మాకో స్టడీసర్కిలు వుండేది. దాంట్లో ఆదివారాలు వస్తే 'మార్క్సిస్టుదృక్పథం - గతితార్కిక భౌతికవాదచర్చలూ చేసేవాళ్లం.' పుస్తకాలు క్షుణ్ణంగా చదివేవాళ్ళం. రణలోగా మాలాటి మెట్రిక్యులేషనుసరుకంతా ఊడలాగేశారు. నాదగ్గిర మంచిమంచి బూట్సులజోళ్లూ నాలుగైదుసూట్లూ యివే మిగిలాయి. నాతోబాటుపని చేసిన ఒక మాజీసైనికోద్యోగి యూనివర్సిటీప్రిన్సిపాలుగారి కారు డ్రైవరుగా కుదిరాడు. అతను నాకు తారసిల్లి నేను వొంటిపూటతిని వీధిలో పడుకుంటున్నానని విని నాకు బోటనీ డిపార్టుమెంటులో అట్టెండరుద్యోగం వేయించాడు. అక్కడ జీతం అంతాకలిపి నలభైఆరో యేడో యిచ్చేవారు. గదిఅద్దె పదిరూపాయలు. యూనివర్సిటీ బస్సుకి ఆరురూపాయలు. హోటలుకి పాతికరూపాయలు. ఇక ఐదోఆరో పైకర్చుకి, చాకలి, మంగలి వగైరాలకు సరిపోయేదికాదు. లేబరేటరీకి చాలాషోగ్గా ముస్తాబయి మంచికోటూ అదీ వేసుకుని దర్జాగా వెళ్ళేవాడిని. అక్కడ యెమ్మెస్సీ డాక్టరేటు చదువుకుందుకు ఎంతమందో అమ్మాయిలూ, అబ్బాయిలూ వచ్చేవారు. వాళ్ళతో సరదాగా కబుర్లు చెబుతూ ఎక్కడికన్నా వాళ్ళు స్టడీటూరికి వెళ్ళి మొక్కలూ, ఆకులూ, చెట్లూచేమలూ తెస్తే వాటినన్నీ త్రుంచుతూ అంతా గుండ్రంగా కబుర్లు

చెప్పుకుంటూ చూస్తుండేవాళ్ళం. ఆడిపార్టుమెంటు ప్రొఫెసరుకి నా చలాకీ కంటకింపుగా వుండేది. ఆ కోటు విప్పేసి లాబరేటరీగేటుదగ్గర స్టూలు వేసుకు అస్తమానూ కూర్చోమని గదమాయించేవాడు. అంతా నేనూ స్టూడెంటునే అనుకునేవాళ్ళు. కాని నేను యెప్పుడైతే టెలిస్కోపులు, బిల్లలు, సీసాలు తుడవటం ఆరంభించానో అంతా నన్ను పోల్చుకుని జారిపడేవాళ్ళు. టిఫినువేళకు ఎవరో టికెట్టుయిచ్చి ఫలహారంచేసి రమ్మనేవాళ్ళు. నేనువాళ్ళతో బస్సుల్లో కాలేజీకొస్తూ సోషలిజమూ, కమ్యూనిస్టువ్యవస్థా చర్చిస్తే వాళ్ళు ఆశ్చర్యపోయి కూడా సినీమాలకు ఎక్స్‌కర్షన్లకూ తీసుకుపోయి నన్నొక్కక్షణం వంటరిగా దిగులుగా వుండ నిచ్చేవారుకాదు. అప్పుడే నేను యావజ్జీవితం బ్రహ్మచారిగా వుంటానని శపథం చేసుకున్నాను.' శాస్త్రి మీరాకేసి చూసి 'చెప్పండి : సూర్యనారాయణ యింట్లోంచి గెంటేసి గేటుబయట మీసామాను పారేస్తే అప్పుడేం చేశారు ?'

'మీరా తర్వాత యిల్లాగ చెప్పింది: 'నాకేమీ సామానులేదు. రెండేరెండు పరికిణీలు, మూడునాలుగు జాకెట్లూ, పెళ్ళికి సూర్యనారాయణగారు కొనిపెట్టిన చీరా యివే నాబట్టలు. నాదగ్గర చిన్న సూటుకేసు మాత్రం వుంది. అందులో మూహాయలోపు చిల్లరా, యింకా సూదులూ, దారాలు కత్తెరా, పుస్తకాలు బైండుచేసేందుకు వాడే సామాను - యిదే ఆస్తి. వరహాలు అపెట్టె నాచేతిలోంచి తీసుకుని తనతో రమ్మని తాను ముందు నడకసాగించాడు బైట వెన్నెలగావుంది. చాలాసేపు నడిచి, యిప్పుడు మేమున్న పాకవుండేచోట పాకశిథిలమైన పెంకుటిల్లు వుండేది. అక్కడకు యిద్దరమూ చేరుకున్నాక వరహాలు ఆతుప్పుపట్టిన తాళం బ్రద్దలుకొట్టి లోపలికి రమ్మన్నాడు. చిత్తుకాగితాలు తుక్కు ఎండుగడ్డి చిదుపుతూ మంటపెట్టి యిద్దరమూ, గబ్బిలువారి బ్రద్దలయిన ఆకొంపలో పాములేవున్నాయో, త్రేళ్ళు, జెర్రులూ ప్రాకుతున్నాయో యేమీ తెలీకుండా నిశ్శబ్దంగా కూర్చున్నాము. ఆయింట్లో ఒక ధోషాణంవుంది. ఒకప్రక్క చూరు బ్రద్దలయి, వడకగదిగాబోలు, గోడలుకూలిపోయి

చంద్రుడూ, తారకలూ దర్శనమిస్తున్నారు. ఇదివరకు ఆయింట్లో వొక ముసలమ్మ వుండేదనీ, ఆవిడ తనకు నాయనమ్మ అనీ, చనిపోయిందనీ, ఆవిడసామాను యేమేమి అధోషాణంలో వుందో తనకు తెలీదనీ, చెప్పాడు వరహాలు. అందులో కొన్ని పుస్తకాలు, నాటకగ్రంథాలు వున్నాయని, అవి వాళ్ళనాన్నగారు వ్రాసినవనీ చెప్పాడు. చదువుకో లేదా, వుద్యోగమేమీ చెయ్యటంలేదా అని అడిగాను. బియ్యే తప్పాననీ అంతక్రితమే ముగిసిన యుద్ధంలో పనిచేస్తూ పారిపోయొచ్చేశాననీ, తన్ను మిలిటరీ పోలీసులు యేక్షణంలో నన్నా పట్టుకుపోవచ్చుననీకూడా చెప్పాడు. నాకు కోపంవచ్చి అడిగాను: 'అల్లాంటప్పుడు నన్నెందుకు పెళ్ళిచేసుకున్నావని ? సూర్యనారాయణకు మాటయిచ్చాను. ఆ మాట నిలబెట్టుకున్నానన్నాడు. నేను యేడుస్తూ ఆ కొంపలోంచి పరుగెట్టాను. గుమ్మానికెదురుగా పాడునూయి కనుపించింది. వరహాలు వచ్చి నా చేయిపట్టుకుని యీడ్చుకొచ్చి గుమ్మంమెట్లదగ్గరకు కూర్చోబెట్టాడు. తెల్లారేక యిల్లంతా తుడిచి పుటగూపు[?]ట్రాలేకుండా మన్నుమెత్తి గోడలూ గదులూ శుభ్రం చేద్దామన్నాడు. ధోషాణం బ్రద్దలుకొట్టి అందులో యేమిసామాను వుందో అంతా నాకిస్తానన్నాడు. ఇంటిచుట్టూ కంచెకట్టి నూతిగట్టు బాగుచేసి రెండుమూడురోజుల్లో తలదాచుకునేట్లు యేర్పాటుచేసియిచ్చి నేను వెళ్ళిపోతాను. నన్నెలాగూ పోలీసులు తీసుకుపోతారు. తరువాత నీ యిష్టంవచ్చినట్లు చెయ్యి! నూతిలోపడాలనుంటే పడు! ఎవరికి నష్టం ? నువ్విప్పుడింటిలో వురికి చచ్చిపోతే నీకోసం తాజమహాలు కట్టించి యిస్తాననుకున్నావా ? నీ కివ్వటానికింతకంటే నాదగ్గిరేమీ లేదు. నువ్వు ముష్టెత్తుకో, ఎవరితోటన్నాపో. లేకపోతే ఎక్కడన్నా నవుకరీ సంపాదించుకో. నాకేంసంబంధంలేదు. నీ బ్రతుకు నీది....' అన్నాడు. నాకు పుక్రోషంవచ్చి మంగళసూత్రాన్ని త్రెంపి గిరవాటేశాను. మంచి పని చేశావు. నేనే రేపువుదయం నిన్నడిగి దీన్ని బజారుకిపట్టుకెళ్ళి బియ్యం, పప్పూ, వుప్పూ తేవాలనుకుంటున్నాను అన్నాడు. తరువాత

పెద్ద వర్షం వచ్చింది. లేవకుండా అల్లానే కూర్చున్నాను చూరునీళ్ళలో స్నానంచేస్తూ. జలుబుచేస్తుంది అంటూ రెక్కపుచ్చుకులాగాడు. నాకు నవ్వొచ్చింది. ఇద్దరమూ గోడనతుక్కుని తెల్లవారేవరకూ అల్లాగే నిల్చుండిపోయాము. కాళ్లు బురదలో కూరుకుపోయాయి. ఆ రోజు యెప్పటికీ తెల్లవారనట్లే కనుపించింది!'

మీరా కథను ఆపుజేసి 'కాఫీలన్నా తెప్పించండర్రా -' అని కేక బెట్టింది. శ్రీహరి లేచి వీధిలోకి పరుగెట్టాడు. శాస్త్రి చార్మినారు సిగరెట్లు తీసి తలాఒకటీ పంచాడు. ప్రసాద్ మీరాకేసి నిశ్చలంగా చూస్తూ 'జీవితం యింతదారుణంగా వుంటోందా? మీరు చెప్పే సంగతులు వింటున్నకొద్దీ నా వొక్కొక్క ప్రాణం యెగిరిపోతున్నట్లుగా వుంది? నేనేం నాటకం రాశాను? మీరుచెప్పిన కథతో పోలిస్తే.... మనుష్యలజీవితాల్లో యింత అరాచకం యెందుకు యేర్పడుతోంది? ఈ ప్రపంచంలో యెవరూ సుఖపడ్డంలేదా? ఐతే జీవించటం ఎందుకు? సామాజికజీవితంలో మార్పువస్తే మనుష్యలు బాగుపడ్తారా? ఈమార్పు యెప్పుడు రావటం ఎల్లావస్తుంది?'

శ్రీహరి తలొక కాఫీగ్లాసూ ట్రేలోంచితీసి అందిచ్చాడు.

శాస్త్రి - 'కాఫీ తాగరా నాన్నా! మెదడు చల్లబడుతుంది. నాలిక్కి చురుకువస్తుంది.'

అంతా కాఫీగ్లాసులెత్తి చప్పరించటం మొదలెట్టారు.

# 11

'అక్కా! అక్కా! అక్కా! చుట్-ట్టాలొచ్చారు.' అంది పంజరంలో చిలుక. మొక్కలకు నీళ్ళుపోస్తూ వెనక్కి తిరిగి చూసింది మీనాక్షి. గేటుదగ్గర ఆర్చిలో క్రీపరు దట్టంగా అల్లుకొన్ననీడలో నిల్చున్న వరహాలు చిన్న కర్రను సవిలాసంగా త్రిప్పుకుంటూ కనిపించాడు. చిన్న కూజాబిందెను యెత్తుకొని మొక్కలపక్కనుంచి 'మా నాన్న స్టూడియోలో వుంటారు -' అంది. అతను ముందుకు నాలుగడుగులు

వేసి 'మీ అమ్మను పిలు - ' అని కొంచెం నవ్వాడు. మీనాక్షి లోనికి పరుగెట్టింది. అరవింద బైటకు వచ్చేసరికి వరహాలు పంజరందగ్గర నిల్చొని చిలకను కవ్విస్తున్నాడు.

'ఏమండీ, గుర్తున్నానా? '

'అయ్యో, మంచంవాల్చవే కూతురా; కూర్చో! వచ్చావని నాటకంపోజున విన్నాను. ఏదీ....హడావిడి? మన మీరామొగుడే - యెరగవూ?'

'ఏవిటోనండి, మీరంతా నేను దాని మొగుడ్నంటారు. అదేమో కాదు - పొమ్మంటుంది!'

'మరి చేసుగున్నావు అట్లాగ - '

'నేనేంచేశానండీ....'

'చెడగాచెడగా కాపురాలుకావు.'

'మరేంచెయ్యమంటారు చెప్పండి? నయాన్నా భయాన్నా చెప్పిచూశాను. అవెక్కడ? దేవతలకు పంచాంగాలు చెబుతుంది. '

'మంచినీళ్ళు కావాలా?'

'యిప్పించండి.'

మీనాక్షి గ్లాసుతో నీళ్ళుపట్టుకొచ్చి యిచ్చింది.

'ఈ పిల్లను దాన్తో స్నేహంచెయ్యొద్దని చెప్పండి.'

'ఎవళ్ళరాత యెల్లాగుండాలో అల్లాజరుగుతుంది. నేనెవర్ని కాదనటానికీ వద్దనడానికీను - '

'మీరు చాలా మారిపోయారు. సూర్యనారాయణగారు అప్పుడూ యిప్పుడూ ఒకలానే వున్నారు. కాస్త నెత్తిమీద నాలుగువరకలు తెల్లబడ్డాయనుకోండి. అది మనిషిమొహానికి గౌరవం ఆపాదిస్తుంది. '

'ఏమో, బుద్ధిమాత్రం ఒక్కలానే వుంది. ఆయనచేష్టలూ గుణాలూ నడతా అడక్కండి. మనిషికి నలభై యేళ్లు మీదపడ్డాకకూడా నాలుగురాళ్లు తెచ్చి కొంపలో పడెయ్యకపోతే సంసారం ఎట్లా వెళ్తుంది? వెనక పదిమంది సంతానమూ అంటే అదీలేదు. ఒక్కగాను ఒక్కపిల్ల! -

దానికి ముద్దూముచ్చటా చూసుకోవద్దూ? ఈవాళ నాటకం అంటారు. రేపు సంగీతసభ - ఎవరోవస్తారు. ఎక్కడకో వెళ్తారు కట్టకట్టుకుని. మళ్ళీ రెండేసిసెల్లకు మూడేసినెల్లకు కొంపకొస్తారు. ఏమన్నాఅంటే, నా నోరు వెలితిపడిపోవడమేగాని కష్టాలు ఎవరు తప్పిస్తారు?'

'నాటకం వేశారుకాబోలు, డబ్బేమైనా వచ్చిందా?'

'వచ్చేవుంటుంది. మళ్ళీ చేతులో చిల్లిగానీకూడా కనబడనంత వరకూ ఆయన యింటిమొహం తొక్కరు. స్టూడియో పొకటుందిగా - అక్కడే భోజనాలూ, కాఫీలు, సభలూ, సమావేశాలూ - అన్నీనూ-'

మీనాక్షి విసుగ్గా 'అబ్బ - వూరుకోవే! అవన్నీ ఎందుకే వాగుతావు?' అని అడ్డొచ్చింది.

'నాది వాగుడా? పిల్లా, కనిబెడ్తున్నాను నీ గుణం....నువ్వా అ తండ్రికితగ్గ కూతురివే వెనకేసుకొస్తున్నావు పెద్ద ఆరిందాలా. ఆతండ్రి మీద యీగ వాలకూడదు నుమంటి! ఇప్పుడు నేనేమన్నాను?'

'అస్తమానూ వచ్చినవాళ్ళందరిదగ్గరా యెందుకు అల్లా వాగటం? ఎవరు కష్టపడ్డంలేదు? స్టూడియోలో పనిలేకపోతే నాన్నేంచేస్తాడు? అసలు నువ్విలా శివమెత్తిపోతూంటావనే నాన్న కొంపకు రావడంకూడా మానేశాడు?'

'అయ్యొ! అయ్యొ! నన్ను శివమెత్తినదాన్నంటావా? నేను మీ నాన్నను కొంపకురాకుండా చేస్తున్నానా? వింటున్నావా దీని మాటలు! చూడు, దీనికెంతపొగరుందో.........రెండుపూటలా తింటున్నారో లేదో, కట్టుకుంటున్నారో లేదో కనుక్కుందుకుకూడా తీరిక లేకపోతేనే యింత అపేక్ష పొరగబెట్టేస్తున్నావు. ఇక ముద్దూముచ్చాటా తీర్చేతండ్రయితే మాటకు నా ప్రాణం తీసేసుందువు?'

'పెట్టూపోతా లేకపోతే అపేక్షలుండవుటే! నేను పెద్దయాక వుద్యోగం చేస్తాను. అప్పుడు నిన్నూనాన్ననూ పల్లకిలో కూర్చోబెట్టుకుని.... బోం-బోం-బోం!' పల్లకీ ఎల్లామోస్తారో అల్లా మెడను త్రిప్పి అంగల్ను యెత్తి యెత్తి వేస్తూ వెటకారంచేసింది మీనాక్షి.

వరహాలు పకపకానవ్వాడు.

'ఈ యింట్లో అందరికీ మతులు పోతున్నాయి. నువ్వుకూడా పోయి ఆ స్టూడియోలోనే పడివుండకూడదూ? సరిపోతుంది.'

'పోతున్నాను.' ఇప్పుడే వెళ్ళిపోతున్నా! ఇక రానంటె రానే రానోయ్!' లోపలకు పరుగెట్టింది.

'ఇదీవరస -' అరవింద దవడలు నొక్కుకుంది.

వరహాలు అరవిందకేసి పరిశీలగా చూశాడు. కళ్ళచుట్టూ మచ్చలరింగు లేర్పడ్డాయి. చెంపలమీదుగా రెండు గీతలు వచ్చాయి. మెడ చేతులూ నుదుటిమీద చర్మం మృదువుగా పచ్చగా వున్నా యేదో తళుకు మాయమైంది. చూపులో మనుపటి మనుష్యుల్ని కట్టివిలవేసే శక్తి లేదు. నడుం లావైంది. నడుస్తూంటే గుండె ఝల్లుమనిపించటం లేదేఁ తనకు? తలకాయ వొంచుకున్నాడు. ఈ యాతన డబ్బుగోల మనుష్యుల్ని కృంగదీస్తుంది గావల్ను. ఇప్పుడు వొకలక్షరూపాయల ఆస్తి వస్తే అరవింద యేంచేస్తుంది? తనేంచేశాడు? మీరా కెందు కంత నిర్లక్ష్యం? ఈ పగలు తీరేవికావా? యవ్వనంలో వుద్రేకం మాత్రమే లేదు....అజ్ఞానం వుంది, అమాయకత్వం వుంది, పొగరుబోతు తనం వుంది. ఇవన్నీ దారిద్ర్యానికి లొంగిపోతే, నిరాశానిస్పృహా భయాల్లో యీదులాడుతూ అనుభవాలనిచ్చెనల్ని వేసుకుని లోకాన్ని చూస్తారు! సూర్యనారాయణ, మీరా, తాను, అరవింద అంతా ఇప్పుడీ నిచ్చెనలమీదున్నారు.

మీనాక్షి నిమ్మకాయషరబత్తు కలుపుకొచ్చి యిచ్చింది. చీర కట్టింది. రెండుజడలు వేసి వెనుక రిబ్బన్లుకట్టి చెప్పులు తొడుక్కొని ముస్తాబయి 'నేను వీధిలోకెళ్తున్నానే' అని చెప్పడానికి వచ్చింది.

'ఇప్పుడెందుకా వేషంవేశావు?'

'తిరగడానికి.'

'పళ్ళూడగొడ్తాను.'

'కొట్టు!' వరహాలు మంచంమీద వదిలేసిన కర్రసుతీసి తల్లిచేతి కందిచ్చి, దగ్గరగా వచ్చి నుంచుంది నవ్వుతూ.

'వంటయాక యెక్కడికే పెత్తనానికెళ్తున్నావని అడిగా-' అరవింద కూడా నవ్వింది. వరహాలులేచాడు. నన్నుకూడా తీసికెళ్తావా మీ నాన్నస్టూడియోకి? - వస్తాను.'

'మీనాక్షి తల్లి మెడచుట్టూ చేతులువేసి చెవిలో రహస్యం చెబ్తున్నట్టుగా - 'నాటకం డబ్బొచ్చింపన్నావుగాద్టే....నాన్నసడిగి పాసాయలు తెస్తాను.'

పంజరంలో చిలక - 'అక్కా - అక్కా - అక్కా చ్చు....చ్చు.... చ్చుట్టూ లొచ్చారు. క్కా....క్కా....కాఫీ తెచ్చావా?' అంటోంది. మీనాక్షి పంజరాన్ని గిర్రునత్రిప్పింది. చిలక రెక్కల్ని టపటపలాడిస్తూ కాలిగోళ్ళతో వూచల్ని పట్టుకుని బరుకుతోంది.

అరవింద గేటుదాకావచ్చి 'నువ్వువచ్చేదాక నేను భోంచెయ్యను.' అంది. మీనాక్షి తలకాయ అడ్డంగావూపుతూ 'నేనూ నాన్నా స్టూడియోలో భోంచేస్తామే....' అని వరహాలుచేతికర్రను కొంటెగావూపుతూ 'మిలట్రీ వాళ్ళంటే నాకసహ్యం -' అని నవ్వింది.

వరహాలు గతుక్కుమన్నాడు. 'మేమేంచేస్తాం? యుద్ధాల్లో పని చేస్తాం! శత్రువుల్తో పోరాడాలి. దేశాన్ని, ప్రజల్ని దురాక్రమణనుంచి రక్షించాలి. మాకు యుద్ధాలు యెందుకువస్తాయో తెలీదు. కాని మేం యుద్ధాలుచెయ్యాలి! మీరు స్కూళ్ళలో చదువుకుంటూ, సినీమాలు నాటకాలు చూసేందుకు, సుఖంగా జీవించేందుకు మేం పోరాడాలి. మమ్మల్ని అసహ్యించుకుంటే ఎల్లాగ?'

'మీకు దయాదాక్షిణ్యాలుండవు. మీకు మనుష్యులమీద జాలి, కరుణవుండదు. వూళ్ళు తగలబెడ్తారు. బాంబులువేసి, కొంపలు కూలుస్తారు. పిల్లల్నీ ఆడవాళ్ళనీ చంపుతారు. తుపాకులూ, టాంకులూ, ట్రక్కులూ బాంబులూ .... యివేగా మీ జీవితం! మీరు యుద్ధాలుచేసి యెవర్ని

కాపాడుతున్నారు ? ఎవర్నో ఎక్కడో హింసించి నాశనంచేసి యిక్కడ మీరు దేన్నో కాపాడుతున్నామనుకొంటారు ? అదే నా కసహ్యం !'

వరహాలు సముదాయిస్తూ యిలాగన్నాడు - 'యుద్ధానికి కారణాలు చెప్పి మమ్మల్ని నిందించడం చాలా అన్యాయం. దేశానికి దేశానికి మధ్యగల వైరాలకి మేమేం కారణాలుకాము. మందుగుండుసామాను ఆయుధాలు యెంత నిర్జీవపదార్థాలో మేమూ అంతే. మా కాళ్ళూ తల చేతులూ మీరుచెప్పినట్లు పనిచేస్తాయి. మీరు తీరిగ్గా తూర్చుని తగూలు తెస్తారు. ఒకప్పుడు ఒక్కొక్క అవసరం దేశానికి కలుగుతూంటుంది. పెట్రోలుకావాలి. ఇనుముకావాలి. కార్లూ, రైలింజనులూ, విమానాలూ, బట్టలూ, ఆహారం, సూసెలూ, ఫొటోసామానులు, రేడియోలు అన్నీ ఎల్లా వస్తాయి? డబ్బుకావాలి. అధికారంకావాలి. అధికారం, డబ్బు, బలం లేంచే యెవరిస్తారు ? దేశాన్ని యెవరు పరిపాలిస్తున్నారు? రాజకీయవేత్తల ముఠాలు !....వీళ్ళ కధికారం యెవరిస్తున్నారు ?....ప్రజలు ! ప్రజల్లో డబ్బుగలవాళ్లు వ్యాపారస్తులూ యీ అధికారం బలం పురస్కరించుకొని రాజ్యాల్ని నడుపుతున్నారు. ఒకప్పుడు రాజులు ఆడవాళ్ళకోసం యుద్ధాలు చేశారు. మతంపేరిట యుద్ధాలు జరిగాయి. సామ్రాజ్యాలు స్థాపించారు. పెద్దపెద్ద పట్టణాలు కట్టారు. నాగరికతలు పెంచారు. కళలన్నారు. సంస్కృతి అన్నారు. సాంప్రదాయాలు అన్నారు. వీటన్నిటితో ఆకలి, అసూయ, క్రోధం, వైషమ్యాల్ని అట్టడుగున అణచుకుని తీరిగ్గా గడిపిన రోజుల్ని స్వర్ణయుగాలని వ్రాసుకున్నారు. రామాయణకాలంనుంచి కొరియాయుద్ధంజరిగేవరకూ సైనికబలం ఆయుధాలవసరంలేకుండా యింతవరకూ యెవరూ రాజ్యం చేయలేదు. రాణీరూన్సీని యెందుకు గౌరవిస్తావు ? నన్నుచూస్తే నీ కెందుకు అసహ్యంవేస్తుంది ? కరువులొస్తే మనుష్యులు మాడిచస్తారు. తుఫానులువస్తే యిళ్ళూఊళ్ళూ సర్వం మునిగిపోతాయి. భూకంపాలొస్తే పట్టణాలు, పట్టణాలు కూలిపోతాయి. అణుబాంబు ప్రేలిస్తే నాగరికత

సమస్తం ధ్వంసమయి పోదకుంటుంది. ఎవర్ని అసహ్యించుకుంటావో చెప్పు -'

మీనాక్షి వరహాలుచేతిని పట్టుకుని - అబ్బే పూరికే అన్నాను. మీకు కోపంవచ్చినట్లుంది!' అని గుంజింది నవ్వుతూ.

'నాకేంకోపం, నేను చచ్చిపోయినమనిషిని -'

మీనాక్షి నడుస్తూ ఆగిపోయి - 'ఎందుకలాగన్నారు?'

'నా కెవరూ లేరు, ఇక్కడికి యెందుకొచ్చాను? ఈ గాలి యీ మట్టి నాదిగనుక? మీరా నా యింట్లో వుంది? నన్ను వెళ్లాకింది. దానికే నన్నుచూస్తే అసహ్యం! నువ్వూ అల్లాగే అన్నావు! ఈ వూళ్లో యెవరూ నన్ను గుర్తుపట్టరు! ఎవరూ పలకరించరు! ఎవరూ ప్రేమించరు! మీ నాన్నకి నన్నుచూస్తే అసహ్యం! నా డబ్బు యెవరికీ అక్కర్లేదు! నేను బహూమతులిస్తే యెవరూ పుచ్చుకోరు!'

'పోన్లెండి! నా కివ్వండి! అవన్నీ నేను పుచ్చుకుంటాను!'

వరహాలు మీనాక్షిమొహంలోకిచూశాడు. అజ్ఞానం, అమాయకత్వం తాలూకు చెరగనిముద్రలు! చిలిపితనం తెలిపే చంచలమైన చూపులు.... గుండెలమీంచి బరువుదించుకున్నట్లుగా అనిపించి 'అల్లాగే -' అని చిరు నవ్వు నవ్వాడు.

ఇద్దరూ 'హోటలు శకుంతలా' మెట్లెక్కి పైకివెళ్ళారు.

గదిలో అడుగుపెట్టూనే 'ఈ చెప్పులు మీరావి -' అని కేక బెట్టింది మీనాక్షి ఆశ్చర్యం వ్యక్తపరుస్తూ.

'మర్చిపోయి వెళ్ళిపోయింది -' అన్నాడు వరహాలు నేల చూపులు చూస్తూ. చేతిలోకర్రతో వంకీన వ్రేలాడుతూన్న ఆలివ్‌జీన్ లాగూను పొడుస్తూ - 'ఇదేవిటిది చర్మంలాగుంది? ఇల్లాంటి అసహ్యమైన బట్టలు మీ కెల్లానచ్చులాయి.' మొహం అదోలా పెట్టి, అక్కడే బల్లమీద పడేసివున్న 'పీ' కాప్‌ను పెట్టుకుని అద్దంలో చూచుకుంటోంది, కళ్ళూముక్కూ త్రిప్పుకుంటూ మీనాక్షి.

'కాఫీ పట్రానా -'

'నా కాకలవుతోంది బాబూ ! తిండానికేమన్నా పట్రండి.'

వరహాలు మెట్లుదిగుతున్న చప్పుడు విన్నాక టోపీతీసి మంచం మీద గిరవాటేసి బల్లమీద వంగుని ఏదోచిన్న చెక్కపెట్టి కనుపిస్తే మీట నొక్కింది. పెట్టి తెర్చుకోడం తడువుగా పియానోమెట్లు నొక్కినట్లు యేదో ట్యూను వాయించినట్లు వినిపించింది. సిగరెట్టుకేసు పాడుతోంది. మీనాక్షి ఆశ్చర్యంతో దూరంగా నిలబడివింది. కాస్సేపుపాడి ఆగిపోయింది.

'పాడవేముండా'-చప్పట్లు చరుస్తూ కాళ్లు చిరాగ్గా నేలనుతడ్తోంది.

'ఎవర్నితిడ్తున్నావు ?' వరహాలు చేతిలో పొట్లం ట్రేలో కాఫీ ఫలహారాల్తో వచ్చాడు.

'ఇది పాడటంలేదు.'

'ఓహో! సిగరెట్టుకేసా ! జపానులో కొన్నాను యాభై రూపాయలప. వుండు-' వరహాలు కీయిచ్చి బల్లమీదపెట్టాడు. మళ్ళీ అదేట్యూను. మీనాక్షి వరహాలుమొహంమీద మొహంపెట్టి 'దీన్ని నాకిచ్చెయ్యండి. నా కివ్వరూ -' పెట్టితీసుకుని గుండెలకదుముకుంటూ 'దీన్ని గుండెలమీద పెట్టుకుని నిద్రపోతాను. నేను నిద్రపోతూంటే ఇది పాడుతుంది. నా కివ్వరూ ?' గడ్డంపుచ్చుకు బ్రతిమాలుతోంది.

'కూర్చో అల్లా స్టూలుమీద. అల్లరిచెయ్యకుండా వున్నావంటే నీ కన్నీ యిస్తాను.'

మీనాక్షి మంత్రముగ్ధలా కూర్చుండిపోయింది.

వరహాలు పెట్టితెరిచి బట్టలన్నీ మంచంమీద కుప్పలా పేర్చాడు.

'ఇల్లా వచ్చి చూడు.'

మీనాక్షి తొంగిచూసింది - 'అమ్మో ! ఇన్నిరూపాయలే - నోట్లు ! నోట్లు !'

'ఇవన్నీ నీ కిచ్చేస్తాను.'

'నాకెందుకు, నేనేంచేసుకుంటాను ?'

వరహాలు నవ్వాడు. 'నేనుచెప్పినట్లు వింటావా ?'

మీనాక్షి తలవూయించింది.

'నాతో వచ్చెయ్. ఈడిప్పట్టి మనం ఫ్రాంసు వెళ్ళిపోదాం. అక్కడ నువ్వు బొమ్మలు వ్రాయటం, బొమ్మబొమ్మలు చెక్కటం, నాట్యం సంగీతం, ఏదోవొకటి నేర్చుకుందువుగాని. నువ్వు 'ఊఁ' అంటే-మనం ఢిల్లీ వెళ్ళిపోదాం. అక్కడ వీసా ఎల్లాగో పుట్టిస్తాను.'

'నేనెందుకు ? - మీరాను తీసుకెళ్ళండి.'

వరహాలు తల అడ్డంగా త్రిప్పాడు - 'అదిరాదు. నేను దాన్నే తీసుకెళ్దామనుకున్నాను. కాని మీరాకు నాకూ వున్న స్పర్థ చావలేదు. నువ్వు అడిగావుకనుక చెబుతున్నాను, జరిగింది జరిగినట్లుగా - సన్నేమన్నా అను. నువ్వు చిన్నదానివి, నిన్ను పెద్దఆర్టిస్టును చేసి తీసుకొస్తాను యిండియాకు.' నెమ్మదిగా వరహాలు గతరాత్రి తనకూ మీరాకూ జరిగిన ఘర్షణ, పర్యవసానం యావత్తూ దాచకుండా వున్నదున్నట్లుగా చెప్పాడు. 'తరువాత నీయిష్టం-'

'మాఅమ్మ యేడుస్తుంది. మానాన్న బెంగపెట్టుకుంటాడు. అంతా నేను లేచిపోయానంటాడు.'

'నిజం ! నేనుచెప్పేదికూడా విను. మీనాన్న నీకిప్పట్లో పెళ్ళి చేయలేడు. పోనీ ఎల్లాగో పెళ్ళిచేసుకుని పిల్లల్నికందామనిపుంటే నువ్వు వుండిపో. నేను బలవంతం చెయ్యను. మీఅమ్మ యేడుస్తుంది-కాదనను. నువ్వు అత్తారింటికి వెళ్తే అప్పుడేంచేస్తారు ? అనల్లావుండు....నీకిల్లాటి అవకాశం యెవరిస్తారు ? ఫ్రాంసులో ఆర్టునేర్చుకోవటం యెంత అదృష్టం ! నీకు విదేశాల్లో కళను నేర్చుకునే అవకాశం నీకు కాబోయే మొగుడిస్తాడా ? వెధవ ! యిద్దరుపిల్లలు పుట్టగానే సుఖం మాట్చు కుంటాడు. పుచ్చబిట్టలూ పితిసుద్దలూ పుతుక్కుంటూ, సులకమంత మే కిదా జీవితం! పెళ్లాడితే మనదేశంలో ఇంతకంటే నీకేమన్నా వైభోగ ముందా? వంట, పిల్లలూ, తిట్లూ చివాట్లు తింటూ వుండిపోదల్చుకుంటే

నాకేం అభ్యంతరంలేదు. చురుకైనదానివీ తెలివైనదానివీకనుక వస్తావేమో నని అడిగాను. అంతే - '

మీనాక్షి నిశ్శబ్దంగా ఆలోచించుకుంటూ కూర్చుండిపోయింది. వరహాలు ఫలహారాలు పొట్లాలువిప్పి అన్నీ పరిచాడు. ఇద్దరూ వొకేపళ్ళెంలో తింటున్నామన్న జ్ఞానమన్నా లేకుండా మీనాక్షి ఫలహారంచేసి కాఫీత్రాగి 'చెప్పకుండా వెళ్ళిపోవటమేనా, ఇల్లా యీబట్టల్తోనే....' అంది.

'అహ్హో ! మనం వీసా సంపాయించి విమానంలో కూర్చునేవరకూ అంతా గప్ చిప్! ఫ్రాంసులో దిగాక వృత్తాంతంరాద్దుగాని. సరా - '

మీనాక్షి తల ఆడించింది. 'ఏదీ-వోముద్దియ్యి —' వరహాలు మీనాక్షినిముద్దెట్టుకుంటూ మీదకువంగి, 'సిగ్గెందుకు? రేపు ఫ్రాంసులో వీధికో ముద్దెట్టుకోవాలి. అప్పుడెల్లాగ? ' ఆమెచెక్కిళ్లు ఎరుపెక్కాయి.

# 12

చీకటి కురుస్తోంది. ఎర్రమింగిన కొండచిలువలాగా మెలికలుచుట్టుకుంటున్నది రైలు. ఝంఝూమారుతం వీచింది. వానలో గుడ్డల్ని పెరుక్కుంటూ పరుగెత్తే పిచ్చివాడిలాగ చెట్లు, తుప్పలు, పొలాలు; గడ్డిమేట్లు తడిసి అరుచుకుంటూ గగ్గోలుగా వెనక్కు పడిపోతున్నాయి. కట్టకడ !!! కట్టకడ !!! కట్టకడ !!! కట్టకడ !!! పట్టుకో ! పట్టుకో ! తప్పుకో ! తప్పుకో ! పండుకో ! పండుకో ! చల్లగా జివ్వుమంటున్న అరికాళ్ళక్రింద బల్ల వూగుతోంది. కిటికీఅద్దాలు చెంపలుతడిసిపోయేలా యేడుస్తున్నాయి. కొరికంచులా హవానాచుట్ట కాల్తోంది. చారల నీలి పైజామా బుసలుకొడ్తోంది. మోకాళ్ళమీంచి నల్లులు పరుగులుపెడ్తున్నాయి. బల్లిలా మీనాక్షి కాళ్ళముడుచుకుని కూర్చుంది. కళ్లుపెగల్చుకొని గుడ్లు బైటకురుకుతాయేమో ననిపించింది. రెప్పలు మూతలుపడ్డంలేదు. గొంతుకలో హాలాహలం వుండచుట్టుకుంటోంది. గుండెలో మంటలకు దెబ్బలురాలినట్లు రొమ్ములు విచ్చిపోతాయనుకుంది. ఈచీకట్లో

దీపం వెలిగించకూడదు. ఈరైలుదేవిటి సూర్యనారాయణలా పరుగెడ్తోంది? ఈరాత్రిదేవిటి? కన్నతల్లిశోకంలా గగ్గోలుపెడ్తోంది? సిగరెట్టుపెట్టి పాడుతోంది. తాళ్లు నృత్యంచేస్తున్నాయి. ఇదేవిటీగాలి? ఘాదేవికట్టు బట్టల్ని వొలుస్తున్నట్లుగా! పైజామా నేలకుదిగుతోంది. సబ్బుబిళ్ళమీది పుల్లిపొరకాగితం వొలిచేసినట్లు మీనాక్షిని వొలిచేస్తున్నాడు. రైలుబండి క్రింద పడ్డాననుకుంది. కుబుసం వొదిలినట్లు శరీరాన్ని వదిలేసి పారి పోవాలనిపించింది. మొహంమీద నాపరాయిపడి వొత్తుకుంటున్నట్లుంది. ముక్కు కొరికేస్తున్నాడు .... ఇదేమిటిది .... వెన్నలా కరిగిపోతోంది వొళ్లు. పెదవులు వొణుకుతున్నాయి. నెత్తురు పరపళ్లతొక్కుతోంది. దేవదానవులు అమృతంకోసం సముద్రమథనం చేస్తున్నారు. కళ్లు మూతలుపడ్తున్నాయి. ఇన్ని చక్కిలిగింతలుపెట్టి నన్నీచీకట్లో ఎవరు నవ్విస్తున్నారు? ఈరైలెంచుకింకా యిల్లా వూగుతుంది? ఇంతహాయిగా వున్నప్పుడు చచ్చిపోతే ఎంతబాగుంటుంది? అమ్మా! అమ్మా! నాన్నా! నాన్నా! అంతా వచ్చెయ్యండర్రా....'పరాసునగరం' బోగంది! బలే మజాగా - బాగుంది? నేను నాజుర్ని పెళ్ళాడేస్తాను. ఈవరహాలుతో సూయజుకాలువ దాడుచేయిస్తాను. వొహ్హోయ్! సరంగూ, తప్పుకో! తప్పుకో! ఈజిప్టుకి దమ్మిడీయివ్వద్దు. ఆవకాయ, చద్దెన్నము మూట కట్టుకుని మెయిలుబోటులో సూయజుకాలువ ధాటిస్తాను. పరాసువాళ్ళు యింగ్లీషువాళ్ళు అంతా రాండర్రా - మధ్యధరాసముద్రంలో - యెంకి పాటలుపాడ్తాను. నదీనదాలు, అడవులు, కొండలు, ఎడారులా మన కడ్డంకి? నో! నో! తెలుగు కవిత్వసారాయం త్రాగిత్రాగి గల్ఫ్ స్ట్రీములో శ్రీశ్రీని ముంచేస్తాను. కోయిలా కోయిలా కూయబోకే - గుండెలూ బద్దలూ చేయబోకే....మెకార్థరు వేయిపడగలు చదివాడా? వరహాలు నా మూతి నాకుతున్నాడేం చెప్మా? నా ముక్కు నానిపోతే దేవు గాలిపీల్చుకోవడం కష్టం! మా అమ్మ బొర్నుఁస్ గర్ల్....మూతి దగ్గర గుడ్డలువిప్పి నీళ్లుపోసుకున్నానని చీపురుకట్టతో కొట్టింది. పులగం చూస్తే నాకుడోకు! నేను సమర్తాడినప్పుడు కొబ్బరాకులమీద కూర్చో

పెట్టి అమ్మ వీధిలోవాళ్ళందర్నీ పిల్చుకొచ్చింది చూడ్డానికి. మీరా జాకెట్టు కుట్టి తెచ్చింది. తొడుక్కుంటూంటేనే పట్టిపోయి పుటుక్కు-పుటుక్కున తెగిపోతే పేరంటాళ్లు నవ్వారు. మస్తాను కుట్టిన బ్లవుజు శాస్త్రి కొనిపెట్టిన చీర టెలివిజన్లో కట్టుకుని చూపిస్తాను. ఊపిరాడక నేను చచ్చిపోతూంటే - యింతా యీ వరహాలేంచేస్తున్నాడు? డామిట్! దిగిరాను దిగిరాను దివినుండి భువికి - షటప్: పళ్లురాల్తాయ్ - ఆడవాళ్ళ పెట్టిలోకెందుకొచ్చావ్? చైన్ లాగేస్తాను! చూడండి, దిస్ బ్లడీస్కౌండ్రల్, ఆడవాళ్ళ నల్లరిపెడ్తున్నాడు. వేర్ఈజ్ ది గార్డ్? బండిలో ప్యాసెంజర్లంతా చచ్చేట్టు కొట్టారు వరహాలుగాడ్ని. అహా! యేవూరండి మీది? ఎక్కడికెళ్తున్నారు? పారిస్లో మూతులకు రంగులెయ్యడం నేర్చుకున్నానండి. మాది మార్టేరు. ఇప్పుడేసినిమాల్లో మూతులన్నీ మీరు చూసేవుంటారు. నరసాపురంకాలువ యిప్పుడెల్లాగుందండి? హ్హో! మైగాడ్ - నాన్నా! అప్పుడే ముసలివాడివైపోయావా - మా నాన్న చలిలో వణుకుతూ నుంచున్నాడు. మాట్లాడవేం నాన్నా? మన స్టూడియో యెల్లాగుంది? ఈవూళ్ళో టాక్సీ ఎక్కడా లేదూ? అమ్మ గరిటకాల్చి వాతపెడతానంటోందా - ఐ సీ! శాస్త్రీగారేమయ్యారు? అఖండంగా పత్రికపెట్టారా? మీరా - మీరా - సినిమాల్లో యేడుపుపాత్రలు అభినయిస్తోందా? టు టెల్ యూ ది ట్రూత్ - వన్నాక్క మిలియనీరు పెళ్ళాడేసి బాల్టీ తన్నేశాడు. నాకొడుకులిద్దరూ న్యూయార్కులో ఆకాశహర్మ్యాలు కడుతున్నారు. తణుకులో గోస్తనదివొడ్డున అంపైరుస్టేటుబిల్డింగులాటిది కట్టాలనుంది. నాన్నా యెక్కడికి వెళ్తున్నావ్? రాజోలులో పెళ్ళి గ్రూపుఫొటో వుందే అమ్మాయ్! వాళ్లు యాభై రూపాయలిస్తామన్నారు. సైకిలులో గాలి వుందో లేదో....పెనుగొండసంతకెళ్దాం వస్తావా అమ్మాయ్? దారిలో పురుడొస్తే....భారత్ సేవక్ సమాజ్ - అమ్మా! జంతికలు చేసిపెట్టవే! ఐసెన్హోవరుకు పెసరట్టువేసి పెడ్తాను. అమెరికా లొంగిపోతే వెంకటేశ్వరస్వామికి బుల్గానిన్ గడ్డం యిచ్చేస్తానన్నాట్ట! ఇదేవిటి రైలాగిపోయింది! ఢిల్లీ వచ్చేసిందా - అబ్బ! కెమేరాలు దారికడ్డంగా తీసె

య్యింది. ఆటోగ్రాఫులు మధ్యాహ్నం సంతకంపెడ్తాను. బొంగజీబు స్టేషనుకొచ్చాడా? నన్ను మాట్లాడమంటున్నారా - ఈ మైకెవరిది? ఆలిండియారేడియో....పాడతాను. నాకు పిల్లలూ పూలూ అంటే యిష్టం. నా పస్మెనొంపస్యంగురించి ససహాలుపడగండి. అప్పుడప్పుడు నేను వాడ లేను. రాజకీయాలు వెళ్ళాక చేరుంచేస్తాను. 'ఆత్మ సౌందర్యము'ను గూర్చి నేను దివసెషికవ్ లాడ్జిలో మాట్లాడతాను. నాన్నా! నాన్నా! నీకు మూడువేలు లాభంచేశాను. అమ్మయ్య! ఉరుముతోంది. పైటమా మీదకెళ్ళిపోయింది. అమ్మో! కిటికీలోంచి నిప్పురవ్వలుపడి చీర కాలిపోతోందే - నేనేం కట్టుకోను? పాపం వెంకాయమ్మకు చీరపెట్టా నంది నాపెళ్ళికి అమ్మ. అమ్మా! అమ్మా!!!

# 13

కళ యెప్పుడూ బాసింపట్టువేసుకుని కూర్చోదు. లోకరీతిలో అది కొందరువ్యక్తుల్లో సాధారణవృత్తిగా మాత్రమే మొసల్తూ, ప్రశ్నల్నింటి దేన్నో వెతుక్కుంటూ, ఆకాశపుటంచుల్లోకో అగాధపులోతుల్లోకో పరుగెట్టి. కాలాన్నీ మనుష్యుల్నీ దిగ్భ్రాంతుల్ని చెయ్యటం దాని లక్షణం. దురదృష్టవశాత్తూ విమర్శకులని పిలువబడేవారు యీచైతన్యాన్ని పసిబిడ్డ లోకానికి చెప్పేటప్పుడు తప్ప, సర్వదా కవులు, గాయకులు, శిల్పులు, నటులు వారియొక్క వేదన బాధలూ, గాథలూ అన్నీ స్మృతిపథంలో అట్టడుగుకే జారుకుంటాయి. ఈ వేదనాకలశాన్ని యెత్తిపట్టే కార్యక్రమం నెత్తినవేసుకున్న విమర్శకులు రచయిత శిల్పి గాయకుడు చిత్రకారుని కన్నా వున్నతస్థానంలో బైఠాయించి కళను నీతి రాజకీయాల తప్పుడు యీకపురాళ్ళతో కొలిచి విలువలు నిర్ణయిస్తూంటారు. నిర్ప్రాణమైన ఈ జగతికి చక్కలిగింతలు యెవరుపెడ్తారు? స్థాణువులై, అచలమై, పాషాణ సదృశంగా మలచుకొంటున్న ఈ వర్తమాన సామాజికజీవితంమీద అమృతధారలు యెక్కడ్నుంచి కురుస్తాయి? మానవత్వంమీద ఆశలూ,

కలలూ చెరిగిపోకుండా స్థైర్యాన్ని, ధైర్యాన్ని లోకానికి ఎవరు ప్రసాదిస్తారు? కట్టుబట్టకోసం, తిండికోసం, పంచకోసం దేవులాడే అధికహీనవకోటి దైన్యాన్ని దుఃఖాల్నీ, వ్యథల్నీ తమలో పలికించు కుంటూ సత్యాన్వేషణలో సౌందర్యార్చనలో జీవితాల్ని బలిచేసే కళా రాధకులు తమగురించి తాము యేమని చెప్పుకుంటారో యెప్పుడన్నా విన్నారా?—

మీనాక్షీ తాజమహలును చూసి యిల్లా వ్రాసింది—

'ఏయుగంలో శిల్పులు యింతమహత్తరమైన ప్రేమకానుకను షాజహానుచక్రవర్తి తనప్రియ ముంతాజ్‌బేగం మురిపాన్ని చెల్లించడానికి నిర్మించారో ఆప్రణయగాథ నా కప్రస్తుతమనిపిస్తూనే వుంటుంది. అచలవ జాళ్ళను చెక్కుతున్నప్పుడు ఈమహాభవనానికి రూపురేఖలు మలుస్తు న్నప్పుడు ఆశిల్పులు షాజహాను హృదయవేదననుగాని ముంతాజ్‌బేగం రూపురేఖలు లావణ్యాదుల్నిగాని ఆకళింపుకుని ఆవేశాన్ని పొంది వుంటారని నేను నమ్మలేకుండావున్నాను. ఈ భవనానికి రాళ్ళుమోసిన నీళ్ళుతోడిన గొప్పుతవ్విన బానిసలు, కూలీలు సొమ్ములు బట్వాడాచేసిన ఖజాంచీలు, లెక్కలువ్రాసిన గుమాస్తాలు యెందరో వుండివుంటారు. ఆశిల్పులు ఎండనక, వాననక, పగలనక, రాత్రనక సంసారాలు కుటుం బాలు జీవితమూ లక్ష్యంచేయకుండా ఆ ఆకారాన్ని మలచటంలో ఆశబ్దంలోని ఆవేశాన్ని వుత్సాహాన్ని అందులో రూపొందించి తదాత్మ్యం చెందారు. ఫలితం? యమునానదీతీరం - చరిత్ర చేసుకున్న పుణ్యంగా వారసత్వంగా వారి వేదనాఫలితమైన సమిష్టిసుందరరూపం మనకు యిచ్చిపోయారు. ఆ ఇంజనీర్లూ, ఆ శిల్పులూ యీనాటిచరిత్రకారుల్ని తమతమ జీవితపులోతుల్ని చూడమని అడక్కుండానే శలవుదీసు కున్నారు. మనంమాత్రం షాజహానుప్రేమకు కృతజ్ఞతలు చెప్పుకుంటూ మురుస్తున్నాం. కాని ఆ అనేకానేక నిరర్థక నిర్జీవ ప్రాణికోటియొక్క అద్వితీయమైన శక్తిస్వరూపాన్ని తరతరాలకు చూపిస్తూ తప్పుడు తూకపు రాళ్ళనుమాత్రం దాచుకుంటున్నాం.'

ఫ్రాంసునుంచి మీనాక్షి యింకా యిలాగ వ్రాసింది—

'అభిరుచులు అందరిలోనూ వుంటాయి. ఈఅందరిలోనున్నవీ కొందరిలోంచి చాలాసహజంగా, స్పష్టంగా, బలంగా వ్యక్తంకావట మనేదే వొక కళ. అందుచేత ఆర్టిస్టుకి వ్యక్తిత్వమనేది చాలాముఖ్యం. అతనిప్రవృత్తులూ, అభిరుచులూ, శక్తీ, మనస్సు యేటువైపు కేంద్రీకరింపబడితే ఆరంగంలో కృషికి సాధనచేస్తాడు. కొంతమంది నాన్నలాగ అన్నింటిలోనూ విజృంభించాలని చూస్తారు. పాటలు, బొమ్మలు, ఎంకిపాటలు, నాటకాలు, హరికథ, సంగీతం అన్నీవచ్చు నాన్నకు. ఎప్పుడైనాసరే వొకటికిమించి అనేకరంగాల్లో పాకినప్పుడు ఒకదానికి పోషణజరుగుతూంటే రెండవది శుష్కించిపోతూండటం సామాన్యం. తన వాంఛల్నీ, కలల్నీ, అభిరుచుల్నీ, శక్తుల్నీ వ్యక్తంచేసేందుకు సరియైనమార్గాన్ని వెతుక్కోవటం ఆర్టిస్టు ప్రప్రథమ కర్తవ్యంగనుక—

నేను వరహాలుతో లేచిపోయొచ్చేశాను !
ఉత్తుత్తిపెళ్ళి అయిపోయింది !
చీరలేదు - సారెలేదు.
బాజాలులేవు ! భజంత్రీలులేరు !

రైల్లో మనవూరునుంచి ఆగ్రా చేరుకునేలోగా అన్నీ జరిగిపోయాయి. నువ్వేంచేస్తావ్ ? అమ్మేంచేస్తుంది, పాపం !

చిన్నప్పట్నుంచీ నాకో తీరని దాహంవుంది. నేనెవర్ని? నేనెందు కోసం పుట్టాను ? నాకేంకావాలి ? - నాలో ఏదోశక్తి దాగొనుంది. దాన్ని ఎలాగైనా వెతికి పట్టుకోవాలి. అక్షరజ్ఞానంమాత్రమే కల్గించే చదువుతో నాపిపాస యెప్పటికి చల్లారను ?

నాన్నా ! నువ్వు బీదవాడివని, నాకు పెళ్ళిచేయలేవని, నీమీద అమ్మమీద కోపంవచ్చి నేనిల్లా చేశాననుకోవద్దు.

నాకు గొప్ప శిల్పినవుదామని వుంది ?
గొప్ప శిల్పానికిగాని కళకుగాని యేమిటిప్రత్యేకత ?

ఆర్టిస్టుకి లోకంమీద సృష్టిపట్ల వొక విభిన్నమైన, చిత్రమైన దృక్పథం వుంటుందనీ, ఆ కళాసృష్టి అసాధారణంగా చూస్తుందనీ చిత్రమైన అనుభూతుల్ని కలిగిస్తుందనీ అంతా వప్పుకుంటారుగదా! అయితే గొప్పకళాఖండమనిపించుకునేదానిలో సుషుప్తంగా వుండి బాహ్యేంద్రియాల కతీతంగావుంటూ అరుదుగా మెరుపుమెరిసినట్లనిపించే కళాసృష్టి స్రష్టయొక్క భావుకతకు అద్వితీయమైన చిహ్నంగా మిగిలిపోవటం మనం చూస్తున్నాం. ఇల్లాంటప్పుడు కళను ఎంచటమెల్లాగ? మనుష్యుడు ఆదికాలంనాడు చలనంలేని రాతిలో, కర్రలో, కుండపెంకుల్లో, మట్టిలో ఆగి చస జీవితానికి సంబంధించిన క్షణాలను, భావాలను, ఆకారాలను స్థిరమైన రీతిలో, తాపీగా, అనేకమూర్తులుగా మలిచి తన్ను తాను చూసుకుంటూ తృప్తిచెందాడు. అప్పటి జీవితంలోని స్థిరత్వం రానురాను క్షీణించిపోయి శిల్పాకృతుల్లోకూడా యీనాటికీ 'వేగం కదలికలూ' యివే ముఖ్యంగా ప్రతిబింబిస్తున్నాయి. పరుగెత్తే మన జీవితాల్లో వేగమే మన నాగరికతగా మారిపోయింది. అదే మనకళల్లోనూ ప్రతిఫలిస్తోంది. మూడేళ్లు కూర్చుని యెవరూ బొమ్మ వ్రాయటంలేదు. ఒక పరిమితమైనకాలంలో అపరిమితమైన దాహాన్ని చల్లార్చుకుందుకు మన కళాకారులు వురకలు వేస్తూంటారు. ఆగ్రానుంచి ఢిల్లీ వెళ్ళాము. అక్కడ భద్రిగారని ఒక తెలుగుఆర్టిస్టు వున్నారు. ఆయనపేరే నేనెప్పుడూ వినలేదు. ప్రభుత్వం ఆయనచేత బొమ్మల్ని వ్రాయిస్తూంది. పూసా యిన్‌స్టిట్యూట్ లోకా దోలు మొదట్లోవుండేవారట. ఇప్పుడు ఇన్‌ఫర్మేషన్ బ్రాడ్‌కాస్టింగ్ శాఖలో ఆర్టిస్టుగా వుంటున్నారట. కోడిగుడ్డుసొనతో ఏదో రంగులుకలిపి కాన్వాసుమీద పెద్దపెద్ద బొమ్మలేవ్రాశారు. రిపబ్లిక్ డే, సంతబజారు, అలంకరణ, కాందిశీకులు యీ కాన్వాసులన్నీ బాగున్నాయి. యాత్రాస్థలాల పోస్టర్లుకూడా చూపించారు. ఈ సబ్జెక్టు ఆర్డరొచ్చినకూడా భద్రిగారి వ్యక్తిత్వం గింజుకోవటం నేను గమనించాను. పంచవర్ష ప్రణాళిక. మద్యనిషేధం, రైల్వేయాత్రాస్థలాల పోస్టర్లు. వీటిమధ్యలోగూడా ఆయన తన స్వాభిప్రాయాల్ని, వాస్తవికతనూ

పోగొట్టుకోలేదు. సృజనాత్మకమైన కళని కేవలం ప్రచారసాధనంగా వాడుకోవటంలో, పారిశ్రామికనాగరికత ప్రసాదిస్తున్న అశాంతి ఆందో ళనలు కళారాధకుడి క్కావలసిన విశ్రాంతి, స్వేచ్ఛ - యీరెంటినీ దొంగలాడేస్తున్నాయి. మీరంతా యేసాంప్రదాయాన్ని ముఖ్యంగా ఆరా ధిస్తున్నారు అని అడిగా - భద్రిగారు నవ్వారు. ఓరియంటలు, ఇంప్రెష నిజమూ, క్యూబిజమూ, పోహాటేమిటి వర్తమాన కాలంలో అన్నిరకాల కలగలుపూ - యిదమిద్ధమని విడదీయటానికి వీలులేకుండా ఎవరి వొర వడిలో వాళ్ళు చిత్రాలుగీస్తున్నారన్నారు. ప్రమోదకుమార్, నందాలాల్ బోస్, దేవీప్రసాద్‌రాయ్ చౌదరీ, దామెర్ల రామారావు, బాపిరాజు అందరి రీతులూ మార్గాలు తర్కించుకుంటూ చర్చించుకున్నాం. ఈతరంలో యిక మంచిచిత్రాలు వచ్చే ఆశయేమీలేదు. కొద్దిమంది ఆర్టిస్టుల్ని చూస్తున్నాం - వాళ్ళు ఎప్పుడూ సరస్వతి, చంద్రోదయం, శివుడితలకాయ. బుద్ధుడి చెవులూ, వినాయకుడూ, కాళికాదేవి, లక్ష్మి, యివీ ఏ బెంగాలీ చిత్రాన్నో అనుకరిస్తూ గీసుకుంటూ పోతున్నారు. కాకపోతే అజంతాకు నకళ్ళువేసుకుంటూ పోతారు. ఈమార్గాల్నిగాని యీ ఆకృతుల్నిగాని వర్జించమని చెప్పటంలేదు. ఒకప్పుడు మతము పురాణాలు మన కళల్ని అధివసం చేసుకున్నాయి. ఆప్రభావం సృజనాత్మకశక్తిని వ్యక్తిత్వాన్ని లేకుండాచేసి కేవలం కాపీకొట్టడంపక్కిలోకి వచ్చేసింది మన బ్రతుకు. ఒకవైపున దేవుళ్ళబొమ్మలు గీసేవాళ్ళు రెండోవైపున ప్రచారసాధనంగా ప్రభుత్వం వాడుకుంటున్న ఆశ్రయజీవులూ పీరేకాకుండా మూడోతరగతి వొకటుంది. సిటిరంగులు ముద్దలుముద్దలుగా పట్టించి కోవాబిళ్ళ ముఖాలూ, వుల్లిపొర కాగితపు చీరలూ, ఖద్దరుశరీరేఖలూ, పైజమ్మాదృష్టులూ అట్ట మీద పత్రికలకు ముఖాలు రాసి యిచ్చేవాళ్ళు. ఈ తండా చిత్రకారులు తెలుగుదేశంలోనేకాదు, భారతదేశమంతటా అంటువ్యాధిలాగా ప్రాకి పోతున్నారు. చలి, వల, అరక, బరువు బొమ్మలుగీసి పొట్టగడుపు కొంటున్నారు. ఈ సంవత్సరంలో వినిసెంట్ వాంగో, పాలుగాగిన్‌ల గురించి కొంచెం ప్రస్తావిస్తాను. ఈ వరహాలు అనే డబ్బుగలమృగం నాకు యెంతో సహాయకారిగా వుంటున్నది. నేనిక్కడ యింతా పరికి

జీలు, చీరలు, లంగాలు, రవికలు తొడుక్కుంటూ తలకాయవంచుకుని నేలచూపులుచూస్తూ వుంటున్నాననుకోవద్దు. ఇప్పుడు గౌనులు వేసుకుంటున్నాను. నాజుట్టంతా కత్తిరించుకుని బాబ్డ్ హైర్ వుంచుకున్నాను. నన్నేమో ఎంతో పెద్దదాన్నయిపోయినట్లు లోకానికంతా బరువైపోయి పురిటిమంచం ఎక్కడమే తరవాయిగా చూసే మన వూళ్ళోంచి పైబపడి యిక్కడ పారిస్ వచ్చాక అంతా ఎంతో పసిదాన్ననే ముద్దుతోనూ, గారంతోనూ చూస్తూంటే - జీవితమంతా చిన్నపిల్లలాగే అన్వేషణలో గడిపెయ్యాలనుంది. స్కూల్లో చేరాను. ఫ్రెంచి నేర్చుకుంటున్నాను.

ఇర్వింగ్‌స్టోన్ అనే రచయిత వాన్‌గో జీవితమంతా శోధించి, మధించి లస్ట్ ఫర్ లైఫ్' అనే నవల రాశాడు. అది నేను చదవలేదు కాని సినీమా చూశాను, కర్క్ డగ్లస్ అనే నటకుడు వాన్‌గోపాత్ర నభినయించాడు. ఎవరో మేనత్తకూతుర్ని మోహిస్తాడు. అల్లరైతే పశ్చాత్తాపంకోసంకాబోలు దీపంమీద చేయి కాల్చేసుకుంటాడు. మతప్రవక్తల్ని దుయ్యబడ్తాడు. బొగ్గులగనిలోకిపోయి వ్యథాపీడిత గ్రామికదీనజీవనులతో కలిసిపోయి వీళ్ళకా దైవమహిమ అమానుషశక్తిలీలలూ బోధించటమని మతప్రవక్తలమీద విరుచుకుపడలాడు. గడ్డిలో, తాళ్ళలో యిరుకు పంచల్లో తలదాచుకుని భయంకరమైన వారిజీవితాల్లోంచి బొమ్మల్ని గీస్తాడు. ఎంత ఆవేశం! ఎంత కసి? ఎంత వేగం - ఎటువంటి అరాచకం ఆ బొమ్మలు అభివ్యక్తీకరిస్తాయో చెప్పలేను. ఇంప్రెషనిస్టు సాంప్రదాయం తలెత్తుతున్నరోజులవి. పాల్‌గాగిన్ వాన్‌గోలు ఒకే గదిలో మకాం పెడ్తారు. వాళ్ళబొమ్మలకు ప్రచారంకోసం మార్కెట్లు దొరక్క హోటల్లో వ్రేలాడగడ్తారు. నాబొమ్మ ముందు పెట్టాలంటే నాబొమ్మ అని జెలసీతో తగూలాడుకుంటారు. అక్కడ హోటల్లో ఒకస్త్రీ వాన్‌గోజీవితంలో ప్రవేశించి అతడి కళాభ్యాసనకు పెద్ద అడ్డంకిగా తయారవుతుంది. మొగుడూపెళ్ళాలు కీచులాడుకుని విడిపోతారు. మళ్ళీ యింటికొస్తాడు. అక్కడనుంచి యాత్ర - టోపీలో కొవ్వొత్తిపెట్టుకుని

చీకట్లో, వానలో, వరదలో, గాలిలో కాన్వాసు ఎగిరిపోతున్నా రంగులు పడిపోతున్నా లక్ష్యపెట్టకుండా బొమ్మల్ని గీస్తాడు దీక్షతో. ఇక్కడే యితడికి స్మృతి తప్పి మూర్ఛలు కాబోలు వస్తాయి. వాన్‌గో పాల్ గాగిన్‌లు తగూలాడుకుని విడిపోతారు. ఆవియోగం భరించలేక వాన్‌గో మంగలికత్తితో ముఖం చేతులూ, బుజాలు పీసుక్కుని రక్తసిక్తమై పడిపోతాడు. ఈవ్యక్తి జీవితాంతమూ అతడ్ని గాఢంగా అభిమానించి ప్రేమించే సోదరుడున్నాడు. ఆబొమ్మలన్నీ చూపించారు సినిమాలో. నేనూ అల్లా అయిపోతానేమో నాన్నా! నువ్వు, మీరా అందరూ వాన్‌గో లయిపోదాం! రంగులూ, కుంచెలూ, కాన్వాసులూ పట్టుకుని గ్రామాలూ పల్లెలు, పట్టణాలు, నదులూ, కొండలూదాటి పర్యటనచేద్దాం. ఏమితింటు న్నామో యేమికట్టుకుంటున్నామో యెవరు చూసొచ్చారు? స్వేచ్ఛగా విధీవిరామంలేకుండా రాసుకుంటూ పోదాం. వరహాలులాటి డబ్బుగల మృగాల్ని వేటాడాలి.'

ఆరోజు కృష్ణమూర్తిగారి ప్రయాణం ఆగిపోయింది. సూర్యనారాయణ మంచాన పడ్డాడు. నేషనల్ ఫొటోస్టూడియో భారమంతా శ్రీహరి నెత్తిమీద పడింది. ప్లేటులు కడగటం, కాపీలు ప్రింటులు తయారుచేసి డబ్బుకోసం యిళ్ళచుట్టూ తిరగటం యీవుద్యోగమంతా శ్రీహరి చూసు కుంటున్నాడు. ప్రసాద్ నాటకం పుచ్చుకుని ఎవరో అచ్చువేస్తారంటే బెజవాడ వెళ్లాడు. శాస్త్రి లోకవ్యవహారాలన్నీ ముట్టడిస్తున్నాడు. మస్తాన్ యీముతాకు చేబదుళ్లు యిస్తున్నాడు. అరవింద వండినపూట వండు తున్నది, లేనిపూట లేదు. వంటచేసేటప్పుడుకూడా అన్నం చిమిడిపోవ టమో, మాడిపోవటమో, వుప్పు వెయ్యకపోవటమో ఎక్కువగా పడి పోవటమో జరుగుతూండేది.

సూర్యనారాయణ - 'ఎల్లా తినడం? యిల్లా తగులబెట్టావ్ అన్నీ.'

అరవింద - 'ఫ్రాంసు వెళ్ళండి. కూతురు చక్కగా అవిర్చి పెడ్తుందన్నీ.'

'నీకు మతిపోతున్నదాయేం?'

'అవును. నామతే పోవాలి ? మీరేమి నవమాసాలు మోసారా ? కన్నారా ? కడుపులో చిచ్చుబెట్టి అది వెళ్ళిపోతే పులుసులో వుప్పు తక్కువయిందని గింజుకొంటున్నారు మీరు-'

'పోనీ నువ్వుకూడా వెళ్తావా యేం ?'

'నేనెందుకు ? యిప్పుడక్కడకు వెళ్తే జుట్టు కత్తిరించుకో మంటుందో, లాగూలూ, గౌనులూ వేసుకోమంటుందో అది.'

'నేనున్నాగా-'

'మీరెందుకు ? మీరుండగానే యింతకథ జరిగాక-'

'నేనేంచేశాను ?'

'అయ్యో ! పాపిష్టిదాన్ని అన్నంముందు కూర్చోబెట్టి యేడిపించాను.'

సూర్యనారాయణ యేడుస్తూ విస్తరిముందునుంచి లేచిపోయాడు. అరవిందవచ్చి అంటచేత్తో 'యేవండీ మనబ్రతుకింతేనా ?' అని భర్తను పట్టుకుని వ్రేలాడింది. ఇద్దరూ కాస్సేపు అన్యోన్యంగా యేడిచాక - మళ్ళీ డైలాగు—

'పసిదాన్ని వాడేంచేస్తున్నాడోనండీ !'

'విన్నా మోహించాడుగా వొహప్పుడు....'

'నన్నన్నా యెత్తుకుపోయాడు కాదు. పీక వుత్తరించేసేదాన్ని చల్లగా.'

'నువ్వూనేనూ యెవరికాక్కావాలి ? జవసత్వాలు పోయాక-'

'ఏవిటండీ పిల్ల రాస్తుంది ?'

'స్కూల్లోచేరి శిల్పము నేర్చుకుంటున్నానంది.'

'దాని బొమ్మలపెట్టి మీరెప్పుడన్నా చూశారూ ?

'పద-పద-'

అరవింద భోషాణంలో దూరి ఒక చెక్కపెట్టె లాక్కువచ్చి బూజుదులిపి సూర్యనారాయణముందు పెట్టింది. అతను పదిలంగా తోవ

లకు చేతులుపోనిచ్చి సారెబొమ్మలూ, చందనపుబొమ్మలూ, లక్క పిడతలూ, పూసలు, పూలుదారాలు, గొలుసులూ, పతకాలూ, బొమ్మ రిళ్లూ, బాతులూ, పిట్టలూ అన్నీ వెలికిలాగాడు.

అరవింద ఆప్యాయంగా తుడిచి చాపమీద వాటిని వేరువేరుగా నిలబెడుతూ చూస్తోంది. గుడ్డల్లో చుట్టిన కొండపల్లి బొమ్మలూ. నెల్లూరు పింగాణీపాత్రలూ పోహాపేమిటి—

'ఇందులో పొక ప్రపంచాన్ని దాచిందేప్ అమ్మాయ్!'

'ఏవిలాభం, అది వెళ్ళిపోయాక దాని ప్రపంచాన్ని తెలుసు కుంటున్నారు.'

సూర్యనారాయణ బొమ్మరిల్లూ చిన్నచిన్న పాత్రసామాను పొయ్యి పెనం గరిటలూ అన్నీ వేరుగా సర్ది - 'ఇక్కడ పిల్లలమనస్సు తెలిసి పోతోంది. జీవితాన్ని ఎల్లా అనుకరిస్తారో వృత్తి అన్నమూ, పాయ సమూవండి, పుత్తి పెళ్ళిళ్ళు చేసి పాటలుపాడి—'

'అదేవిటి ఆ పేడబొమ్మ అల్లా విరిచేశారు?

'ఛ-ఛ-నేను విరవలేదే, దీన్ని అలాగే పెట్టెలోంచి తీశాను.'

'అబద్ధాలెందుకాడ్తారు? ఆపూలుఅట్టమీద కూర్చుంటున్నారు.'

ఆకోడిపుంజు అట్టమీద 'మీనాక్షి' అనే అక్షరాలు యింగ్లీషులో కుట్టివున్నాయి.

అరవింద అట్టను లాక్కుని పెట్టెలో దాచేస్తూ - 'దీనికి పటం కట్టించుకుంటాను అరణాలిమ్మని యేడిస్తే దానిమాట విన్నారూ?'

'నన్నెప్పుడడిగింది? అడిగితే నేను లేదన్నానా-'

'పాపం! దానికి అడగటంతడవు అన్నీతెచ్చి వొళ్ళోపడేసే తండ్రిలా చెబ్తున్నారు.'

'ఐతే యీ బొమ్మలన్నీ యెవరు కొన్నారే-'

'మీకుతప్పినా నాకు తప్పుతుందా - వడ్లూ కొబ్బరికాయలూ కొట్లో యిచ్చి డబ్బులు తెచ్చుకుని అదే కొనుక్కుంది.'

'ఐతే మీరిద్దరూ దొంగతనంచేసేవారన్నమాట!'

'ఆ, మేవిద్దరమూ దొంగలమూ, మీరేమో దొరలు అచ్చంగా-'

'ఈ మట్టిముద్దలు యివేమిటే - ఏవో బొమ్మల్లాగున్నాయి.'

'అవునండీ - తలంటోసుకునేప్పుడు బంకమట్టితెచ్చి బొమ్మలుచేసి నీళ్ళహొయ్యిలో వేస్తూండేది. ఇది 'అమ్మా-నాన్నా-నేనూ' అని చెత్తే నేను కొట్టబోయేసరికి, ఎల్లాగూ నీళ్లోసుకుంటున్నదాన్ని లేచిరానుగదా అన్న ధైర్యంకొద్దీ యింకా అల్లానే కవ్విస్తూండేది. అది వాళ్ళ మాష్టారట - ఆమట్టిబొమ్మలన్నీ అది చేసినవే. మీలాగే మీకూతురున్నూ అదేం తక్కువ తిన్నదా?'

సావట్లో చిలక 'అక్కా-అక్కా-చుట్టాలొచ్చారు'అని అరుస్తోంది. వెనకాలే కృష్ణమూర్తిగారూ మీరావచ్చారు. మీరాఅడిగింది - 'ఇదేమిటిక్కడ యిల్లా పరుచుక్కూర్చున్నారు?'

సూర్యనారాయణ చెప్పాడు-'మాఅమ్మాయిబొమ్మలుపెట్టి మేవిద్దరం కాస్సేపు ఆడుకుంటున్నాము.'

అరవిందమంచంతెచ్చి వాల్చింది. కృష్ణమూర్తిగారు కూర్చున్నారు. మీరా జాకెట్టులోంచి తీసి 'యిదిగో వుత్తరంవచ్చింది' అని అందివ్వబోయింది.

'నువ్వేచదువు-వింటాము.'

'నాన్నా! నాబొమ్మలపెట్టి యెప్పుడన్నా తెరిచిచూస్తే నీకుఅందులో నా చిన్ననాటి ప్రపంచం అంతా కనుపిస్తుంది. ఆపెట్టి అట్టడుగులో రెండు పాటలపుస్తకాలున్నాయి. ఆమడతల్లో కొన్ని వుత్తరాలున్నాయి. అవి నాకు ప్రసాద్ రాసినవి. అవి చదివితే నేను నా బాల్యాన్నిదాటి యెన్నిమజిలీలు యెల్లా ప్రయాణంచేశానో....నువ్వు చొక్కాలు, పరికిణీలు కుట్టించియిస్తే అవి కట్టుకుని అట్లతదియకు వుయ్యాలలూగే బాల్యాన్నుంచి, బొమ్మరిళ్ళు ఆటపాటలనుంచి యీనాడు కళగురించీ బొమ్మలు సాంప్రదాయాలు యిన్నిసంగతుల్నిగూర్చి ఇంత ఆరిందాలా కబుర్లుచెప్తున్న నన్ను కొంతవరకేనా గుర్తుపట్టకలుగుతావని నమ్ముతున్నాను. ఇంకా

నారాతలు మీకు ఆశ్చర్యాన్నికలిగిస్తే - మావయ్య (శాస్త్రి)ను పిలిచి నాగురించి అడగండి.'

సూర్యనారాయణ 'ఆవు, యిందులో వుత్తరాలేవో వున్నాయంటున్నది పిల్ల. అవేవీ చూడనీ.'

అరవింద ముందస్తుగా పెట్టెలోంచి పాటలపుస్తకం లాక్కొని దాచేస్తూ - 'ఇవి పదిమందిలోనూ చదివేస్తారా-' అని యువ్వవానికి మొరాయించింది.

'నీతలకాయ-' అని సూర్యనారాయణ లాక్కొని మీరాకిచ్చి చదవమన్నాడు.

'మీనాక్షికి ముద్దులు!' మీరామొహం ఎర్రగా కందిపోయింది.

'చదువు! చదువు!' అన్నాడు సూర్యనారాయణ.

అరవింద కోపంగా -

'నీకుసిగ్గేమిటే....'

మీరా తరువాత యిల్లా చదివింది —

'మీయింటికేవచ్చి నీచేత పాడించుకుని విందామనుకున్నానుగాని- మీఅమ్మ జుట్టుపుచ్చుకుని తంతుందేమోనని హడలు వోపక్క.'

అరవింద అడ్డువస్తూ - 'ఆముక్క అందులోవుందా? వాడెవడసలు ...'

సూర్యనారాయణ - 'నువ్వూరుకోవే, చదవనీ....'

'మధ్యాహ్నం నువ్వు టిఫెన్‌కారీర్‌లో అన్నంతినడానికి స్టూడియోకి వస్తావా - అప్పుడు అక్కడ స్టూడియోలో మీనాన్న ఫొటోలు తీయించుకునేవాళ్ళకోసం వంకీనవుంచిన కోటుజేబులో చూస్తూండు. అందులో నీకు రోజూ వుత్తరం వుంచుతాను. మళ్ళీ జవాబురాసి అందులో పడెయ్యి. మీఅమ్మ భోంచేశాక నిద్రపోతుంది. మళ్ళీ ఎన్నిగంటలకు లేస్తుందో మీలు చూసుకుని స్టూడియోకొచ్చెయ్యి. అక్కడ మనిద్దరమూ పాడుకోవచ్చు. మస్తానుకి మనిద్దరమంటే చాలా యిష్టం. మీనాన్న ఒక

వేళ వచ్చినా యేమీ అనరు. రాత్రిళ్లు మీనాన్న స్టూడియోలోనే వుంటారు. మీఅమ్మ పడుకున్నాక—'

'వెధవచచ్చినాడా! - నేనస్తమానూ నిద్రపోయితగులడతానని యీపీనుక్కెవరు చెప్పారు?' అరవింద తిడ్తోంది అక్కసు తీరేలా.

కృష్ణమూర్తిగారు ఆవుత్తరాలకట్ట లాక్కుని అరవిందకిస్తూ 'ఆఅమ్మాయివుత్తరం చదువు, ఆనక ఎవరికివారే ప్రత్యేకంగా అన్ని వుత్తరాలూ చదువుకోండి.'

మీరా తిరిగి ప్రారంభించింది—

'నాన్నకెప్పుడూ మేం దొరకలేదుగాని, మావయ్య వోరోజు మధ్యాహ్నం హఠాత్తుగావచ్చి మమ్మల్ని పట్టుకున్నాడు. మేమేం తప్పు పని చెయ్యటంలేదనీ యింకా ఏమేమో వాదించాము యిద్దరమున్నూ. ఐతే నేనూవస్తాను. రోజూ మధ్యాహ్నమని హెచ్చరించివెళ్ళాడు. సరే నన్నాము. అప్పట్నుంచీ చాలాకాలం మేంముగ్గురమూ మధ్యాహ్నం స్టూడియోలోనో ఎక్కడికన్నా షికారువెళ్ళో, ప్రసాద్‌గదిలోనో కలుసుకుని అనేకవిషయాలు మాట్లాడుకునేవాళ్ళము. కొంచెంసేపు పాడుకునేవాళ్ళము. ఇక్కడ మావయ్య నాకు అనేకసంగతులు నూరిపోశాడు. కాని మావయ్యకుతెలీకుండా అర్ధరాత్రి నేను యింట్లోంచి వచ్చేస్తే ప్రసాదూ, నేనూ చాలాదూరం కబుర్లుచెప్పుకుంటూ తిరిగితిరిగి వచ్చేవాళ్ళం. ఇదీ పట్టేసుకున్నాడు మావయ్య, ఆరోజు నన్ను తోటలో కాలువమళుపు దగ్గరకు తీసుకెళ్ళి బాతిమీద కూర్చోబెట్టి బుజ్జగించి బ్రతిమాలి అల్లా రాత్రిళ్లు తిరగనని వొట్టేయించుకున్నాడు. నేను యింతా గొప్పగొప్పపనులు చేయాలనీ యింతతొందరగా ప్రేమలోపడ్డంలాటిది పురిటిమంచానికీ, వంటింటికీ దారితీస్తుందని హెచ్చరించి నాకు పాటల పుస్తకాలు, కథలూ యిచ్చి చదవటం, తర్కించటం అన్నీ నేర్పాడు. మమ్మల్నిద్దర్నీ దగ్గరకూర్చోబెట్టుకుని మాచేత పాటలుపాడించటం మీరంతా యెరుగున్నదే. ఇదిగాకుండా ఆయన నాకొక క్రొత్తలోకాన్ని తెరిచి అందులో విహరించేలా నన్ను ప్రోత్సాహపరిచాడు, అప్పుడు నాకు తెలిసీతెలియనట్లుండే కళాప్రపంచం యిప్పుడు సంపూర్ణంగా నన్ను

ఆలోకంలో మునిగిపోయేలాచేసింది. వరహాలు సరిగా యిటువంటి మధ్యేమార్గంలో తారసిల్లి శాస్త్రిగారు నాలో పెరిగించిన జ్యోతిని ఆజ్యం పోసి జాజ్జ్వల్యంగా ప్రజ్వరిల్లేందుకు సహాయపడ్డారు. శరద్బాబు చెప్పినట్లు వొత్తిని యెగసన్రోసేందుకు సహాయపడే పూచికపుల్లలాగ వరహాలు నాకు తటస్థపడ్డారు. అలాటికి నాసుంచిపుట్టిన ప్రతిఫలం యేమంత తక్కువకాదనుకోండి! ఇదీ మా కథ—

'ఇక్కడ స్కూల్లోనే చాలాకాలం గడిచిపోతోంది. సీసంతోనూ కాంస్యంతోనూ రాగితోనూ పోతపోసిన మూర్తులు ఆధారంగా చేసుకుని సుత్తి చిన్నచిన్న బాడిదలాటి పనిముట్లతో పుక్కని మలిచటం సీసమూ, తగరమూ పోతపోసినప్పుడు వేగంగా ఆకారాల్ని తీయటం యీపని చాలాకష్టం శ్రమయెక్కువగానూ వుంది. ప్లాస్ట్ ఆఫ్ పారిస్ మీద పనిచేయటానికి చలవరాతిని చెక్కడానికీ నేను వుత్సాహపడుతున్నకొద్దీ కంచువిగ్రహాల్ని మూర్తుల్ని చేయటం నేర్చుకోమని నన్ను బలవంతపెడ్తున్నారు. రాత్రిళ్లు చదవటం చర్చించుకోవటమున్నా, వుదయయమే లేచి తిన్నగా కర్మాగారంలోకి వెళ్ళినట్లు పోయి పనిలో దిగిపోవటం. ఆదివారాలు మాత్రం వరహాలుగదికి పోయొస్తున్నాను. ఇక్కడ కనీసం ఐదుసంవత్సరాలు వున్నాక నేను నా యీ యాత్రలో ఏమన్నాసాధించానా, నాకేమన్నా పట్టువడ్డదా అన్న గుండుకొమ్మల అనుమానం తీరుతుంది. మీరేమీ అనుకోకుండా వుంటే నా యిప్పటి దుస్తుల్లో తీసిన ఫొటో మీకు వేరే పోస్టులో పంపిస్తున్నాను. గుర్తుపట్టలేరేమో - మీ మీనాక్షి వేరు, యీ మీనాక్షి వేరు - దీన్ని మీరు స్వీకరించలేరేమో ననిపిస్తూంటుంది. ఈ ఐదుసంవత్సరాలు మహోగ్రమైన తపస్సు - సాధనా!' మీరా వుత్తరం చివరివాక్యాలు చదివేసి పూర్తి చేసింది.

శాస్త్రి ఫొటోఅప్యాకెట్టు పుచ్చుకుని వచ్చారు - 'ఇదుగోనండి, కథానాయికురాలు! ఎవరూ మాట్లాడరేం?'

సూర్యనారాయణ ఫొటోలు లాక్కుని చూశాడు.

ఒక పెద్ద పోతపోసిన విగ్రహంమీద అనేకమంది విద్యార్థులు ఆడామొగా చిన్నచిన్న వులి, బాడిశె, సుత్తులూ పుచ్చుకుని చెక్కుతున్నారు. ఆడవాళ్ళంతా మేజోళ్ల గౌనులు వేసుకుని జుట్టు మీదకు కట్టుకున్నారు తెల్లని గుడ్డల్తో.

'ఇంతమందిలో మీనాక్షిని నేనెక్కడపోల్చుకోగలను.'

'ఐతే యీ బొమ్మ చూడండి.'

అందులో మీనాక్షి వక్కర్తీ సీసంపోతపోసిన బస్టుమీద ముఖం ముడతల్ను వులితో తీరుస్తోంది. సైడుపోజు. చూస్తూచూస్తూ సూర్యనారాయణ కళ్ళలో నీళ్ళుతిరిగాయి. పెదవులమీదకు చిరునవ్వు వచ్చి తొంగిచూసింది.

'గర్వపడాలోయ్ అట్లాటి సాహసవంతురాల్ని కన్నందుకు.' శాస్త్రి అభినందనలు తెల్పుతూ - 'అక్కా, యీ పిల్లను చూడు. ఆ ఆరోగ్యం ఆ ధైర్యం ఆ కట్టూ జుట్టూ యెంతగా మారిపోయిందో.... ఒకప్పుడు సామాన్యులకడుపున జాతిరత్నాలు పుడలాయి. అవి మనింట్లో నాలుగ్గోడలమధ్యా దాచుకుని కొబ్బరిబోండాంతో యెవడో అప్రాచ్యుడి కాళ్లకడిగి దానమిచ్చేందుకు వొప్పుగోవు. ఇప్పుడైనా మీ బెంగలు తీరాయా! ఆ పెంకెతనం ఆ పట్టుదల అమ్మబాబోయ్! ఈ పిల్ల యెప్పుడో యిల్లాటి అఘాయిత్యం తలపెట్టిదే అనుకున్నా,'

మీరా ఆశ్చర్యంతో - 'ఎంత ముంగిలా నంగనాచిలా వుండే యీ పిల్ల యింత గుండెనిబ్బరంకల మనిషని నే ననుకోలేదు శాస్త్రిగారూ?'

'మరేపాపం! ఎంకిపాటలూ కప్పతల్లిపాటా పాడించుకుని ప్రసాదుప్రేమపాఠాలు వల్లించుకుంటో మనసావిట్లో వుండవలసిన మీనాక్షి యిల్లా రెక్కలుగట్టుకు సముద్రాల్ని, కొండల్ని, అడవుల్ని దాటి వరాసునగరంపోతే - వెర్రివాళ్ళలారా! యెందుకు గుండెలు బద్దలుచేసుకుని యేడుస్తారు? ఖామోష్! నాకేమో అంతా ఓ. కే!' అన్నాడు శాస్త్రి.

# 14

ప్రసాదునాటకం అచ్చయింది. అందులో మీరాకు సూర్యనారాయణకు ఆఖరికి మస్తానుకుకూడా రచయిత కృతజ్ఞతాభివందనాలు చెప్పుకున్నాడు. శాస్త్రి బంగాళాఖాతమంత వుపోద్ఘాతంరాశాడు. అది చూడ్డానికి రచయితను నాటకాన్ని మ్రింగేసేందుకు వేరేప్రయత్నంలాగుంది. ఆంధ్రదేశంలోని నాటకసంఘాలు వాటిఅవకతవకలు, కష్టనిష్ఠూరాలు చర్చించగా పోనుపోను చదివేవారికి ఒకవేళ యీ నాటకం యేకారణంచేతనైనా బాగులేదనితోస్తే ఆ అసమర్థత ప్రేక్షకుల పరంగానూ, నటకులపరంగానూ కొట్టుకుపోయే యేర్పాట్లు చేసి రాశాడు శాస్త్రి. మన అభిరుచులూ వాతావరణం దేశం, ప్రజలూ అందరూ అంతోయింతో మంచినాటకాలు రాకపోవడానికి బాధ్యులని మరీమరీ నొక్కిచెప్పాడు.

ప్రసాదు బిక్కమొహం వేశాడు.

'మిమ్మల్ని నాలుగుముక్కలు రాయమన్నానుగదా అని యింత యిలా చెరిగేస్తే - యిదే నా మొదటిపుస్తకంగదా - నేనెల్లా చావను ?'

'అదేనోయ్ డాషిన్ యిన్‌సల్టు ! నీకు రాబోయే అపకీర్తినంతా జాగ్రత్తగా ప్రక్కదార్లంబట జనంమీదకు తోసేశానుగదా, చివరికెల్లా గంటావు నువ్వు - ది సీజ్ బేస్ ఇన్‌గ్రాటిట్యూడు ! నీ కక్కర్లేకపోతే నా పీఠిక నా మొహాన పారెయ్యి ! నేను వేరే దాన్ని పెంచి పెద్దదిచేసి అచ్చువేయించుకుంటాను. తెలుగులో మంచినాటకాలు రాకపోవటానికి నీలాటి రచయితలూ, తలాతోకాలేని నాటసంఘాలూ కారణం అని ఘరాయించి వ్రాస్తాను. దాంతో మనం విమర్శకులమని బజాలూపుకోవచ్చు !'

'ఐతే నాటకంకన్నా మీ పీఠిక గొప్పదనాలనికాబోలు మీ అభిప్రాయం ?'

'నిస్సందేహంగా - కవి సమూహంలో వొకడుగనుక, సమూహానికి పట్టే అవకతవకలక్షణాలు కృతికికూడా పట్టవచ్చుగనుక, అది బాగోక

పోతే సమాజం బాగులేదన్నమాట. నా మాటవిని అడ్డదిడ్డప్రశ్నలు వెయ్యక....గుర్తుంచుకో....కాళిదాసేమన్నాడు? మందః కవి యశః ప్రార్థీ అని. 'మందుడనై నేను కవియొక్క యశంకొరకు ప్రార్థిస్తూవున్నాను' అని తాత్పర్యం. వినయం అలవర్చుకో....మాకేమి, మేము వ్యాఖ్యాతలం! విమర్శకులం! షేక్స్పియరు కాదు, మార్లో యెవడో నాటకాలు రాశాడని ప్రపంచాన్ని హడలగొట్టలే? ఇతి మల్లినాథసూరి వ్యాఖ్య! యెప్పుడన్నా విన్నావూ?'

'వావిళ్ళ రామశాస్త్రులు అండ్ సన్సు అనికూడా వుంటుంది గదండి.'

'మల్లినాథసూరి వావిళ్ళవారి ప్రెస్సులో పనిచేస్తున్నాడనుకొంటున్నావేమిటి? ఇహమరి అట్టే నాతో వాదించకు. వెళ్ళి నీపని నువ్వు చూసుకో, అచ్చవగానే ఒక డజను కాపీలు పట్టుకొచ్చి యిచ్చివెళ్లు.'

ప్రసాదు బెజవాడనుంచి వస్తూనే రిక్షాలో కాపీలు వడేయించుకుని నేరుగా నేషనల్ ఫోటోస్టూడియో గుమ్మంముందు దిగాడు.

'పంతులుగారూ, మిమ్మల్ని సూస్తూంటే నాకు యేపొస్తూంచండీ? ఏమి జంట? ఏమి కత?' అన్నాడు కుట్టుమిషనుదొగ ఆపుజేసి: మస్తాను.

ప్రసాదుగుండె ఝల్లుమంది. రిక్షావాడు పుస్తకాలకట్టల్ని దించుతున్నాడు.

'ఏమి కట్టలండీ?'

'మన నాటకం -'

'అమ్మబాబోయ్! అచ్చు యేసేసినారా?

'బెజవాడలో -'

'సినిమాతీపిస్తారా....'

తలఅడ్డంగా వూయించాడు.

'పంతులుగారూ! మీకు తెలీదు, రేపు మూడుమాసాల్లో యీపటం యెత్తేస్తారు. నిండా బద్మాషీచేస్తున్నారు. మీరు కనిపెట్టివుండాలా....'

'పైనెవరూ లేరా ?'

'రావటంలేదు. స్టూడియో పోగయా. మీనాక్షమ్మ ఫ్రాంసు వెళ్ళి పోయింది. అంపరి నిదుములిరిగిపోయినై ! మీకు తెలీదు –'

ప్రసాదు సరిగా వినకుండా మెట్లు యెక్కుతున్నాడు.

'మీరు పెద్ద ఆశలో వున్నారు. అంతా నాటకంఅయిపోయింది. సూర్యారాణా స్టూడియోకి రావటంలేదు. హరిబాబు మీసపుంటున్నాడు' ఫొటోల్ గిటోల్ యేపిస్తా. జమానా బదల్‌గయా ప్రసాద్‌బాబూ ! నిండా విచారంలో మునిగిపోయారు. మీరా మొగుడూ సువ్వెల్ కుర్ర దాన్ని లేపేస్కుపోయాడు. తక్‌దీర్ నీదీ ఖరాబ్‌ఖాయీ ! దేఖో.... అంధేరా ఖుల్‌గయా !'

చీకట్లో స్టూడియోతెరలు గింజుకొంటున్నాయి. నేలంతా గడుగ్గా దుమ్ముతో....మంచం వరండాలోకి యీడ్చుకొని శ్రీహరి నిద్రపోతు న్నాడు. తొట్టెలలో క్రోటన్స్‌మొక్కలు యెండిపోతున్నాయి. సిగరెట్టు బీడీపీకలు, తాగి కడగకుండా బోర్లించిపెట్టిన టీకప్పులు దారికడ్డంవస్తు న్నాయి. మస్తానుసహాయంతో పుస్తకాలకట్టల్ని మీదకు చేరవేశారు. లైటువేశాక పడగుంజితే శ్రీహరి లేచాడు.

'ఇదేమిటి స్టూడియోపనిచేయటంలేదా ? మనవాళ్ళంతా యేరి ? మీరా శాస్త్రీ సూర్యనారాయణా....'

'వ....చ్చా....వా ,' శ్రీహరి తెల్లబోతూ చూశాడు.

'వెధవనిద్ర అస్తమానూ నిద్రేనా? ముఖం కడుక్కురా – '

'ఎందుకూ అక్కర్లేదు. ఒక బేడ వుంటే యిల్లాపారెయ్. టీ త్రాగాలి. చిల్లరలేదూ పోనీ....'

'భోజనం చెయ్యలేదా....అదేవిటి ? సూర్యనారాయణకో మీరాకో కబురుచెయ్యకపోయావా ?'

'ఏమోహాంపెట్టుకుని – యివేమిటీ పుస్తకాలు ?'

'మన నాటకంపుస్తకాలు వచ్చాయి.'

'పోనీ సిగరెట్టయినాపారెయ్యి. నోరు చచ్చిపోయింది.'

ఇద్దరూ చెరోసిగరెట్టు ముట్టించుకున్నాక—

'హూర్చో - రోజులుమారాయి.'

శ్రీహరిప్రక్కన కూర్చుంటూప్రసాదు - 'ఏమిట్రా గొడవ - మీనాక్షి ప్రాంసు వెళ్ళిందంటాడు మస్తాను !'

'హా ! అదేరా ! - ఆ వరహాలుగాడితో అదికాస్తా లేచిపోయింది.'

'అదంటే....'

'నీ ప్రియురాలు....'

ప్రసాదు ఛెళ్ళుమనేలా చెంపమీదవేశాడు శ్రీహరిని.

'ఎందుకురా మధ్య నన్ను కొట్టావు అంతదెబ్బ ?

ప్రసాదు మాట్లాడకుండా మంచంమీదనుంచి లేచి - 'ప్రియురాలు అన్నందుకు ? - మీనాక్షి అంటే నీకంత తేలిగ్గావుందా ? - '

'నెత్తిమీదపెట్టుకు వూరేగు - నాకేం ?'

ప్రసాద్ఆగి - 'నిజంగా వెళ్ళిపోయిందంటావురా ?'

'గుండెల్ను చీల్చుకొని....'

'కవిత్వంవస్తోందే మీకందరికీ....'

'అది యేడుపుకి పర్యాయపదం కనుక - '

ఉస్సురంటూ కూలబడ్డాడు ప్రసాదు.-

'బెజవాడవెళ్లి నేనేంపావుకున్నా్రా ! కాఫీకి కరువువాచాను. ఆ బ్రాహ్మడు ఐదువందలిస్తాడుగదా అని చంకలుగుద్దుకొని నాటకంకాస్తా చేతులోపెట్టాను భాయీ ? ఐదువందలకాపిలిచ్చి సాగనంపాడు. రైలు కర్చులకి ఐదురూపాయలు వసూలుచేసేటప్పటికి తాతలు దిగొచ్చారు. ఇంకా వుండమన్నాడు. భోజనంపెడ్తాడట. పైకర్చుకి ఐదువదీ యిస్తాను పత్రిక చూడమన్నాడు. ఒళ్లు మండుకుపోయి లేచివచ్చేశాను. నోరు చించుకుంటే మీ నాటకాలు, కథలూ యెవరికి కావాలండీ ? డిటెక్టివ్ పుస్తకాలు 'జాకెట్లో రహస్యం' 'దెబ్బకుదెబ్బ' 'కిటికీలో పీనుగ' రాస్తావా అని అడిగాడు. లెంపలు వాయించుకున్నాను.'

శ్రీహరి చెప్పుగొచ్చాడు—

'నువ్వలా వెళ్లావా - యిక్కడ మనకి కుండలు డింకీలు కొడ్తున్నాయి. రైల్వేలో నాల్గోతరగతి ప్యూనో పోర్టరో వుద్యోగంకోసం దరఖాస్తు పట్టుకెళ్ళి యిచ్చాను - డభ్భైరూపాయలన్నా దొరకుతాయిగదా అని. ఫ్యాక్టరీలో కూలిపనికికూడా రెండొందలు లంచంయివ్వాలిరా. రేపు యింటర్వ్యూ. నువ్వు వస్తావుగదా రెండొందలు సాయంచెయ్యక పోతావా - యెంతచెడ్డా సుప్రసిద్ధ నటుడ్ని, యింటడుతప్పానే అనుకో.... తిండి లేదు, బీడీలకుకూడా డబ్బుల్లేకుండా యెంతకాలంరా ?'

'సారీ ! క్షమించరా శ్రీహరీ.........బదొందలపుస్తకాలున్నాయి. ఇవే రోజూ అరడజనో డజనో పట్టుకెళ్ళి స్టేషనుదగ్గరా, బస్సుస్టాండు దగ్గరా అమ్మి చూడు. ఇంకా స్కూళ్ళ స్టూడెంట్లని వాళ్ళని పట్టుకుని నెమ్మదిగా పుస్తకాలు చెల్లేటట్లు చూడు. నీకు సగం నాకు సగం. యీ డబ్బంతావస్తే యేడువందలు అవుతాయిరా !'

'రెండొందలు లేకుంటే రైల్వేవుద్యోగం దొరకదురా అబ్బీ !'

మర్నాడు స్టేషన్లో 'ఇచ్చట మిఠాయి తినుబండారపు వస్తువులు దొరకును - ' దగ్గర శ్రీహరి సంచీలో 'దాహం' కాపీలతో తచ్చాట్లాడుతున్నాడు. ప్లాట్ఫారంమీద కేకలుపెడ్తున్న అసామీ సాక్షాత్తు వేవుడిలాగున్నాడు - 'బాలనాగమ్మకథండీ ! గులేబకావళీ ! సతీపతి కుటూహల రసాహ్యలండీ ! బ్రహ్మానందం ! కవిచోదప్పశతకం ! వేమన పద్యాలండి ! లక్షణస్వామి నవ్వు ! ఊర్మిళాదేవి నిద్ర ! దాంపత్యమర్మాలు.... బ్రహ్మంగారి కాలజ్ఞానం ! పుస్తకాలు కావాలండీ ? నాటకాలు నవలలు పద్యాలు న్యూ సినీమా సాంగ్సు ! చాటుపద్య మణిమంజరి ! శశిరేఖా పరిణయం ! విజయవిలాసం ! పాకెట్ సైజు పంచాంగం....ఘంటల పంచాంగం....అంజనేయదండకం సూర్యనమస్కారాలు....స్త్రీల వ్రత కథలు....మదనకామరాజు కథలండీ....' శ్రీహరి వెంటబడ్డాడు. గొంతు కాస్త సరిచేసుకుని,....కాపీలు ఝళిపిస్తూ బెరుగ్గా-నాటకాలూ....నాటకాలు కావాలండీ !' కిటికీలోంచివూస్తూ యెవరో ముతకమనిషి కాపీలులాక్కుని తాపీగా చూస్తున్నాడు. శ్రీహరికి కాళ్లు లాగుతున్నాయి.

'వియ్యపురాలిపాటలం! భోజకాళిదాసు కథలండీ! భద్రాద్రి రామదాసుచరిత్రమండీ! మహాభక్తవిజయం!'

శ్రీహరి బెదురుతూ - 'కొంటారండీ - '

'ఎంత?'

'రూపాయిన్నర.'

'అక్కర్లేదు, పట్టిగెళ్ళు!

రైలు కదిలిపోతోంది. పాతపుస్తకాలవాడు ఏవో డజనుపుస్తకాలు అపీయిపీ అమ్మేశాడు. డబ్బులు లెక్కచూసుకుంటున్నాడు. క్రొత్త పుస్తకాలవాడు శ్రీహరి - 'ఇదిగో....'

పాతపుస్తకాలవాడు మాట వినిపించుగోవటంలేదు,

మూడుకోట్లమంది ఆంధ్రులు - యెవరూకొనరేం పుస్తకాలు!

డబ్బులు లెక్కచూసుగోవటం అయాక శ్రీహరి నెమ్మదిగా 'ఈ పుస్తకాలుకూడా అమ్మిపెడ్తావా?' అని అడిగాడు.

పాతపుస్తకాలవాడు కాపీలుచూసి - 'చెల్లవు. ఎవరూ కొనరు. అన్నాడు.

'బాబ్బాబు, ఎల్లాగైనా రక్షించు.' ప్రాధేయపడ్డాడు శ్రీహరి.

మూడు పుస్తకాలు తీసుకుని మూడర్ధలు చేతిలో పెట్టాడు.

'ఇదేమిటి? మూడుపుస్తకాలూ నాలుగున్నరకదా!'

'అంతే! యిపి అమ్ముడుపోకపోయినా నాదగ్గరే వుంటాయి. రేపు పోతే పట్టుకుపో!'

శ్రీహరి నీళ్ళు నమిలాడు - 'పుస్తకానికి రూపాయి కమీషను తీసుకుంటావా?'

వాడు నవ్వాడు. 'ముందస్తిగా డబ్బులు చేతిలో పెడితే అల్లాగే వుంటుందిలే.'

కాళ్ళీడ్చుకుంటూ వూళ్ళోకొచ్చి తను యెగిరిన కిల్లీదుకాణాల్లో ప్రేలాడకట్టమని తలో రెండూమూడూ కాపీలు ఒకడజనుదాకా పంచి

పెట్టాడు. చెరిసగంవాటా యిస్తామన్నాడు. మధ్యాహ్నమయ్యేవరకూ తిరిగితిరిగి 'నేషనల్ ఫొటోస్టూడియో' దగ్గరకొచ్చారు. పైన ఏవిటో హడావిడిగావుంది. శాస్త్రి, సూర్యానారాయణ ప్రసాదు హడావిడిగా గుండ గుండయి పిండిపిండయి శతమతమైపోతున్నారు. జేబులో రూపాయిన్నర తీసి ప్రసాదుకిచ్చి మూడుకాపీలు అమ్మానన్నాడు.

'చాల్లే సంతోషించాం తెలివికి ! ఆ కాపీలన్నీ అట్లానే పగ లెయ్యకు, మనం పుస్తకాలషాపు పెడ్తున్నాం !' అన్నాడు శాస్త్రి.

'నేషనల్ ఫొటోస్టూడియో' బోర్డు దింపేశారు. ఎలక్ట్రిక్ ఫిట్టింగులు లైట్లూ బల్బులు వూడలాగేశారు. ఫొటోలూ, చిత్రపటాలు తదితర సామాగ్రి తెరలు స్టాండులు భద్రంగా ప్యాకేటీపెట్లలో సర్దేస్తున్నారు.

'ఇవన్నీ యేంచేద్దామని.'

'అమ్మేస్తామోయ్.'

'అమ్మేసి - !'

'అమ్మేసి - !'

'పుస్తకాలవ్యాపారం పెడ్తామోయ్. నువ్వలా చూస్తూండు. బాగు పడ్డవాడ్నెవడ్నన్నా అడిగి చూడు ! వ్యాపారంకన్నా మంచిదేవిటుంది చెప్పు !'

'సూర్నారాయణగారూ ! ఇది చాలా ఘోరం ! మనం పరాజయం వొప్పుగుంటున్నామన్నమాట.'

'ప్లేటు ఫిరాయిస్తున్నామోయ్. ఈ అడ్వర్టయిజుమెంటు చూడు మచ్చుకి - ' ప్రకటన వ్రాతప్రతి తెచ్చి ముందుపారేశాడు శాస్త్రి.

'వీణాపబ్లికేషన్సు,' పో. బా. 329. తంతి. 'వీణా' టెలిఫోను నంబరు 48012. మీ కేవిధమైన అచ్చుపనులు కావలసివచ్చినను ఎంతసులు, శుభకార్యావసరాల్లో రాత్రింబగళ్లు హోరాహోరి పనిచేయు దుము. చక్కని పనితనము ! సరసమైన యేర్పాట్లు ! సినిమా, నాటకాల పోస్టర్లు, టిక్కెట్లు సకాలములో అచ్చువేసి యీగలవారము. ఇంకా —

ప్రపంచకర్తలకు రచయితలకు మహదావకాశము—త్వరలో పీణాపబ్లికేషన్స్ పుస్తకవిక్రయశాలలు హైదరాబాదు, మద్రాసు, విజయవాడల్లో యేర్పాటుచేయదోవుచున్నాము. తమతమ గ్రంథములను పీణా పబ్లికేషన్స్ద్వారా అమ్మగోరువారు మానేజరు, పో. బా. 329 కు వ్రాయవలెను.

షరా : వుత్తర ప్రత్యుత్తరములు ఆంగ్లములో వ్రాయవలెను.

మరొక ప్రకటన తయారుచేసినది చూపించాడు.

'మీకేవిధమైన నవలలు, నాటకములు, మతవైజ్ఞానిక రాజకీయ కావ్య సారస్వతాదిగ్రంథములు కావలసివచ్చినను మా క్యాటలాగుకోసం వ్రాయండి. పదిరూపాయలవరకూ పోస్టుఖర్చులు భరించి పంపుతాము.'

పీణాపబ్లికేషన్స్.

శ్రీహరి లబోదిబోమన్నాడు - 'మనకి ప్రెస్సేది? పుస్తకాలెవ రిస్తారు? డబ్బెక్కడ? కొంప గుండంచేసేస్తారు మీరు? ఇక్కడ సాహిత్యానికి సంబంధించినది పూచికపుల్లయినా లేకుండా యింత తతంగామా? శ్రీకృష్ణజన్మస్థానం చూపించేట్లున్నారు మీరంతా - నాకు అంతా అగమ్యగోచరంగావుంది.'

'బాగుపడ్డవాళ్ళంతా యిల్లాగే బాగుపడ్డున్నారోయ్. ఇంకాస్త గట్టిగా మూలిగావంటే తన్నులు తినాలిసొస్తుంది.'

'నువ్వూ ప్రసాదూ కత్తుల్లాటి కుర్రాళ్లు. కిక్కురుమనకుండా చెప్పినపనులు చేసేస్తూండండి. టౌన్‌హాల్లో రేపు ఆదివారం అత్యవసర మహాసభ! వూళ్ళో పదిమంది పెద్దల్నీ, కవుల్నీ రచయితల్నీ ఆహ్వానిస్తున్నాం. సైకిలుమీద యిల్లిల్లూ, గడవగడపా చుట్టబెట్టుకురావాలి. ఇంక మూడ్నెల్లవరకూ విరాళాలు ప్రోగుచెయ్యాలి తెలిసిందా?'

ఆదివారం వచ్చింది. నేషనల్ ఫొటోస్టూడియో బోర్డు దిగిపోయింది. తత్‌స్థానే 'పీణాపబ్లికేషన్స్' బోర్డు అలంకరించింది. టెలిఫోను గణగణా మ్రోగుతూనేవుంది.

టౌనుహాలు తోరణాల్తో కొబ్బరిమట్టలూ, అరటిమొక్కలతో దివ్యంగా అలంకరించారు. పుర ప్రముఖులూ, విద్యార్థులూ, అధ్యాపకులూ, నాటకసంఘాలు, సంగీతసభలవారూ అంతా వచ్చారు.

టీపార్టీ సరంజామా కంట్రాక్టు 'హోటలుశకుంతలా' కిచ్చారు. మధ్యాహ్నం మూడున్నరనుంచి ఐదుగంటలవరకూ టీపార్టీ దేకింది. పార్టీజరుగుతూన్నంతసేపూ మైకులో లలితసంగీతం యెవరెవరో వచ్చి పాడుతున్నారు. ఎవరో కాలేజీకుర్రవాడు వచ్చి 'మిమికరీ' చేసి ప్రేక్షకుల్ని ఆనందపర్చాడు. టంచన్‌గా ఆరుగంటలకి సభ ప్రారంభమయింది. టౌనుహాలుగోడలకు వీరేశలింగం, గురజాడ, చెళ్ళపిళ్ళ, ప్రకాశం, శ్రీరాములు పటాలు తగిలించారు.

శాస్త్రిగొంతు జలదగంభీరస్వనంలో మార్మోగింది—

ఆంధ్రమహాజనులారా! మేధాశ్రమజీవులైన రచయితల కష్టనిష్ఠూరాలు, సమస్యలు చర్చించేందుకు, పరిష్కరించేందుకు కించిజ్ఞులమైన మేము యీపట్టణంలో తలపెట్టిన ఒకమహోద్యమానికి యింతమంది పిన్నలూ, పెద్దలూ, స్త్రీలూ, పురుషులూ రావటం గొప్పసంతోషాన్ని కలిగిస్తోంది. మీకందరికీ సుస్వాగతం! (అవిరామం చప్పట్లు-)

'పీణాపబ్లికేషన్స్' అనే సంస్థకు యిప్పుడు యిక్కడ మనమంతా చేరి ప్రారంభోత్సవం చేసుకుంటున్నాం. కేవలం పుస్తకాలమ్ముకోవడం లాభాలు గడించుకోవటంకోసమే అయితే యింత తరంగం అనవసరం. మనదేశంలో గ్రంథప్రచురణా, గ్రంథవిక్రయమూ చాలా నికృష్టస్థితిలో వున్నాయి. మంచిపుస్తకాలు చదవాలనే జిజ్ఞాస ప్రజల్లో వృద్ధిపొందుతున్నంతగా మంచిపుస్తకాలు రావటంలేదు. వున్న కొద్దిమందీ చవగ్గా మురిగ్గా పుస్తకాలు అచ్చువేస్తున్నారు. ఒకప్రక్కన దేశభాషల్లో గ్రంథప్రచురణ యింత అధ్వాన్నంగావుంటే ప్రచురణకర్తలు అమాయకులైన రచయితల్ని మరీదారుణంగా మోసంచేస్తున్నారు.

'ఆసేతు శీతాచలపర్యంతం యిన్నిభాషలు మాట్లాడే ప్రజల్లో తెలుగుది ద్వితీయస్థానం. కవులూ, రచయితలూ వేలకొద్దీ వున్నారు. మనదేశంలో రచనావ్యాసంగం ముమ్మరంగా సాగుతోంది. ప్రజల్లో

యిప్పుడిప్పుడే పఠనాసక్తి రాజుకుంటోంది. ఈదాహాన్ని కనిపెట్టిన కొందరు అడ్డమైనచెత్తా ప్రచురించి లాభాలుగడించుకొంటున్నారు. ఆధునిక సాహిత్యాన్ని ప్రచురించేసంస్థలు బహుపరిమితంగా వున్నాయి. నేటి ప్రచురణకర్తలు ఉత్తమ గ్రంథాల ప్రచురణకు వెనుకాడుతున్నారు. అభూతకల్పనల వ్యామోహంలోపడి ప్రజలు చవకబారు సాహిత్యాన్ని విశేషంగా ఆదరిస్తున్నారు. పఠనాసక్తి ఉత్తమగ్రంథసాధనకు దోహదకారికాకుండా, రచయితల్ని నిరుత్సాహపరుస్తోంటే వ్యాపారస్తులు యీ వ్యామోహాల్ని స్వలాభాలకు వాడుకుంటున్నారు. రచయితల సంఘాల ద్వారా యేమన్నా సాధించవచ్చేమోననుకుంటే, అవీ ఆర్థికస్తోమత్తులేక గుంటపువ్వులు పూస్తున్నాయి.

'మన జనసామాన్యంలో శ్రామికజనం వ్యవసాయకూలీ పాటక జనం - యీరెండూకూడా సినీమాదేవతకు మొక్కుచెల్లించటంవరకే తగివున్నారు. ఏదోవొకటి - ఆనందాన్ని కొనుక్కొందుకుఅంటే - సినీమా సాధించినవిజయం తతిమ్మాకళలకు కాస్త కన్నెర్రగానేవుంటుంది. మన మధ్యతరగతి సుసంఘటితం కావాలి. ఈతరగతి ప్రజలే యెప్పుడన్నా పావలాపారేసి పత్రిక కొంటారు. ఎరువుతెచ్చి పుస్తకాలు చదువుతారు. నాటకాలు చూస్తారు. కాని పరిస్థితులు ఎంతనిరాశాజనకంగా వున్నా రచయితలకు కరువులేదు. అన్నివర్గాలలోనూ జీవితానికి ప్రతినిధులుగా వ్రాసేవాళ్లు వున్నారు. ఇటీవల మనప్రజల్లో పఠనాసక్తి పెరిగిందనేది నిజం! ఈ దాహాన్ని మంచిపుస్తకాలతో తీర్చదలుచుకొన్నాము. అందుకే పీకాపబ్లికేషన్స్ పెడ్తున్నాము. త్వరలో పత్రిక ప్రారంభిస్తాము. పుస్తకవిక్రయం సరసంగా తక్కువ కమీషనుకు బెజవాడ, హైదరాబాదు, మద్రాసుల్లో మా బ్రాంచీలద్వారా యేర్పాటుచేస్తాము. రచయితలూ యితర ప్రచురణకర్తలూ యిందులో సభ్యులుగా వాటాదార్లుగా చేరి యీ సంస్థను బహుళజనామోదకరంగా చేస్తారని ఆశించవచ్చుననుకుంటాను. ఇవిగో - నిబంధనల కాపీలు - షేర్లు పుచ్చుకోవాలని సవినయంగా సభికులను ప్రార్థిస్తున్నాను. షేర్లు పాతికవేలువరకూ ప్రోగుచేసి లిమిటెడుకంపెనీగా రిజిష్టరుచేయిద్దామని సంకల్పం.'

సభలో ఐదువేలవరకూ షేర్లుపడ్డాయి. ఇంకా విరాళాలు వేసిన వారువేశారు. కవులు పద్యాలురాసుకొచ్చి చదివారు. ఇంకా చాలామంది ఒకరివెంట ఒకరు వుత్సాహంగా మాట్లాడారు. భరతనాట్యం ప్రదర్శన జరిగింది. సభ జయప్రదంగా ముగిసింది. 'దాహం' కాపీలుకూడా చాలా వరకు చెల్లుబడ్డతే: తరువాత చాలారోజుల్లో పత్రికలనిండా ప్రకటనలు- 'వీణాపబ్లికేషన్స్' పేరు దశదిశలా మారుమ్రోగిపోతోంది.

# 15

వీణాపబ్లికేషన్స్ కార్యాలయంలో ఒకరోజువుదయం ఎనిమిది గంటలకు సూర్యనారాయణ పైనుంచివచ్చిన పుస్తకాలకట్టల ఇన్‌వాయిసులు, బిల్లులు చేత్తోపుచ్చుకుని చెవిలో పెన్సులుతో హడావిడిగా తిరుగుతున్నాడు. శ్రీహరి పటకారు, సుత్తి, శానం పుచ్చుకుని ప్యాకేజీలు తెరిచి కాపీలు పేరుస్తున్నాడు. మళ్ళీ యిద్దరూ వాటినిసరిచూసుకుని అద్దాలఅలమారుల్లో రాకుల్లో నేత్రాకర్షకంగా పేరుస్తున్నారు. శాస్త్రి కళ్ళద్దాలు తుడుచుకుంటూ పెద్ద అక్కౌంటుపుస్తకంలో రంగుపెనసలుతో టిక్కులుపెడ్తున్నాడు. బల్లమీద ఖరీదైన వ్రాతపరికరాలు, టెలిఫోను, ఆష్ట్రేలు డైరీక్యాలండరు, ఒకప్రక్కన తోలు హాండ్‌బ్యాగులోంచి రశీదులకట్టలు, తాళంచెవులు, చెక్కులు, కాగితాలుతీసి పొందికగాఅమరుస్తున్నాడు.

మస్తాను పోస్టువచ్చిందంటూ వుత్తరాలబొత్తుపుచ్చుకుని పైకొచ్చాడు. టెలిఫోను గణగణమని మ్రోగింది. రిసీవరు ఎత్తిపట్టుకుని 'హల్లో! అవును, వీణాపబ్లికేషన్స్....నేనే - మీరు సంపాదకునితోటే మాట్లాడుతున్నారు. క్షమించాలి. ఖాళీల్లేవండి. ఏదీ పత్రిక యింకా రెండుసంచికలేగా వేసింది. మీరచనలు ఏవీ పడలేదంటున్నారా? కుప్పతిప్పలుగా వస్తున్నాయి. వీలువెంబడిని చూస్తాము. బాగుంటే ప్రకటించి తీరుతాము. ఫైలుపుచ్చుకునివస్తారా....రావచ్చు. అభ్యంతరమేంలేదు. ఓ కే! శలవు! నమస్కారం.'

'అబ్బ! పనిచేసుకోనివ్వరు. ఎవరక్కడ తలనొప్పిగావుంది. ఒకపాట్‌లో 'టీ' కలుపుకురావాలి. ఏవిటోయ్ సూర్యనారాయణా శ్రీహరీ-యిందాకట్నించీ చూస్తున్నాను. ఆప్యాకేజీలు ఖాళీచేసి హాలు శుభ్రం చేయించకుండా అల్లా శతమతమైపోతున్నారేవిటి? ఇంకా పార్శిళ్లుకట్టి పైకిలుమీద స్టేషనుకువెళ్ళి బుక్‌చేసిరావాలి. బ్యాంకుకెవరెళ్తారో చెబితే చెక్కులున్నాయి జమకట్టించుకురావాలి. ప్రెస్సుకెళ్ళి ఫారాలన్నీ ఎంత వరకొచ్చాయోచూసుకుని ఆప్రసాదుని యిక్కడికి పంపించాలి. ఈ కట్టలన్నీ నేనొక్కడ్నీ యెంతకని చదవగలను? మీరాదేవిగారెక్కడ? సహాయనిరాకరణోద్యమంలాగుందే - బ్లాకులన్నీ వచ్చాయా? అడ్వర్టయిజుమెంట్లవాళ్ళదగ్గరకు సూర్యనారాయణ వెళ్తేనే బాగుంటుంది.'

శ్రీహరి చెమటలుగ్రక్కుతున్నాడు - 'ఈ జీతంబత్తెంలేని నవుకరీ చాలాకష్టంగావుంది బాయి!'

'అదేవిటోయ్! సహాయసంపాదకులని మీఅందరిపేర్లూ వేస్తున్నాంగా. ఇంతలో ఏమొచ్చింది?'

'నీ అథార్టీ భరించడం కష్టంగా వుందంటున్నాడు' అని నవ్వాడు సూర్యనారాయణ.

'మనమంతా డబ్బుకోసం కష్టపడుతున్నాముటోయ్? ఏదో సారస్వతసేవ - చిన్నాపెద్దా యేమిటి? చెప్పినపని చెయ్యాలి. క్రమశిక్షణవల్లే ఇంగ్లీషువాడు యింతమందిని యిన్నేళ్ళు చెవలమేకల్ని చేసి యేలాడు. ఇంత నోరుపెట్టుకుని యిదవుతూండటంవల్లనే మన వుద్యమం యీమాత్రంగా పైకొచ్చింది. రేపుప్రొద్దున్న నిన్ను హైదరాబాదు పంపించనూ? అక్కడ నువ్వొక్కడవే చాకచక్యంగా మెసలుకోవాలి' అని, మస్తానుకేసితిరిగి - 'ఏమంటీ సాయిబుగారూ! మీ షైలరింగుషాపు అడ్వర్టయిజుమెంటు ప్రతినెలా వేస్తున్నాముగదా ఏదీ పైసారావటంలేదేం?' నవ్వుతూ అన్నాడు.

'మీకోటు అట్టేవుంది. షర్టులో యేసుకుందురుగాని. తెస్తునా?'

'చంపేశావోయ్! మస్తానూ, నీకు పుణ్యముంటుంది. కోటు మాపెత్తకు—'

'చిన్న మనవి ఉందండీ—'

'చెప్పు! చెప్పు?'

'—వొక నౌఖరీ యిప్పించాలి....'

'నీకే....మమ్మల్నందర్నీ కొనేస్తావు.'

'బ్రాహ్మలఅమ్మాయండి.'

'అమ్మాయిల్నితెచ్చి నెత్తిమీదకెక్కించకు.'

'సూర్యనారాయణగారూ! ఆపిచ్చోడి పెళ్ళామండి-'

'ఏపిచ్చి? చేతిలోపని ఆపేసి సూర్యనారాయణ అడిగాడు.

'ఆసినీమాపిచ్చోడండి, ఆయనపెళ్ళానికి—'

'బాగుబాగు. నువ్వు రికమండుచేస్తే పీక్కు వుర్తాడు వేశావన్నమాటే.'

'ఏంచెయ్యమంటావు?'

'మన పుస్తకాలషాపులో వుంచాలండి ఆఅమ్మాయిని. ముప్పయ్యో నలభయ్యో - మనం ఎంతయిస్తేఅంత - '

'ఆ అమ్మాయిని షాపులో పెడితే వాడొచ్చి నానాఅల్లరిచేసి డబ్బులు పట్టుకుపోతే - యీబాధంతా యెవడుపడ్తాడు?'

'అహ! అదంతా నేను సూసుకుంటానుగా - ఆ ఆడకూతురు సంటిపిల్లతో నానాగడ్డి కరుస్తావుందండి.'

'ఇహ నువ్వూ, నేనూ చేసేదేమీ వుండదు. వాళ్ళిద్దరూ ఇందులో ఎంతకాల కాపురం పెడితేనో ...'

'తిండికిలేక సస్తావున్నారండి. మీరెవరో కనికరించాల....'

'సరే, అదంతానువ్వేచూసుకో....'

'మస్తాను దిగి వెళ్ళిపోయాడు. శాస్త్రి సాలోచనగా - 'ఇదేమిటోయ్, మనం వ్యాపారంచేద్దామనుకుంటూంటే యిదివొక అనాథ శరణాలయమైపోతోంది?'

మీరా మెల్లెక్కివస్తూ - 'ఏవిటండీ, అనాథశరణాలయమంటు న్నారు-?'

శాస్త్రి - 'రండి రండి. స్త్రీలశీర్షిక యేదన్నా పనిచేసిపెడ్తారేమో ననుకుంటే ఎక్కడా తుపాకికందకుండా పోయారు?'

'నన్ను అడదాన్నని యెవరనుకుంటున్నారు? వంటా పెంటా ఆసంగతి నాకేమీ తెలీదు. నేనేం సాయంచెయ్యగల్ను - అందులో పత్రికకు—'

'దానికేముందండీ, నలుగుర్నీ అడిగితే సరిపోతుంది - ఆపైన ప్రసాదు వున్నాడు. మీరు చెబుతూవుంటే మనవాడు సుమధుర లలిత మైన ధోరణిలో వ్రాసుకుపోతాడు.'

'చచ్చాం! మనుష్యులందర్నీ మీయిష్టంవచ్చినట్లు అప్పడాల పిండిలా వొత్తెయ్యచ్చనుకుంటున్నారు మీరు. ఆర్టిస్టుకి వ్యక్తిత్వం వొచ్చాక చచ్చినా మీరు చెప్పినట్లు చెయ్యడు.'

'మీరాదేవిగారూ: మీరు వీళ్ళందర్నీ చెడగొట్టేట్లున్నారు. నిజంగా యీసూర్యనారాయణ శ్రీహరి ప్రసాదు మీముక్కలు నిజమని నమ్మితే కొంప మునిగిపోతుంది. వీళ్ళంతా తమతమ వ్యక్తిత్వాలకోసం పోరాడ్డం ఆరంభిస్తే పీణాపబ్లికేషన్స్ అపశృతులు పలుకుతుంది—'

'ఆర్టిస్టుగా వ్యక్తిత్వంకోసం పెనగులాడినవాళ్లు మనలోంచి విడి పోయి స్వతంత్రంగా తమత్రోవ తాము చూసుకున్నారు.'

'మీనాక్షి తన వ్యక్తిత్వాన్ని రుజువుచేసుకుందని మీ తాత్పర్యం. అవునా? ఆ అవకాశం మీకూవచ్చినా, తన్ని, రక్కి, గింజుకుని బైట కొచ్చిపడ్డారెందుకో మరి? మీనాక్షి మీ జాగాలో వెళ్ళిపోయింది.'

'విపేకంలేని సాహసంకూడా వొకప్పుడు రాణిస్తుంది!'

'అంటే ఛాన్స్! కర్మ అనరాదూ, సరిపోతుంది.'

'నాత్రోవ నేను యేర్పరుచుకున్నాను. నా కపశృతుల లక్ష్యం లేదు, నాకు సంతోషంలేదు, దుఃఖంలేదు, కోరికలు లేవు!'

'రుషివయావన్నమాట!' అంటూ అడ్డంవచ్చాడు సూర్యనారాయణ.

శాస్త్రి వేళాకోళంచేస్తూ - 'కణ్వమహాముని ఆశ్రమం - అందులో కృష్ణమూర్తిగారూ - యీవిడ శకుంతల. దుష్యంతుడు ఫ్రాంసులో వున్నాడు. ఐతే ఎవరయ్యా, దూర్వాసుడు ?.... డామిట్ నేనే నేమిటి ! కొంపమునిగిందే !'

మీరా నవ్వింది - 'నాదొక చిన్నకోరికవుంది.'

'ఐతే కోరికల్తో వచ్చారన్నమాట ! ఇప్పుడేగా నాకేమీ కోరికలు లేవన్నారు. స్వవచనాఘాతము....తట్టుకోగలవా ?'

'పొరబాటు - చిన్నమనవి అనాలనుకున్నాను. తెలుగు రాదు సరిగా -'

'సంతోషం ! చెప్పండి - నా బ్రహ్మచర్యం చెడని కోరిక యేది కోరినా అవశ్యం తీరుస్తాను.'

'మీకు సిగ్గులేదు. చెబ్తాను. కృష్ణమూర్తిగారు 'ఆస్తి' అని నవల వ్రాశారు. అది మీ పబ్లికేషన్స్ తరఫున తీసుకుని ఐదువంద లివ్వాలి.'

'ఐదువందలే....నవల పుచ్చుకోవటానికేమీ అభ్యంతరంలేదు. మరి డబ్బు నిల్చున్నపాళాన....ఎక్కడ్నుంచి తేవటం ? చెప్పండి, మీరే చెప్పండి ? మీరేంచెయ్యమంటారో అల్లానే చేస్తాము.'

'మాస్టారూ, గురుదక్షిణ యిచ్చుకోవాలి, తప్పదు.'

'ఖరీదైన మాటలు బాణాల్లా విసుర్తున్నారు.'

'మీ గురువుగారినవల మీ రుండగా మరొకర్ని యాచించడ మెందుకని - '

'నిజం ! అదే ఆలోచిద్దాము అన్నానుగా.'

'మీరు మాటకారితనం బాగా నేర్చారు.'

'అయ్యోరామా ! కంపెనీ దివాళాతీయించే ప్రతిపాదనలు మీరు చేస్తున్నారు.'

'ఈ ఒక్క నవలకే మీరు దివాళా తియ్యాలిసొస్తుందా ?'

సూర్యనారాయణ అడ్డంవచ్చాడు - 'మనలో మనం వాదించుకో వడం బాగులేదు. మీరా! ఆ నవల పట్టుగొచ్చి యిచ్చివెళ్లు. నీకెంత డబ్బుకావాలో నన్నడుగు. నేను ఏర్పాటుచేస్తాను.'

'రాజాలాగుంది వ్యవహారం. అంతేగాని నీళ్ళలో గేదేనుంచి బేరమాడితే ఎట్లా ?

'శాస్త్రిగారికి నామీదే ఎందుకో కోపంగావుంది.'

'ఏంవీలేదు. స్త్రీ శక్తిస్వరూపిణిగదా అని....'

'మరేం! మీ పత్రికలో నా శక్తిస్వరూపం యెక్కడా పడ్డంలేదు గదా కొంపదీసి....'

'మీరు పడనిస్తేగదా....మీ బొమ్మలు రెండు యివ్వకూడదూ ?'

'నేనంత అందంగా వుంటానా - వేళాకోళమా ?'

'మీ బొమ్మలు అంటే మీరు రాసినవి - చిత్రించినవి అని సంపాదకుడి అభిప్రాయం.'

'పట్టుకెళ్ళండి. అంత బాగుండవేమో....'

'వస్తాను మీ యింటికి. వడియాలు వేయించి పెరుగుపచ్చడిచేసి వంకాయ యిగురుపెట్టి వండుతారా ?'

'నాకంత మమకారంలేదు.'

'నేను భోజనప్రియుడ్ని. ఆ ప్రియత్వం చేత మీ దగ్గరికి వస్తానంటున్నాను.

'మర్యాదగా మాట్లాడ్డం నేర్చుకోండి.

'మీకు తెలుగు సరిగా రాకపోవటం నేను చేసుకున్న ప్రారబ్ధం కాక మరేమనుకోను !'

'ఈ ధ్వని, శ్లేష, వ్యంగ్యం, అన్యాపదేశంగా మాట్లాడానికి తెలుగుభాషలో వున్నంత సౌకర్యం మరెక్కడా వుండదనుకుంటాను.'

'చిత్తం ! పరిస్థితులూ, మనుష్యులూ బాగా అర్థంకాక మీరు నా కివ్వవలసిన గౌరవాన్ని భాషకు యిస్తున్నారు. అన్యాయం -'

'వెళ్ళొస్తాను. మీరు పనిచేసుకుంటున్నట్లున్నారు.'

'శీఘ్రంగా వెళ్ళొచ్చు.'

మీరా మెట్లుదిగి నాలుగడుగులు వీధిలోకివేసి మళ్ళీ ఏదో అభియోగం తెచ్చేదానికిమల్లే వెనక్కు మళ్ళి వచ్చింది.

ఈమారు కూడా ప్రసాదు వున్నాడు. ఫారాలదొత్తి చేత్తోపట్టుకున్నవాడ్ని జబ్బ దొరకపుచ్చుకుని ముందుకు త్రోసుకుంటూ - 'చూశారా యీ వాలకం ? బట్టలు తల, కళ్లు చూడండి - '

శాస్త్రి చిరాగ్గా - 'ఇప్పుడతగాడి కేమొచ్చింది ?'

మీరా - ఏమొచ్చిందా - నన్నెందుకడుగుతారు ? చెప్పమనండి ?'

ప్రసాదుచొక్కా దులుపుతో - 'ఏమి మగాళ్లు ? తట్టెడు దుమ్ము రాల్తోంది వొంటినసహాయసంపాదకా, స్నానంచేశావా? ఎన్నాళ్ళయి....'

తలకాయ అడ్డంగా వూయించాడు ప్రసాదు.

'ఈ కుర్రవాడు అమాయకుడుగదా అని ప్రెస్సులో కూర్చోబెట్టి యిరవైనాలుగు గంటలూ ప్రూపులు దిద్దిస్తున్నారు. భోజనం. కాఫీ వగైరాలు అయాయా? పద, ఆ కాగితాలు యిక్కడ పారేసి మాయింటికి పద, ఛోంచేసి విశ్రాంతిగా నిద్ర తీద్దువుగాని.'

శాస్త్రి తీవ్రంగా - 'మిమ్మల్నేమన్నా మేం సంక్షేమాధికారిగా వేసుకున్నామా? మా సహాయసంపాదకుడ్ని పట్టుకుని వొక సాటికళాకారుడ్ని, వ్యక్తిత్వం కలవాడిని నీళ్ళోసుకున్నావా, పళ్ళు తోముకున్నావా, చొక్కా మాపుకున్నావేమని అడగటం శోచనీయం. మీ యీ అభియోగాన్ని సభవారు గర్హిస్తున్నారు.'

'పదపద. ప్రసాదూ - నీ నాటకం పుస్తకం యిచ్చావుకాదు నాకు. ఛోంచేసి చదివి వినిపిస్తావా ? రా, నేను ముందు నడుస్తూంటాను.'

ఒకకెరటం మళ్ళీ వెనక్కు తగ్గినట్లయింది. నలుగురూ ముఖాలు చూసుకున్నారు.

'ఈవిడ యిల్లా మారుతుందని మనవెప్పుడూ అనుకోలేదే !'

సూర్యనారాయణ చల్లగా చెప్పాడు - 'కృష్ణమూర్తిగారి నీడలు పడితే యెవరైనా యింతే....స్టూడియో ఎత్తేసి యీ పుస్తకాలు పత్రికల హడావిడి అంతా తనకు గిట్టనట్లుంది.'

'మనది గాలివాటు ప్రయాణం - ' అన్నాడు శాస్త్రి - 'ఒక్కగంట కూర్చుందోలేదో హైరాణపెట్టేసింది మనల్ని. కృష్ణమూర్తిగారికి డబ్బు దేనికికావాలి ?'

'ఏమో - ఆయనకు డబ్బు అవసరంరావటం చిత్రంగానే వుంది. ఆ అవసరం ఏమిటో ఆయన్నే అడిగితే చిక్కొస్తుంది. మీరానుంచే తెలుకోవాలి !'

'ఇంతకీ మనం డబ్బు ఎక్కడనుంచి తెచ్చి యిస్తాం - '

సూర్యనారాయణ నవ్వాడు - 'స్టూడియోసామాగ్రి అమ్మేసి అప్పు తీర్చేసి ఐదువందలు మాస్టారికిచ్చేద్దాము. తరువాత మనమూ కంపెనీ లావాదేవీలు పడొచ్చు.'

'అమ్మడమా ?' అని శాస్త్రి నోరు తెరిచాడు.

# 16

సెప్టెంబరునెల. చలికాలం యింకా వుంటూండగానే ఒకరోజు తెల్లవారుఝామున నాలుగుగంటలకు మఫ్లరు తలకు బిరుసుగా చుట్టి చురుగ్గా అడుగులువేస్తున్నారు. వెన్నెల్లో మంచు కురుస్తోంది. శాస్త్రి హుషారుగా కృష్ణనిర్యాణం పోతనగారి పద్యాలు చెళ్ళపిళ్ళవారిఫక్కీ లో చదువుతున్నాడు.

'మంత్రియై యొకవేళ మంత్రమాదేశించు,
మన్నించు నొకవేళ మరదియనుచు - '

సూర్యనారాయణ 'అపు' అని గసురుకున్నాడు.

'ఏడుపుగొట్టుపద్యాలు చదువుతున్నాననా ? మీకేనా, నాకుమాత్రం

విచారంలేదా, కృష్ణమూర్తిగారూ మీరా వెళ్ళిపోతున్నారని?'

మీరాఅడ్డుకుని - 'చదవనియ్యండి. మున్నుగ్రాటవిలో చదవండి.'

శాస్త్రి చదివి శ్రావ్యంగా వినిపించాడు.

'ఒక్కమారు మంగళసూత్రం పద్యంకూడా చదువుదురూ?' మీరా ప్రతిపూలింది.

'ఛార్జీ యిచ్చుకోలేరేమో....'

'ఇచ్చుకుంటాలెండి.'

శాస్త్రి అభినయంచేస్తూ వున్నట్లుండి ఆగిపోయి మీరామెడవైపు చూపిస్తూ - దాని 'నేవెలకైనన్ తెగనమ్మి నీసుతునకై వెచ్చించినన్ చెల్లదే - ' అని కాస్సేపు పద్యాన్ని లాగి 'దళమా పద్యోదలో - అని మొదలందుకున్నాడు.

సూర్యనారాయణ జబ్బపట్టుకు లాగుతున్నాడు - 'నడిరోడ్డులో యీ అల్లరేవిటి శాస్త్రీ - '

'ఇది ఆఖరువికాసం! ఈవాళ పద్యాలమీదికి గుబులుపోయింది.'

మీరా నవ్వుతూ - 'మేం వెళ్ళిపోతున్నామని మీకు కించిత్తు విచారంకూడా లేదుగదా!'

'లేకేం! వుండబట్టే కృష్ణనిర్యాణం పద్యాలు చదివాను.'

'ననన్నెప్పుడన్నా జ్ఞాపకంచేసుకుంటారా?'

'మీది చాలాకృూరమైన స్వభావంలాగుంది. మీరేమో మమ్మల్ని వదిలెయ్యటమేగాకుండా మిమ్మల్ని తల్చుకుని తల్చుకుని కుమిలిపోవాలనికూడామీ అభిప్రాయంకావచ్చు. ఎంత దురాశ....'

శ్రీహరి ప్రసాదు కృష్ణమూర్తిగారి గ్రామఫోను, సంచులు, మూటలు మోస్తూ నడుస్తున్నారు.

సూర్యనారాయణ చెప్పాడు - 'నవల హిందీలోకికూడా తర్జుమా చేసి ఒక్కమారే రెండూ ప్రచురిస్తాము. శాస్త్రి ఘటనాఘటనా సమర్థుడున్నాడు గదా!'

'నన్నేమిటోయ్ కథానాయకుడ్నిచేసి మాట్లాడుకొంటున్నారు.'

సూర్యనారాయణ మీరాకు నెమ్మదిగా చెప్పాడు - 'డబ్బుకావలిస్తే యెప్పుడన్నా సందేహించకు. వ్రాయి. ఎక్కడో తలన్నా తాకట్టుపెట్టి పుట్టిస్తాను. ఇబ్బంది పడొద్దు.'

మీరా అల్లాగే అని తలవూయించింది.

శాస్త్రి అందుకున్నాడు - 'తలన్నా తాకట్టుపెట్టి అంటున్నాడు. అతగాడి తల అట్టే విలువయినది కాదు. అంటే నా తల తాకట్టుపెడతా నన్నమాట.'

అంతా గొల్లుమన్నారు. ఒక పట్టు పొడుంపీల్చి జిర్రున చీది ముక్కు తుడుచుకుంటూ - 'సిగరెట్లెవరికి పగ్గరున్నాయర్రా; యిటు పారెయ్యండి, కాల్చి చూపిస్తాను.'

మీరాఅడిగింది - 'ముక్కుపొడి యెప్పుడు అలవాటుచేసుకున్నారు?'

'మరి పత్రికాసంపాదకుడ్నిగదా! చూడ్డంలే - వాలుకండువా బిళ్ళగోచీ అవతారం! కళ్ళజోడు ముక్కుమీదకొచ్చింది. తలమీద నాలుగువెంట్రుకలూ రాలిపోతున్నాయి, విజ్ఞానానికీ మేధస్సుకీ చిహ్నంగా.'

స్టేషనులోకొచ్చేసరికి రైలువచ్చి సిద్ధంగా ప్లాటుఫారంమీద వుంది. సూర్యనారాయణ - 'మాస్టారూ!' అని జాలిగా గొణిగాడు. కృష్ణమూర్తిగారు అతడి చేతులు పుచ్చుకుని - 'కల్లాకపటం తెలియని వాడివి, అమాయకుడివి, నీకే కష్టాలు రాకూడదని నా కోరిక' అనేసి మొహం తిప్పుకున్నారు. సూర్యనారాయణ, మీరా, శాస్త్రి, ప్రసాదు, కృష్ణమూర్తిగార్లకు శ్రీహరి ఫొటోలు తీశాడు. ప్రసాదు పూలగుత్తులు తెచ్చి మీరాకు, కృష్ణమూర్తిగారికి సమర్పించి నమస్కారం చేశాడు. సూర్యనారాయణ తెల్లతెలబోతూ - 'నావల్ల యేమన్నా పొరపాట్లు జరిగి వుంటే క్షమించండి మాస్టారూ!' అని అడిగాడు.

మీరా ప్రసాదుని సమీక్షిస్తూ - 'ఇతను అభిమన్యుడిలాంటివాడు.'

'ఐతే మేమంతా పద్మవ్యూహంపన్నామనా మీ అభిప్రాయం?' - శాస్త్రి పోట్లాటకొచ్చాడు.

శ్రీహరి కెమేరాలు తదితరపరికరాలు బొమ్మలు వ్రాసుకునే బల్లా అన్నీ యివిడికగా బంతిలో సర్దాడు సూర్యనారాయణ వెంపేలు పడిపో తున్నాడు. 'మీరిద్దరూ వెళ్ళిపోతున్నారు. నేనేవిటో విర్భాగ్యుణ్ని. నాకెంతో యిదిగావుంది. మీరా, నిన్ను పెంచాను, పెద్దచేశాను, ఈనాటికి నువ్వు జీవితంలో సుఖపడలేకుండా చేశాను. నా జీవితంలోనూ, నేను జోక్యంచేసుకున్న యితరులజీవితాల్లోను చేసినవి పెద్దపెద్ద పొరబాట్లే- నన్ను క్షమించాలి మీరా!'

మీరా సూర్యనారాయణచేతులు పట్టుకుని వారించింది.

'మాస్టారూ! నాకు వొక గమ్యాన్ని చూపించారు. చీకట్లో నాకు చిన్న దీపాన్నివెలిగించి యిచ్చి పట్టుకునడవమన్నారు. తతిమ్మా జీవి తంలో జరిగేవీ జరగవలసినవీ సందర్భాలు అసందర్భాలు యెన్నో! వాట్లన్నింటికీ మీరేంచేస్తారు? నన్ను సంతోషంగా ఆశీర్వదించి సాగనంపండి.'

మస్తాను రొప్పుకుంటూ పరిగెట్టుకొస్తున్నాడు. శాస్త్రి యిక్కడ యిక్కడ అని అరిచాడు. మీరా చప్పున 'మస్తానూ!' మస్తానూ!' అని కేకలు పెట్టింది.

'అమ్మా! అమ్మా! వస్తున్నా-' అని కేకేస్తూ వచ్చిపడ్డాడు, చిన్న తోలుపెట్టితో.

'ఇదేవిటీ తోలుపెట్టె తెచ్చావు దేనికి మస్తానూ?'

'వుంచుకోఅమ్మా! నీకు చీర తెచ్చాను.'

'ఏదీ యిల్లాతే-' శాస్త్రి లాక్కుని పెట్టి తెరచి చీర బైటకుతీసి మీరామెళ్లో వేశాడు. మీరా మస్తానుచేతులు పట్టుకుని అంది- 'విన్నే మనాలో నా కిప్పటికీ తెలీదు. నా కష్టసమయాల్లో నాకు ఎప్పుడూ అండగా నిలిచింది నువ్వే. నీ కడుపున పుట్టి నీ ఋణం తీర్చుకుంటాను.'

'నాకు ముందానిద్ర- నిద్రపట్టింది. తెలివేరాలేదు. హాడలి పరి గెట్టుకొచ్చా- అమ్మా, కనిపించావు. లేకపోతే హమేషా యేడుద్దును.'

మస్తానుకి మీరాకి శ్రీహరి మళ్ళీ ఫొటోతీశాడు.

బండి కూతవేసింది. మీరా 'శాస్త్రిగారూ' అని పిలిచింది. శాస్త్రి దగ్గరగా వెళ్ళాడు.

'నాకు భయంగా వుంది!' అంది.

'అడగండి, ఫరవాలేదు -'

'ఒక షేక్‌హాండు యివ్వండి -'

శాస్త్రి మీరాకు షేక్‌హాండ్ యిచ్చాడు.

కృష్ణమూర్తిగారు సూర్యనారాయణను పిలిచి 'అరవింద జాగ్రత్త ... యనా -' అని చెప్పారు.

శాస్త్రి మీరాను పిలిచి - 'డబ్బు జాగ్రత్త!' అని చెప్పాడు. చాలా సేపు చేతులు చీకట్లో వూగి విశ్రమించాయి. మంచులో, చలిలో వెన్నెట్లో చీకట్లో రైలు కలిసిపోయింది.

# 17

సుఖాల్నీ, దుఃఖాల్నీ సమంగా పంచుకొనేవాళ్లే స్నేహితులంటే -

అలాంటి పరిజనాన్ని సఖుల్నీ హితుల్నీ విడచిపోతుంటే, అనుభవాలూ, జ్ఞాపకాలూ తరుముకురాగా, మీరా పరితప్తహృదయంలోంచి క్షణకాలం దుఃఖం వువ్వెత్తుగా, కెరటాల్లా లేచి ప్రయాణంలో గమ్యం, గమనం అలుముకుపోగా, భవిష్యత్తు కారునల్లగా, కటికచీకటిలా తట్టి చెంగుతో కళ్ళొత్తుకుంటూ కిటికీలోంచి చూసింది.

సూర్యనారాయణ, శాస్త్రి, ప్రసాదు, మస్తాను మళ్ళీ కనపడరు.

ఆదరం. ప్రేమా, త్యాగం వీటి కుదుట్లోంచి తన్నుతాను పెడుక్కుని, ఎక్కడికో దేశాంతరానికి - జీవితానికి ఒక స్ఫూర్తి. ఒక అర్థాన్ని ఒక వెలుగుని వెతుక్కుంటో ప్రయాణంచేయటం మహాసాహసంగా తోచింది.

మస్తాను శాస్త్రి సూర్యనారాయణ అంతా తన్ను తమలో ఒక భాగంగానే చూసుకున్నారు. ఈ బంధనాన్ని త్రెంచుకుందుకు, వ్యక్తిత్వం కోసం పోరాడేముందు యే విరాగం ఆమెను ఆక్రమించుకుందో దాన్ని తుత్తునియలు చేయగల అనుబంధంగాని మమకారంగాని ఎక్కడా ఆమెకు యేర్పడలేదు. మనస్సు బహుశా ముసిలిదై పోయినా కావచ్చు. వార్ధక్యం శరీరానికేనంటే యెవరు నమ్ముతారు? శాస్త్రినామె అర్థం చేసుకోలేకపోలేదు. కాని అతడి అహంకారాన్ని పటాపంచలుచేయాలనే పట్టుదల వొకప్పుడు వచ్చినా ఆ జోలికి పోవడానికెందుకు మనస్కరించ లేదో తన ముసిలిమనస్సుకి తెలుసు. వెళ్ళవద్దని శాస్త్రి అడ్డుకో లేదేమని కాస్త ఆశ్చర్యంవేసినమాట మాత్రం నిజమే. తమ్ము తాము హెచ్చుగా ప్రేమించుకునేవాళ్ళెవరూ యితరులకు ప్రేమను పంచి యివ్వ లేరు. తన జీవితంలో సంవత్సరాలుగా యేర్పడ్డ శూన్యాన్ని విరాగంతో నింపుకొని పోవటానికి ప్రత్యామ్నాయంగా ఆత్మహత్య యెందుకు చేసుకోలేదంటే నవ్వువచ్చేమాట నిజమే! అందరికీ జీవితంలో అన్నీ దొరకవు.

'నేనెప్పుడన్నా ఆ బ్రహ్మచారిని ఆ అహంకారమూర్తిని ప్రేమిం చానా?' మీరా తన్ను తాను ప్రశ్నించుకుంటోంది. షేక్‌హాండ్ యిమ్మని తను అడక్కపోతేనేం? చాలా నిర్లిప్తతగా చేయి కలిపాడు. గుండె ఝల్లుమంది. అతనెందుకు చలిస్తాడు? ప్రలోభం ఎదుటవున్నా చలిం చనివాళ్ళే ధీరులంటే—అరచేత్తో చెంపల్ని రాసుకుంటూ కూర్చుంది.

కృష్ణమూర్తిగారు లేచి కిటికీఅద్దాలు వేశారు. మఫ్లరు బిగించి చుట్టుకుని కూర్చుంటూ - 'ఎవర్నన్నా ప్రేమించావా అమ్మాయీ?'

మీరా వులిక్కిపడి సర్దుకు కూర్చుంది. ఆప్రశ్న ఎంత కటువుగా వుందో! ఆ అడగటంలోనే 'ఎవరినీ ప్రేమించకు' అని వార్నింగుకూడా వున్నట్లుంది.

'లేదు-' అన్న తడబాటుముక్కల్ని వినిపించుకోకుండానే కృష్ణ మూర్తిగారు హఠాత్తుగా మొదలెట్టారు—

'ఈతరంలో ప్రేమను వెదుక్కోదల్చుకున్నవాళ్లు ముందుతరం వాళ్ళ పాట్లుకూడా అప్పుడప్పుడు శ్రద్ధతో పరికించాలి. పెళ్ళి....ఒక పద్ధతి అనుకో. దాన్నిగురించి తర్జనభర్జనలు అనవసరం. కష్టాల్లో వున్న వాళ్ళకు అసమర్థులసానుభూతి చాలా హానికరమనిచెప్తాను' మాచిన్నతనాల్లో, అంటే, ఒక యాభై యేళ్ళక్రితం ఆంధ్రదేశంలో వర్ణ వ్యవస్థ ఆచారాలు, పద్ధతులు యిప్పటికన్నా యెన్నోరెట్లు భిన్నంగా వుండి వుంటాయి. నమ్ము! వ్యవసాయవృత్తే అందరికీ - బీదాబిక్కీ వున్నారు. జమీందారులు పెద్ద రైతులు వీళ్ళ కుటుంబాల్లో స్త్రీలు ఎల్లా జీవించేవారో వూహించుకో. నేనుచాలాపెద్దపెద్దకుటుంబాల్లోచనువూస్నేహం సంపాదించాను. క్షత్రియులు,రెడ్లు,కమ్మ,వెలమవారు ఈజాతుల్లోకూడా ధనికవర్గాలు నిరుపేదలు వీళ్ళంతా ఎవరిప్రారబ్దం వారు అనుభవిస్తూండేవాళ్లు. అప్పుడు దేశమంతా వుప్పెనగా సహాయనిరాకరణోద్యమం, వుప్పుసత్యాగ్రహం లేచింది. స్వదేశీవస్త్రాలు, విదేశీ వస్తుబహిష్కరణోద్యమం, కోర్టులు, స్కూళ్ళు, కాలేజీలు వదిలేసి మహాత్ముడి సత్యాగ్రహసమరంలోకి ప్రజలు తండోపతండాలుగా రావటం అంతా నీకు తెలుసనుకో. ఇవేమీ లోతుగా మన సాంఘికజీవితాన్ని కదిలించలేదు. వీరేశలింగంగారి సంస్కరణోద్యమాలు ఒకవైపునుంచి పనిచేస్తున్నాయి. ఒకవైపు స్వాతంత్ర్యం వచ్చేస్తుందనుకుంటూనే ప్రజలు రాజకీయంగా చైతన్యం తెచ్చుకున్నారుగాని ఆ వాతావరణంలో సాంఘికమైనమార్పులు రావటానికేమీ ఆస్కారంలేదు. అల్లాటప్పుడు నేను స్కూలుమాష్టరీచేస్తూ ఒక రెడ్ల అమ్మాయిని నాకు బాల్యంనుంచీ బాగాతెలిసినమనిషిని మొగుడు పోయి పాలుపెరుగూ అమ్ముక్కుంటున్న అమాయకురాలిని మనసిచ్చి ప్రేమిస్తున్నాను. ఇద్దరం పారిపోదామనుకున్నాం. ప్రపంచం మనల్నేం చేస్తుంది అనుకున్నాం. అన్నీ నిశ్చయంచేసుకుని యేర్పాట్లుచేసుకున్నాక దేశంపిలుపు వచ్చింది, కాంగ్రెస్సులో పడ్డాను. లాఠీదెబ్బలుతిని వొళ్లు సొమ్మసిలి పడిపోతే జైలుకీడ్చుకుపోయారు. జైదునుంచి వచ్చాక వాకబుచేసి కనుక్కుంటే చచ్చిపోయింది అన్నారంతా. నాకు మతిపోయి

న్నట్లయింది, అనవసరంగా సానుభూతిచూపించి జీవితాన్ని బలిపుచ్చు కున్నాను. ప్రేమబలి! - కథ బావుందా ?'

మీరా తెల్లతెలబోయింది.

'అదివేరులే, దేశం కోరింది యిచ్చాను. నన్ను కోరింది స్త్రీ. జీవితాన్ని బలిపుచ్చుకున్నాను. సంసారం, ఒకయిల్లు, తిండీ, బట్టా, ఆదరణ వీటికోసం మొగాడ్ని వెతుక్కుంటూ వచ్చే స్త్రీలు పొందే పరాజయాలు మచ్చుకిల్లాగుంటాయి.'

మీరా దుప్పటీ తలకంటా లాక్కుని ముసుగేసుకుని పడుకుంది. బెజవాడలో బండిమారారు. ఎక్స్‌ప్రెస్‌లో నాగపూరు - మూడోనాటికి కెమేరా, ఫొటోసామాను, రంగులు, కుంచెలు, కాన్వాసులు తతంగంతో - కృష్ణమూర్తిగారి యావత్తుసరంజామాతో జబ్బల్పూరులో దిగబడ్డారు యిద్దరూ.

# 18

శీతాకాలం! మనుష్యులు బిగుసుకుపోయే చలిలో గజగజా వణికిపోతూ నిలబడ్డారు. బళ్ళలోదిగిన ప్రయాణీకులు త్వరత్వరగా తమ తమ నెలవులకు పరుగులుపెడ్తున్నారు. స్టేషన్లో నెగళ్లువేసుకుని రాక్షసి బొగ్గుదగ్గర చలికాగుతూ గుంపులుగుంపులుగా రైల్వేకార్మికులు కబుర్లు చెప్పుకుంటున్నారు. దీపాలు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. ఇంజనులు బంయ్‌మని అర్చుకుంటూ రొదచేసుకుంటూపోతున్నాయి. చెట్లు, అడవులు, కొండల్ని చుట్టేసుకున్న పట్టణం పొగమంచులో వెలవెలా బోతున్నట్లుంది.

కృష్ణమూర్తిగారు హిందీలో టికట్‌కలక్టరుని అడిగి సామాన్ని వెయిటింగురూములోకి నెమ్మదిగా చేర్పించారు. టికట్టుకలక్టరు ఆరవాయన - కృష్ణమూర్తిగారిని ఏదోఅడిగితే ఆయన అరవంలో చెప్పారు - చౌడాఘాటు చూడ్డానికి వచ్చామని. నలుగురైదుగురు పోర్టర్లు, ఒక చిన్న

మేష్టరు, ఒక ఎలక్ట్రిషియన్ తెలుగువాళ్లు బిరబిరాప్రోగయ్యారు. చేతిలో లాంతర్లు, చెవులో పెనసలు, నీలంచొక్కాలు వున్నికోటులు క్షణంలో వాతావరణానికి తెలుగుతనం వచ్చేసింది.

చిన్నమేష్టరు కృష్ణాజిల్లా ఆయన - 'ఇహనేం - మాది బెజవాడే నండి. ఇక్కడేంచూశారు ? కట్నీ వెళ్ళండి - అక్కడంతా మనవాళ్లు స్థిరపడిపోయారు వ్యాపారాలు చేసుకుంటూ.'

ఎలక్ట్రిషియన్ చెప్పాడు - 'అయ్యా ! ఆంధ్రత్వం మీరు ఇప్పుడేం చూశారు ? ఈవూళ్లో నెలకు రెండు తెలుగుసినీమాలు వస్తాయి. ఈ సిటీలో సగంమందిమి మన తెలుగువాళ్ళమే అన్నా అతిశయోక్తికాదేమో! ఒరేయ్, సింహాచలం ! ఎవర్రా అక్కడ - మనవాళ్ళొచ్చారు. టీపట్రా ముందు. ఏవిటండీ యీ సామాను....ఇంత చలిలో యెవరూ రారండి. మార్చినెల చాలాబాగుంటుంది. వుంటారా యిక్కడ - యిటువైపునుంచి బి. యన్. ఆర్. చిన్నలైనుంది. అది మనరాజ్యమే అనుకోండి.'

కృష్ణమూర్తిగారు నవ్వారు- 'చూశావా అమ్మా ! తెలుగుపుట్ట ! తీగకదిపితే డొంకంతా కదులుతుంది. జాబాలీపురమంటారు దీన్ని. జబాల్ అంటే అరబిక్‌భాషలో కొండలూ, గుట్టలూ అని అర్థం. ఇక్కడ నుంచి శ్రీరామచంద్రుడు సీతను తెచ్చుకుందుకు వానరసైన్యాన్ని ప్రోగు చేసుకు వెళ్ళాడ్ట. ఆకోతులు యీకొండల్ని దుముకటంచేత యిక్కడ వొకచోట 'బందర్‌కూదీన్' అంటారు.'

చిన్నమేష్టరు ఆశ్చర్యంగా - 'ఇక్కడ పదిహేను సంవత్సరాలుగా వుద్యోగంచేస్తున్నా. జబ్బల్పూరని పేరెందుకు వచ్చిందో మీరు చెప్పిందాకా మాకు తెలవదుసుమండీ !'

ఎలక్ట్రిషియను - 'ఇక్కడ ఆంధ్రసంఘానికి ఓ భవనం వగైరా అన్నీ వున్నాయిలెండి. మనవాళ్లు రాతపత్రికా అవీ నడుపుతూంటారు. నాటకాలు ఎప్పుడన్నా వస్తూవుంటాయికూడా.'

చిన్నమేష్టరు నవ్వాడు - 'చెప్పటం మర్చిపోయాను. ఈయన ఆనందరావుగారని ఆంధ్రసంఘం మాజీశక్రటరీ. కొండమీది కోతిని

తెమ్మన్నా యిట్టే తెచ్చియిస్తాడు. ఒక మంచికిగాని, ఒక చెడుగుకిగాని పగలూరాత్రీ అన్న భేదంలేకుండా పిలిస్తే పలుకుతాడు. తెలుగువాళ్ళెవ రైనాసరే యీయన్ని తప్పించుకుని ఈస్టేషన్లోంచి బయటికిపోలేరు. మీరు చౌడాఘాటు చూడదల్చుకుంటే ఆయేర్పాట్లకు మా మాజీశక్రటరీ గారు వున్నారులెండి.'

ఎలక్ట్రీషియను ఆనందరావు - 'అంతా మా చిన్నమేష్టరుగారి చలవ. ఆయన సంఘకార్యకలాపానికి కావలసిన డబ్బు సమకూర్చ టంలో ఘనులు. ఎంత అవ్యవధికానీ, మాటయిచ్చారంటే చాలు!'

చిన్నమేష్టరు - 'అయ్యో! డబ్బుకావలసొచ్చినపుడల్లా పొగడ్డం పిళ్ళకిదో అలవాటు. వెట్టిచాకిరీకి వెనుకాడేవాళ్ళుంకాదు.'

ఎలక్ట్రీషియను - 'క్షమించాలి. వీరిద్దర్నీ పరిచయంచెయ్యటం మర్చిపోయాను. ఇక్కడ పోర్టర్లుగా పనిచేస్తున్నారు. ఈవేషంలో వీరిని మీరు పోల్చుకోలేరు. ఇందులో వొకరు హరికథలు బాగా చెప్తారు. రెండో ఆయన ప్రసిద్ధనటకుడు. పేర్లు మూర్తీ, రావు.'

'హా!' మీరా ఆశ్చర్యపోయింది.

కృష్ణమూర్తిగారు వాళ్ళిద్దర్నీ దగ్గరకు పిలిపించుకుని - 'మనమంతా వొకటూటం నాయనా! ఛోటా కళారాధకులం. కొనప్రాణంతో గిలగిలా కొట్టుకుంటున్న కళాసంప్రదాయాలు, రీతులూ మనకోసమే మిగిలి వున్నామంటున్నాయి.'

ఆనందరావు చెప్పాడు - 'మా వర్క్‌షాపుల్లో తబలా వాయించే వాళ్ళు, హార్మోనిస్టులు, బుర్రకథలుచెప్పేవాళ్ళు, చిన్నచిన్న కవులూ, నాటకాలు రాసేవాళ్లూ, వేసేవాళ్లు పిళ్ళకి లెక్కలేదు. చూస్తారుగా మీరిక్కడ వుండి-'

చిన్నమేష్టరు - 'మీరెందుకొచ్చారో చెప్పారుగాదు.'

ఆనందరావు సింహాచలంతెచ్చిన టీ కప్పుల్లోపోసి అందిచ్చాడు.

'మా సింహాచలం పెద్ద ఫుట్‌బాల్ ప్లేయరండి. పిడికీవుద్యోగం ఫుట్‌బాలొవల్నే వచ్చింది. కలకత్తాలో ఆడి వచ్చాడు.'

కృష్ణమూర్తిగారు చెప్పారు - 'మేం యిక్కడ ఎన్నాళ్ళుండేదీ యింకా నిర్ణయించుకోలేదు. మా కర్రా కంపా సామాన్ను చూశారుగదా! ఈవిడ మీరా - చలవరాతికొండలు బొమ్మలు వ్రాసుకుందామని వచ్చింది. కనీసం ఒకవారమన్నా పట్టుంది.'

చిన్నమేష్టరు చాలా సంతోషించాడు - 'ఆనందరావుగారూ, మన వాళ్ళకేం కావలసినా చూసే బాధ్యత మీది. మరి నేను వెళ్తున్నాను. బస భోజనం వగైరా యేర్పాట్లు మీకెల్లా కావలిస్తే అల్లా....'

మీరా అడిగింది - 'అక్కడ చౌడాఘాటుదగ్గరలో వుండటానికి యేమీ వసతి దొరకదా ?'

ఆనందరావు యింకా చెప్పనివ్వకుండానే నల్లగుడ్లల్లో మూర్తి - మీ వసతి భోజనం గురించి మీరేంచింతపడకండమ్మా. చౌడాఘాటులో గవర్నమెంటు వసతి వుండనేవుంది. బోటువాళ్ళు, మీకన్నీ చూపించడం, త్రిప్పడం ఆనందరావుగారే చూస్తారు. ఆయనకి చాల సరదా-'

'ఒక్క గంటలో వస్తాను. విశ్రాంతితీసుకోండి.' ఆనందరావు టంచనుగా గంటపోయాక తిరిగివచ్చి 'కారు రడీగావుంది. పదండి, కాని దమ్మిడీయివ్వనక్కర్లేదు. బసలో మన చిత్తం....డబ్బు కర్చుపెట్టి యెంతకని దేశాటనం, కళారాధన చేస్తామండి?' అని సామాన్లు అందుకున్నాడు. తలొకటీ పోర్టర్లుపచ్చి సామాన్లు చిన్నకారులో సర్దారు. అందులో ఏవో కొత్తగిన్నెలున్నాయి—

'ఇవేమిటండీ ?' - అంది మీరా.

'గిన్నెలండీ, ఏదన్నా వండుకోటానికి, నీళ్ళుకాచుకోవటానికీ, పాలూపెరుగూ తెచ్చుకోవటానికీనూ. స్టవ్‌కూడా వేశాను మాయింట్లోంచి తెచ్చి. దారిలో మనం కొనవలసినవస్తువులు లిస్టుతయారుచేశాను. ఒకటీ మర్చిపోడానికి వీల్లేదు. ఒకటీ పొల్లురాకూడదు. రెండు రోజాయిలు తెచ్చాను. వెనకనున్నాయి. కప్పుకుందుకు యేమీ యేర్పాట్లుచేసుకోకుండా ఎల్లావచ్చారండీ ?'

'మాకేమీ తెలీదండీ! మీఆదరణా మర్యాదా చూస్తూంటే ఆశ్చర్యంగావుంది. ఇంతపనేవిటండీ యిక్కడ ?'

అంతా కూర్చున్నారు. దుకాణాలవద్ద కొంచెంసేపు ఆగి కావలసి నవి కొని పడేసుకున్నారు. మళ్ళీ కారు బయల్దేరింది. మంచు కరిగిపో తోంది. ఎండ వస్తోవస్తోవుంది. మనుష్యులు బాహాటంగా వీధుల్లో తిరగటంలేదుకూడాను. ఎత్తూ మళ్ళీ పల్లం, గుట్టలు, కొండలు, పాడు పడిన కట్టడాలూ, దట్టంగా పచ్చగా యిరువైపులా చెట్లూ....ఆనందరావు అవీయివీ చూపిస్తున్నాడు ఏవో చెబుతూ. మీరా అంతా మర్చిపోయి తాను యీవాతావరణానికి యేనాడో అలవాటుపడ్డానని భ్రమపడాల్సివచ్చింది. 'మీకు డ్యూటీ లేదూ, మీకు చాలా శ్రమ కలిగిస్తున్నాము.' ఆనంద రావు అడ్డువచ్చి - 'అదేవిటండీ, నేను లేకపోతే మీరు మరోయేర్పాటు చేసుకుంటారుకాని వచ్చినకార్యం మానుకుంటారా? అదీగాక మాకు మీలాటి ఆర్టిస్టులపరిచయం ఎల్లాకలుగుతుంది చెప్పండి? నాచేతిలో వున్నది నేనందరికీ చేస్తాను. మీకూచేశాను.'

'చౌడాఘాటు ఎంతదూరమండీ?'

'పదమూడుమైళ్ళు. ఈచోటు రెండు విధాలుగా ప్రాముఖ్యమైనది. ఇక్కడే బావన్‌గంగ నర్మదానదితో సంగమిస్తుంది. ఇది చలవరాతి కొండలకుకూడా చెందుతుంది. అంతా కాళిదాసువర్ణించిన కైలాసం లాగుంటుందంటే నమ్మండి. ఎండలోచూస్తే కళ్ళు జిగేలుమంటాయి. ఆమెరుగులు, ఆనీడలు అవీనూ. వెన్నెట్లో అంతా కరగిపోతూన్నట్లు మధురాతిమధురంగా వూహించుకునేట్లు పాలబాతికొండలు అవుపిస్తాయి.'

'మరి రాత్రుళ్లు బోటులో తిరగనిస్తారాండీ?'

'చాలాకష్టం, సంపాయిద్దాం అనుమతి నెమ్మదిన—'

'వెన్నెట్లో రాత్రంతా తిరక్కపోతే ఎందుకండీ వచ్చి—'

'మంచులో బైటకు రాలేరు. ప్రమాదమని అధికారులూ వప్పుకోరు.'

'ప్రమాదమేవిటండీ! ప్రమాదం ఎక్కడలేదు? విమానాలు, రైలుప్రయాణాలు సురక్షితంగా వున్నాయా? భూమ్మీద బ్రతకటం యింతప్రమాదభూయిష్టంకాగా నీటిమీదవస్తే తప్పా? రానివ్వండి.'

'భృగుమహర్షి ఆశ్రమం పంచవటి తీర్థయాత్రాస్థలం యిక్కడే నండి. చూశారా - దారిపొడుగూతా అక్కడక్కడా తటాకాలు, అందులో బాతులు గుంపులుగుంపులుగా ఎల్లా తిరుగాడుతున్నాయో....'

'పోనీ మీవూరు వచ్చినందుకు హంసలు చూపించకపోయినా, బాతులన్నా చూపించారు.'

'ఏనుగులు పాలరాతిగోడల్లో ప్రతిబింబాలను చూసుకుని తమ ఆవరణలోకి ఏవో క్రొత్తవి మొత్తంగా వచ్చాయనుకుని ఆ గోడలతో కుమ్ములాడేవట. అప్సరలు గోడల్లో నక్షత్రాల ప్రతిబింబాలను చూసి తమ మెళ్ళోంచి తెగిపడిపోయిన ముత్యాలసరాలనుకుని భ్రమపడేవారట.'

'భంగపడ్డానికి, భ్రమపడ్డానికి కవులకే చెల్లింది? త్రినేత్రుడి అట్టహాసంతో పోల్చాడు కాళిదాసు కైలాసాన్ని. ఇక్కడ నాగపూరు దగ్గర రామటేక్ అని ఒకచోటువుంది. అక్కడనుంచి అలకాపురిలో వున్న తన ప్రియురాలికి యక్షుడు మేఘసందేశమంపాడు. ఈ ఆరణ్యాలు, కొండలు, గుట్టలు, సెలయేళ్ళు అనాదినుంచీ కళాకారుల్ని వుత్తేజపరుస్తూనే వున్నాయి.'

'అదేవిటండీ ఆచప్పుడు ఆహోరు....'

'ధూమధార అంటారు. జలపాతం! ఇక్కడికి ఒక మైలు దూరంలో బనగంగ నర్మదతో కలియటమే ఆరొద, అదే మీరు వింటున్నది. అసలిక్కడంతా ఆ బనగంగను సరస్వతి అనే పిలుస్తారు.'

కారు మెల్లగా మళ్ళీ జనపథంలోకి వచ్చింది. ఎత్తుగా, గుట్టలుగా మిట్టలుగావున్న ప్రదేశమంతా యిళ్ళు, చిల్లరదుకాణాలు, పాలరాతి వస్తువులు, సబ్బురాయివస్తువులు అమ్మేదుకాణాలతో యాత్రాస్థలపు హంగులు సర్దుబాట్లతో కలకల్లాడుతోంది. కారు రెస్టుహవుసులోకొచ్చి సరాసరి ఆగింది.

రెస్టహవుసు, అదే అక్కడి డాక్‌బంగళా, కొండమీద వరుచుకున్నట్లు వున్నచోట ఆ ఆరామగృహం నర్మదానదిలోకి తొంగిచూస్తూ వుంటుంది. ఆవెనుక ఆవరణలో చిటారున నుంచుని మీరా 'ఇవేనా

పాలబూతికొండలు....' కృష్ణమూర్తిగారు కుడివైపునుంచి దిగుపనున్న రేవును, నీటిమీదకమ్ముకుని అప్పుడే సూర్యకిరణాలకు విడిపోతున్న మంచుతెరలను అవలోకిస్తున్నారు.

ఆనందరావు - 'అవి లోపలదాక్కొన్నాయి. నదిమళుపుతిరిగితే బోటులో - అప్పుడుగాని దర్శనమివ్వవు. నేను బోటువాళ్ళతో మాట్లాడి వస్తాను. మనం ముగ్గురం బొమ్మలువ్రాసుకునే పరికరాలు కెమెరా యివేనా—'

'తినడానికి, వేడివేడి టీ ఫ్లాస్కులోపోసి - అన్నీ పెట్టుకోవాలి.'

'మరైతే ముందు స్నానాలు అవీ చేసి రడీగా వుండండి.' ఆనంద రావు రేవులోకి వెళ్ళాడు.

కృష్ణమూర్తిగారు పైగలురికార్డులు, గ్రామఫోను, బూళ్ళసంచులు పుచ్చుకుని రేవులోకి నడిచారు మీరాసహాయంలో. ఒక పడవలో ఆయన వక్కరూ కూర్చున్నారు. ఆద్మీలో రికార్డు వేసుకుని వింటున్నారు. పడవ చీమలా నడుస్తోంది. ముందుభాగాన కొండలు నల్లగా మామూలు గానే వున్నాయి. ఆనందరావు మరమరాలు, బఠాణీలు, జేబులోంచి తీసి నీళ్ళలోకి విసురుతున్నాడు. చేపలు ఎగురుకుంటూవచ్చి అందు కుంటున్నాయి. మిఠాయివుండలు విసిరాడు. గుంపులుగుంపులుగా చేపలు ఒకవుండను దొర్లించుకుంటూ కొరికేస్తున్నాయి. మీరా కెమేరాసర్దుకుని కూర్చుంది, చేపలతో ఆటలను వినోదంగా తిలకిస్తూ, బూళ్ల తెల్లగా, ఎర్రగా, పచ్చగా, నీలంగా, వూదాగా కనిపిస్తున్నాయి. ఆ అద్భుతాల్ని మాటల్లో చెప్పాలంటే—

నీలంగా, లోతుగా, గంభీరంగా పారే ఆ నదీజలాల్లోంచి లేచి స్వచ్ఛంగా తెల్లగా అంబరాన్ని చుంబించేటంత యెత్తున యిరువైపుల నుంచీ క్రమ్ముకున్న ఆ చల్లని, తెల్లని కొండల్ని చూస్తూంటే క్షణకాలం హృదయం స్తంభించినట్లవుతుంది. వినీలాకాశంలోంచి వెలుతురులు ఆ చలవబూళ్ళమీదకు లంఘిస్తూన్నప్పుడు ఆ చమకులు, ఆ విరుపులు ఆ కదలికలు ఆ మెరుగుల్లోని సొగసులు కంటికింపుగా, మనోహరంగా గోచరించకమానవు. ఆ బూళ్ళలోని వైవిధ్యాల్నిచూసి, నర్మదానది

యిక్కడ ప్రోగుచేసుకుని దాచుకున్న సొగసుల్ని చూసి, ప్రపంచం అసూయపడకమానదు. వెండిబంగారాలఛాయల్ని విసురుతూన్నప్పుడు యిది కైలాసమా అని తోపించటంలో అసహజమేమీలేదు.

నోట మాట స్తంభించిపోయింది. అంతా గ్రుడ్లప్పగించి చూస్తూ కూర్చున్నారు. ఆనందరావు 'ఫొటోలు తియ్యండి.' అని హెచ్చరించాడు. 'అయ్యో, మర్చా....యిందులో వేసినది రంగుఫిల్ముకూడాను.' అని లేచినిలబడబోయిందిమీరా. బోటువాడు నించోవద్దని వారించాడు. ఆనందరావుని పట్టుకోమని అడిగింది. మీరాను అతడు తూలకుండా పట్టుకున్నాడు. ఆ బొళ్ళలో మైలున్నర చంక్రమణంచేశాక చప్పట్లు చరుస్తూ - 'మాస్టారూ ఈకొండల్ని డబ్బాలోకి పట్టాను.' అని మీరా వుత్సాహంగా కేకబెట్టింది.

# 19

ఈ నర్మదానరస్వతుల సంగమం కుదుట్లో అంటే - అటుచూస్తే చలవరాతికొండలు యిటుచూస్తే, ధూమధార జలపాతం హోరు, యీ రెంటినీ కట్టేసుకున్నట్లుగా ఎత్తుగా కొండమీద గౌరీశంకరాలయం, ఆలయాన్నిచుట్టి చౌశట్‌యోగినుల బొమ్మలు, అంటే శక్తినికొలిచే యెనభై యిద్దరు యోగినుల వివిధభంగిమలు - ఎర్రయిసుకరాతితో మలిచినవి కనుపిస్తాయి. ఈ ఆలయం బహుపురాతనమైన కట్టడాల్లో వొకటి. కాలచూరి, చేది వంశీయుల పాలనలో పన్నెండవశతాబ్దపు దరిదాపుల్లో కట్టబడిన యీదేవాలయంలోని ఎనభై రెండు యోగినుల వివిధభంగిమలూ, శిల్పాకృతులూ చాలావరకు పదహారోశతాబ్దంలో అసఫ్‌ఖాను ముట్టడించి పూర్తిగా ధ్వంసంచేయబడ్డాయని చెబుతారు. ఈ యోగినుల విగ్రహాలు కొన్ని ఎర్రరాయి, కొన్ని పసుపుపచ్చ, ఆకుపచ్చ రాళ్ళతో చెక్కబడ్డం చూపరులకి చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తూంటుంది. చలవరాతి కొండల మధ్య నిద్రపోతున్న నర్మదానది, ఈ గౌరీశంకరుడి ఆలయంలో

పసుపు, ఆకుపచ్చ, ఎరుపురంగుల్లోని భిన్నమూర్తులు - రేకెత్తించిన వుత్సాహపు నిషాలో వుభయులూ పడిపోయారు, భాగీరధిగారి కళ్ళ పడకుండా - ఆయన చిత్రించకుండా వదిలేసిన చలవరాతికొండలు మీరా దాహానికందుతున్నాయి.

రోజూ వుదయం పడవమీద సరంజామా వేసుకుని నదిలో నట్టనడాన యేర్పాటుచేసుకున్న గుట్టమీదకు పోవడం, ఎండలో, చలిలో, మంచులో ఆవొంపుల్నీ, సొంపుల్నీ కాగితంమీద కెక్కించటంలో పగళ్లు పరిగెడుతున్నాయి. మళ్ళీ ఆఅట్టల్నీ, కాగితాల్నీ రెస్టుహవుసులోకొచ్చి వ్రేలాడగట్టి కొసమెరుపులు సరిచేసుకోవటంతో చాలా పెద్దసైజుచిత్రాలు పది తయారవుతున్నాయి. కృష్ణమూర్తిగారు మెత్తని రాయి కొనుక్కు తెచ్చి వులితో ఎనభై రెంతుయోగినుల మూర్తులూ పలకలమీదకెక్కిస్తున్నారు. ఓ మాటాలేదు - మంతీలేదు. వీళ్ళకు మధ్యన ఆ అగాధంలో ఎప్పుడన్నా పాడేది సైగలు మాత్రమే. త్రాగేది తేనీరు. తినేది నాన్ రొట్టి. ఒక మహాయజ్ఞం జరుగుతున్నది!

ఉత్తరాలువస్తే చదవటానికీ వార్తలుచెప్పటానికీ సమాధానాలు వ్రాయటానికీ ఆనందరావు వున్నాడు. అతను అడపాతడపా లారీమీదో కారుమీదో వచ్చి చూసిపోతూంటాడు. ఉభయులూ ఆనందరావును చూడగానే చిరునవ్వు నవ్వుతారు. అతడే స్వయంగా లోపలకుపోయి గిన్నెలూ, డబ్బాలు అన్నీ తడిమిచూసి వాట్లను నింపుతూంటాడు. డాక్ బంగళా గోడలకు ఎగబ్రాకుతున్న చిత్రాలు రోజురోజుకీ క్రొత్తవిరుపులూ, మెరుగులూ, సొంపులూ తెచ్చుకొంటున్నాయి. వాచ్‌మన్ చెప్పాడు: ఒకరోజు వుదయంవచ్చి చూస్తే యిద్దరూ నేలమీద సొమ్మసిలి పడివున్నారట. ఒకరాత్రి రాత్రల్లా యిద్దరూ మేలుకునే వున్నారట. ఆనందరావు స్వయంగా చూశాడు: మీరా స్నానాలగదిలో తొట్టిలో వేడినీళ్లు నింపుకొని అందులోపడి నిద్రపోతూండటం! ఒకబొమ్మ తయారవుతున్నకొద్దీ రక్తమాంసాలు హరించుకుపోతున్నాయి. 'కమలాక్షు నర్చించు కరములు కరములు, శ్రీనాధు వర్ణించు జిహ్వా జిహ్వా, సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు, శేషశాయికి మొక్కు శిరము శిరము,

విష్ణు నాకర్షించు పీనులు పీనులు, షుకవైరి దనలిన మనము మనము-సరిగ్గా పోతనగారి పద్యంలో చెప్పినట్లనిపిస్తోంది వారికి. మరోవిషయం పైపు మనస్సు పోవటంలేదు. మరోపని చేతకావటంలేదు. వేరే ఆలోచనలు రావటంలేదు. బాహ్యప్రపంచంతో ఎటువంటి సంబంధమూ గిట్టటంలేదు. ఆఖరికి డబ్బులు లెక్కబెట్టు కోవటం కర్చులు చూసుకోవటంకూడా ఆనందరావుకే వదిలారు. స్నానం మర్చిపోలారు. భోజనం గురుతుండదు. బట్టలు మాసినది తెలియదు. మీరా చీరమార్చుకోవటం తలదువ్వుకోవడంకూడా మర్చిపోతున్నది. ఈ రెండుజీవాలకు అనందరావు గడియారము, అనందరావు భోజనము, ఆనందరావు స్నానము, ఆనందరావే బాహ్యప్రపంచము.

ధూమధారకు వరసగా మూడురోజులు వెళ్ళి చిత్రం పూర్తిచేసుకుని వచ్చింది. ఆమూడురోజులూ రాళ్ళలో, ఎండలో నిలబడినిలబడి కాళ్లు గుదులుకట్టాయి. అరికాళ్ళకు తొడుక్కున్న మేజోళ్ళు పిట్లి చినిగి వాలికలైనాయి. ఆ జలపాతం మీరా నిలువెత్తున రాసింది. దానికి 'ఉత్సాహం' అని పేరుపెట్టమన్నారు కృష్ణమూర్తిగారు.

వెన్నెల్లో ఆకొండలమధ్య వుండిపోవాలని పట్టుబట్టింది మీరా. రోజూ ఉదయమే వెళ్ళి సాయంత్రంకాగానే తిరిగి వచ్చేస్తూండేవారు. ఒకప్పుడు రెండుపడవలను తీసుకెళ్ళి వాటిని బంధించి కావలసినచోట కట్టేయించుకుని గంటలతరబడి డ్రాయింగుబోర్డుమీద పనిచేసేది మీరా. సాయంత్రం వుండిపోదామని బిగుసుకు కూర్చుంది. ఆలోయలోనికి వెన్నెలలు ప్రసరించటంచూడాలని ఆమెకు వుబలాటంగా వుంది. గుట్టమీద బొమ్మలూ సరంజామా వదిలేసి వచ్చారు. బోటువాడికి పది రూపాయలిస్తామని బ్రతిమాలారు. చీకటిపడగానే యిక్కడ యెవరూ వుండరాదని సర్కారువారి ఆజ్ఞ అన్నాడు బోటుమనిషి. ఇద్దరూ పెడ చెవిని పెట్టారు.

నిటారుగా లేచినిల్చున్న కొండకోనల్ను మేఘాలు చుట్టేసుకుంటున్నాయి. పాలవలె అమృతంలా వెన్నెల వచ్చింది. చాతక పక్షుల్లా త్రాగుతున్నారు. ఆహారము నిద్రాభయాలు పోయినాక శరీరాలకి అమృత

ధారలే జీవాన్ని పోస్తున్నట్లున్నాయి. గ్రామఫోను, రంగులు, కుంచెలు, బొమ్మలకాగితాలు నీటిమధ్యలో గుట్టమీద వదిలేసి చాలాదూరం లోప లికి వచ్చారు. నీళ్ళు నలువులు విప్పుకుంటూ తళతళలు చిమ్ముతున్నాయి, పడవ చల్లగా సుతారంగా తేలియాడుతున్నది. ఆ పసిమివెలుంగుల మిలమిలలు, అందులో అందంగా ప్రతిఫలిస్తున్న తెల్లటి కొండలు - కైలాసంలో వున్నట్లుంది వారికి. చక్కిలిగింతలు పెట్టినట్లుగా వుంది. నర్మదాతల్లి చిరునవ్వులో మునిగిపోతున్నామనుకున్నారు. పడవ తెడ్డును లాగుతున్నప్పుడు హుంకక్కిమనే ధ్వనులు, బుడగలు, ముందుకు త్రోసుకు పోతున్న పడవ, యివి మినహా మరేమీ శబ్దంకాని వంరంకాని లేదు.

అకస్మాత్తుగా దూరంలో ఎర్రటి మంటలు లేచాయి. ధూమం లేచింది. 'అమ్మబాబోయ్-' అని అరిచాడు పడవవాడు. 'ఏమిటేమిటని' అడిగారు కృష్ణమూర్తిగారు, మీరా. పడవవాడు గగ్గోలుగా దిశలు మారో్మ గేలా కేకలుపెడ్తున్నాడు. ఏమివుపద్రవమో అర్థంకాలేదు యిద్దరికీనూ! అల్లంతదూరంలో ఆకాశంలోనికి లేచినమంటలు, చుట్టేసుకుంటున్న పొగ, అర్థంకాని కేకలు! నావ వూగిసలాడిపోతున్నది నీళ్ళలో! పడ వను వెనక్కు మళ్ళించకుండా విస్సురుగా యింకా లోపల్లోపలికి లాక్కు పోతున్నాడు.

కృష్ణమూర్తిగారు అరిచారు - 'గుట్టమీదకుమళ్ళించు, సామానులు, ఫోను, బొమ్మలూ అన్నీవున్నాయి.'

'ఇంకేమిసామాను - ప్రాణాలు దక్కించుకోటానికి చూస్తున్నాము. ఈకొండలలో తేనెపట్లు వున్నాయి. రాత్రిళ్ళు మంటలుపెట్టి తేనెపట్లు పడగొడ్తారు, మనంపెళ్ళేదారిలో మంటలుపెట్టారు, పొగలేచింది. యిక తేనెటీగలు విజృంభించి మనల్ని కుట్టిచంపుతాయి. ఈనీళ్ళలో యిప్పుడు తప్పించుకునే మార్గంలేదు. భగవన్నామస్మరణ చెయ్యండి! అంతే - అంతే!' అన్నాడు బోటుమనిషి.

ఇద్దరూ నిశ్చేష్టులైపోయారు. క్షణంక్రితం మహోల్లాసంగా మైమరపించినప్రకృతిహొయలు దారుణంగా,భయంకరంగా మారిపోవటం అంతా చిత్రంగావుంది. కొండలు చేతుల్నిసాచి అట్టహాసం చేస్తున్నాయి.

తేనెటీగలతుట్ట ఝుంయ్‌మని కదిలి నలువైపులకూ విజృంభించటం ముగ్గురూ పోల్చుకున్నారు. రాళ్ళలో దాక్కునే యేర్పాటులేదు. ఒక వైపు కొండదార్లి పడిపోయి దారి మూసుకుపోయింది. ఆయి నావ వెడితే సుడిలో తిరిగి కొండను గ్రుద్దుకొని ముక్కలై పోవటం తథ్యం అని చెప్పాడు. తేనెటీగలు బోటును తరిమి వచ్చి పట్టుకున్నాయి. మీరా చీరను ముఖానికడ్డంగా లాక్కుంది. చేతులు కాళ్లు మెడమీద కుచ్చెళ్ళలో అన్నివైపులకూ ప్రాకి కరుస్తున్నాయి. కృష్ణమూర్తిగారి మొహాన్ని పట్టుకుని పీకుతున్నాయి. 'అబ్బో! అమ్మో!' హాహాకారాలు లోయలో ప్రతిధ్వనిస్తున్నాయి. నావయిటూ అటూ వూగిసలాడిపోతు న్నది. దభాలున పెద్ద చప్పుడయింది. పడవనాడు నీళ్ళలోకురికేసాడు. మీరా కృష్ణమూర్తిగారూ పడవలో అడుగునపడి దొర్లిపోతున్నారు. కాఖాలీదానిమ్మపండు విచ్చినట్లు శరీరాలు విచ్చిపోయి నెత్తురులు కారు తున్నాయి. తెడ్డువేసేవారులేక నావ క్రమంగా ప్రవాహంలోకి సుడిలో పడి గిరగిరాతిరుగుతూ కొండరాతిని ఢీకొని మునిగిపోసాగింది. నావ అఖాతంలోకి జారుకుపోయేముందు మీరా కృష్ణమూర్తిగారు ఆ కొండ రాళ్లకు పట్టుచిక్కించుకోవాలని చేతుల్ని, కాళ్లను సాచారు. అంతా నాచు, నున్నగా జారుతూండటంవలన పట్టు చిక్కలేదు. అడుక్కి నీళ్ల లోకి జారుకుపోతూ వుభయులూ కావిలించుకున్నారు. నావ వారిమీద తిరగబడి బోర్లా సందులలోకి త్రోసేసింది. మళ్ళీపైన అంతా నిశ్చలంగా వెన్నెట్లో కరిగిపోతూన్న ప్రకృతి....తేనెటీగలు ఝుంయ్‌మని గోల చేయటం వినిపిస్తోంది. ముద్దబంతిపువ్వులా చంద్రుడు చూస్తున్నాడు. కటికచీకటి గాఢంగా నిట్టూర్చింది.

నర్మదానదిలో గుట్టమీద పైగలురికార్డుఖు, గ్రామఫోను, కుంచెలు, రంగులు, ధర్మాఫ్లాస్కు, మీరా స్కెచ్చిపుస్తకం పెనసళ్లూ వేస్తూవేస్తూ మంచుతగిలి చెడిపోకుండా నూనెకాగితంకప్పిన - 'వెన్నెట్లో చలవరాతి కొండలు' అసమగ్రరచనా, కృష్ణమూర్తిగారి సంచులూ యీ మహా ప్రమాదానికి నిశ్శబ్దసాక్షులు!

ఎవరిదీ వొకబొట్టు కన్నీరు కర్చుకొనక్కర్లేకుండా శలవంటూ యీలోకాన్ని వదిలివెళ్లిపోయారు. తన అందచందాల్ని చెరబట్టడానికి వచ్చిన యిద్దరిమీదా ప్రకృతి కసితీర్చుకున్నట్లుంది.

డాక్‌బంగళా చీకట్లలో నిర్జీవ చిత్రమాలికలు రివటలుగొట్టే చలి గాలికి కసింత తృళ్లిపడి ఎగిరెగిరి గోడల్ను ప్రశ్నిస్తున్నాయి - 'వాళ్లేరీ? మావాళ్లేరీ?' అని. 'ధూమధార' హోరుగా ఎగిరెగిరిపడ్తోంది గోలగా యేడుస్తూ. కొండలన్నీ వికటంగా నవ్వుతూ పరస్పరం పల్కరించు కుంటున్నాయి. చంద్రబింబం సిగ్గుపడి మబ్బుదొంతరల్ని చాటుచేసుకుని నర్మదానదిని 'వాళ్ళేరీ?' అని ప్రశ్నిస్తోంది.

కాలిపోయిన తేనెపట్టులోనుంచి మైనం మధువూ తీగలుసాగి మెలికలుతిరిగి చుక్కలుచుక్కలుగా టప్పుటప్పుమని నీళ్ళల్లోకురుకుతున్న సవ్వడిమాత్రం వుండీ వుడిగీ వినిపిస్తోంది. మంచు శవంమీదిబట్టలా కప్పేస్తోంది యీ అఘాయిత్యాన్ని.

'యధానదీనా మహనోంబువేగాః సముద్రమేవాభిముఖాద్రవంతి.'

నర్మదానది అరేబియామహాసముద్రాన్ని కలుసుకుందుకు వుత్సా హంతో వేగంగా పరుగులుపెడ్తున్నది.

గౌరీశంకరాలయంలో చౌశట్‌దేవకన్యలు మహాశక్తిని నిలవేసి అడుగుతున్నాయి యిదేమిటీ అన్యాయమని?

సైగలు 'దుఃఖ కే' అని పాడుతున్నాడు.

సూర్యనారాయణ నిద్రలో పీడకలొచ్చి తృళ్ళిపడ్డాడు. శాస్త్రికి కలలో మీరావచ్చి వొళ్ళోకూర్చుని చేతుల్ని మెడచుట్టూ పెనవేసి 'మన పెళ్ళెప్పుడు-' అని అడిగింది. బాజాలు పల్లకీ మధువర్కాలు పల్లకీలో వధూవరులు ముసిముసినవ్వులు నవ్వుతుంటూ పాట్చుని వూరేగుతున్నారు. కళ్యాణంబొట్టూ, దిష్టిచుక్క, పెళ్ళికూతురు చిటికెనవ్రేలు పట్టుకుని తలకాయవంచుకుని వయ్యారంగా నవ్వుతోంది.

శాస్త్రి గాభరాగా నిద్రలేచాడు. మీరా అడిగింది: నాకు భయంగా వుంది - శాస్త్రిగారూ?' తను: 'అడగండి ఫరవాలే'దన్నాడు. 'ఒక షేక్‌హాండ్ యివ్వండి' అన్నది. తను కరచాలనంచేశాడు. ఆమె దైన్యంగా చూసింది. తరువాత రైలు కదిలిపోయింది.

'ఈనిరాశామయలోకంలో కదనశంఖం పూరిస్తున్నాను. అందుకో యీ చాచినహస్తం! ఆవేశింపు నాలో....' అబ్బ! ఎవరండీ రాసింది యీ ముక్కలు?

# 20

ఢిల్లీనుంచి టెహరాన్, టెహరాన్‌నుంచి ఇస్తాన్‌బుల్, అక్కడ నుంచి ఫ్రాంక్‌ఫర్ట్ (పశ్చిమజర్మనీ) ఫ్రాంక్‌ఫర్ట్‌నుంచి సరాసరి దిగడం పారిస్‌లోనే. గప్ఫ్‌స్ట్రీముపుణ్యమా అని ఫ్రాంసువాతావరణం మర్భ రంగామాత్రం అనిపించదు. బాగాచల్లబడిపోవటం అమితంగా వేడిగా వుండటం అనేదిలేదు. సంవత్సరం పొడుగూతా వచ్చేవాళ్లు వస్తూ వుంటారు. కాని చలికాలంలోనూ, వసంతంలోనూ పరాసునగరం బలే మజాగావుంటుంది. ద్రాక్షతోటల్తో, నారింజచెట్లు, అందమైన వివిధ రకాల రంగురంగుల పూలతో, వాట్లమీద నమాయకంగా గూళ్లుకట్టి జీవించే పావురాయిలజంటలతో పరాసునగరం యాత్రికుల్ని ఆకర్షించు కొంటుంది. పరాయిదేశాలనుంచి దిగబడిన యాత్రికుల్ని ప్రత్యేకమైన శ్రద్ధతో చాలాజాగ్రత్తగా మర్యాదగా చూడ్డం మీనాక్షి గమనించింది. కష్టమ్స్‌వాళ్లు పరహాలుతెచ్చుకున్న బుడ్లు లాగేసుకుని వెయ్యిసిగరెట్లు, నాలుగు పౌనుల ఇండియాపొగాకుతోమాత్రం బైటకు వదిలారు. ఢిల్లీలో వేయించుకున్న టీకాలు సలుపుతూండటంవలన సలుపుజ్వరంలా గనిపించినా క్రొత్తచోటు క్రొత్తవాతావరణంలో పడిపోగానే 'మీనాక్షి' సస్వం మర్చిపోగలిగింది. ప్రపంచప్రఖ్యాతిచెందిన యిక్కడి ఆరామ గృహాలు, విహారాలు, వసతుల్లో యిది వుందీ యిది లేదూ అని తడు ముకోనవసరంలేదు. ఈహోటళ్లు, రెస్టారెంట్లు యిదంతా మరో ప్రపంచం! వికారాలకి, వేషాలకి, సరసోక్తులకీ, చలాకీకి, అందానికీ, ఆనందానికీ ప్యారిస్ నిలయం. మనుష్యులు చాలాసరదాగా, తెలివిగా వ్యవహరిస్తారు. రెండు ప్రపంచయుద్ధాల్ని చూడటంవలన ప్రజలకు సునాయాసంగా యింగ్లీషు బోధపడ్డప్పటికీ విస్తారం మాట్లాడరు. ఈస్టరు

ప్రారంభంనుంచి అక్టోబరుమాసాంతంవరకూ హోటళ్ళలో చోటు దొరకడం దుర్లభం. ఎంత తక్కువలోనైనా వుండటానికి వసతిదొరుకుతుందనిచెప్పి వరహాలు చిన్నభవంతిలో గది కుదుర్చుకొన్నాడు. ఎక్కేటప్పుడు మీదకు లిఫ్టుమీద పోవచ్చుగాని దిగేటప్పుడు అంతా మర్యాదగా మెట్లుమీంచి రావలసిందే కిందకు. ఎవరైనా కనపడి పలకరించినా చిరునవ్వునవ్వినా వాళ్ళలో కరచాలనంచెయ్యడం యిక్కడి సాంప్రదాయమని చెప్పాడు వరహాలు. బయటకుపోయే ద్వారంపగ్గర నవుకర్లుంటారు. రాత్రి ప్రొద్దుపోయాక అతలుపులు తాళాలువేసేస్తారు.

భారత విదేశాంగకార్యాలయానికి పోతే అక్కడ పణిక్కరుగారి వద్ద పనిచేస్తున్న భారతీయుల్లో చాలామంది అరవవాళ్ళున్నారు. మీనాక్షి వరహాలు పారిస్‌లో 'యిడ్లీ, సాంబారు, దోశ' కావలిసొచ్చినపుడు వారిళ్ళకు ఫోనుచేసి దిగబడేవారు. అక్కడెవరూ సాధారణంగా మంచినీళ్ళు త్రాగరు. సారాయం అడపాతడపా కొంచెంకొంచెం పుచ్చుకున్నా పాలతో సరిపెట్టుకుపోయేది మీనాక్షి. ఫ్రెంచి కాఫీ బాగా స్ట్రాంగు. ఇండియా కార్యాలయంలో ఒక అరవహోటలు కనపడేసరికి మీనాక్షికి పంచప్రాణాలు లేచివచ్చాయి. కాని కర్మ - చిక్కు ఎక్కడంటే, అన్నానికి ఆధరువులకీ విడివిడిగా ఛార్జీచేస్తారు. ఒక భోజనం సుమారుగా నాలుగురూపాయలపైన తేలుతుంది ఫ్రాంకుల్ని మార్చి చూసుకుంటే.

ప్రపంచప్రఖ్యాతిచెందిన థియేటరు 'కమేడీఫ్రాంకెః' అది చూశాక 'దిగ్రాండు గుయిగ్నాలు' కి వెళ్ళారు. పారిస్‌వచ్చిన రసికావతంసులెవ్వరూ యీ థియేటర్లను విడిచిపెట్టరు. ఇక్కడ కామక్రీడలన్నీ స్టేజీమీదకువచ్చి ప్రదర్శనలిస్తారు. రోజులతరబడి యాత్రికులు యీ థియేటర్లలో యిక్కడి సుందరాంగులతో కామకళారహస్యాల్ని తరిచి తరిచి అమృతంసాధించినట్లు అనుభవాల్ని మోసుకుంటూ వెళ్తారు తమ తమ దేశాలకు. కాని మీనాక్షి తెలివైనది. ఇక్కడ ప్రణయమందిరాల్లో కామకళారహస్యాల్ని నేర్చుకుందుకు తాను రాలేదన్న విషయం యెప్పుడైతే స్ఫురించిందో ఆ రోజునుంచీ వరహాలుతో తిరగడం తగ్గించింది.

అతను అనుభవాలకోసం వచ్చాడు. తను జీవితానికొక అర్థం వెదుక్కుంటూ బయల్దేరింది. ఇండియాకార్యాలయంవద్ద వొక ఫ్రెంచి ట్యూటరును కుదుర్చుకున్నాక రోజూ దీక్షగా వ్యావహారికానికి పనికొచ్చే తగుమాత్రం ఫ్రెంచి నేర్చుకోసాగింది. మంగళవారాలు పారిస్‌లో మ్యూజియములూ కళాకేంద్రాలకూ శలవురోజు. తనతోకూడా తెచ్చుకున్న వయొలిన్‌మీద త్యాగరాజకృతులు వాయించుకుంటూ గదిలో వొక్కర్తీ కాలక్షేపంచేసుకునేది. ఎక్కడికైనా బైటకు పోదల్చుకుంటే టాక్సీలు దొరుకుతాయి. కాని పగలు పన్నెండు - రెండు గంటలమధ్య అవి యెటుపోతాయో ఆవైపుమాత్రమే యాత్రికుల్ని తీసుగెళ్తారు. తిరిగి రాత్రి పదకొండుదాటాక పగలురేట్లకు రెండింతలుఛార్జీ యివ్వాలి. మీటరుచార్జీయివ్వగా అందులో పదోవంతు డ్రైవరుకు మామూలు యివ్వడం ఆచారం. బస్సులు అన్నిరూట్లమీదా వుదయం ఆరున్నర లగాయతు రాత్రి పన్నెండుగంటలవరకూ దొరుకుతాయి. పారిస్‌లో సుగంధద్రవ్యాలు సెంట్లు తలనూనెలు కారుచవక. లేసులు, బాడీలు, చీనాగాజుసామాగ్రి, బ్లౌజులు రకరకాల ఫాషన్ల్‌వి బహుతక్కువధరల్లో కొనుక్కోవచ్చు. వానకోటుకూడా యెప్పుడూ దగ్గరుంచుకోవలసిందే! తెల్లరంగుజోళ్లు వేసుకుని వీధుల్లో నడవరాదు. ఇహ కళాభిమానులకు పారిస్ వైకుంఠమనే చెప్పాలి. వరాహాలూ మీనాక్షీ మొదట 'లోవిరే' మ్యూజియానికెళ్లారు, అక్కడనుంచి 'మోనాలిజా', 'వీనస్‌డిమిలో', 'మూజీడి ఆర్ట్ మోడరన్', 'రోడిన్ మ్యూజియం' తిరిగాక ఫ్రెంచి అస్తిత్వవాదులకుచెందిన 'కఫేడి ఫ్లొరె' కు వెళ్లారు. ఇంప్రెషనిజముకు చెందిన మ్యూజియం 'జ్యూడిపామే' దర్శించి తదనంతరం విహారాలు చుట్టుప్రక్కలా యేర్పాటుచేసుకుని కాలినడకను ఆర్కీడీ ట్రాంఫే.... అనామకయోధుడి స్మృతిమంటపద్వారంనుంచి మధ్యేమార్గంగుండా 'రాండ్‌పాయింటు' దాటి 'ప్లేస్ డి లా కంకార్డే' వరకూ నడిచి ఆ దారిలో ప్రభుత్వభవనాలు ఫ్రెంచిప్రెసిడెంటునివాసం చూశారు. ఇరుప్రక్కలా చెట్లతో కప్పబడ్డమార్గంతో, చుట్టూతాకనపడే సుందరదృశ్యాలు మార్గాయాసాన్ని కలిగించవు. మనదేశములో యాత్రికులు రాజఘాటు సంద

ర్శించినట్లు పారిస్‌వచ్చేవాళ్లు నెపోలియన్ సమాధి, అనామకయోధుడి స్మృతిమంటపం తప్పక దర్శించి శ్రద్ధాంజలి సమర్పిస్తూంటారు.

'మాంట్‌మార్ట్రే' చూడ్డానికి పంకపటింకప పీఠులతో చిత్రవిచిత్రమైన హోటళ్లలో బాగుంటుంది. ఎత్తున కొండమీదవున్నప్పటికి, నోటర్ డామ్‌వద్ద పీధుల్లో అమ్మే పేవుమెంటుపుస్తకాలషాపులకు లెక్కలేదు. రాజభవనాలువున్న ప్రదేశాన్ని 'సెయింట్ జర్మన్ ఎన్‌లా' అంటారు. రాజభవనానికున్న మైలున్నరపొడుగు టెర్రేసు అద్భుతమైన కట్టడం. బొంటలీవనంలో వున్న చార్ట్రెస్‌కెథడ్రెలుభవనం యొక్క అద్దాలకిటికీలు చూడ్డానికి యాత్రికులు ముచ్చటపడతారు.

ఈయాత్రలూ విహారాలు జల్సాలు వినోదాలు పీట్లవల్ల కలుగుతున్న ఆనందాన్ని అనుభవాల్ని ఎడమర్చిచూసుకుంటే 'మీనాక్షి'లో జిజ్ఞాస తృష్ణ పట్టుదల అధికమవుతున్నవి. వరహాలు యిష్టంవచ్చినట్లు త్రాగడం, రాత్రిక్లబ్బులవెంబడి తిరగడం....రోజురోజుకీ వ్యసనానికి బానిసైపోతున్నాడు. మీనాక్షి శిల్పంనేర్చుకుందుకు స్కూల్లోచేరేముందు యిద్దరికీ మాటామాటా వచ్చింది.

'నువ్వు అందులో చేరిపోతే మరి నాకు దిక్కెవరు?'

'మరి నేను ఆర్టిస్టును శిల్పిని కావడమెప్పుడు?'

'ఇది ఆర్టు కాదా - జీవించడం కళేగా - మస్తుగా సారాయంవేసి గట్టిగా నిన్ను చేతుల్లోకి లాక్కుని....వాలాట్‌సంగీతం వింటూ నాజూగ్గా మస్తాబయి కారుల్లో తిరగ్గ - '

'చాల్లే....డబ్బుపెట్టి అవన్నీ కొనుక్కోవచ్చు.'

'డబ్బుపెట్టేగా నిన్నూ కొనుక్కొచ్చుకొంది.'

'పాడైపోతావు'

'అంటే - '

'వొళ్ళుచెడుతుంది - అడాకానీముండల్తో తిరిగితే - '

'నీకెట్లాతెలుసు?'

'రాత్రిళ్ళు తాగొచ్చి పేల్తావుగా నోటికొచ్చినట్లు -'

'అప్పుడెట్లావుంటాను నేను ?'

'చెప్పనా - గేటువాడికి నేను రోజూ డబ్బులిస్తున్నాను, నిన్ను మెట్లమీదనుంచి గదికీడ్చుకురావటానికి. ఒకప్పుడు గుమ్మందగ్గిర కుప్పలా కూలిపోతూంటావు. ఎట్లాగో లాక్కొచ్చి మంచంమీద పడేస్తే దుంగలా కదలవు మెదలవు. టోపీతీసి కోటులాగూ విప్పి బ్లాంకెట్లోకి నిన్ను దొర్లించేసరికి నా తాతలు దిగొస్తారు. జోళ్ళు విప్పుతాను. అల్లాగే మంచంమీద ముడిపెట్టుకుని రాత్రల్లా ఆలోచిస్తూ కూర్చుంటాను. నిద్ర వస్తే నేనూ వొరిగి నిద్దరోతాను. మళ్ళీ మామూలు : లేచేసరికి కాఫీ చుక్క గొంతులోపడగానే ముఖం విప్పారుతుంది.'

'పాపం నిన్ను చూస్తే జాలివేస్తూంది. నాకోసం నీ కన్యాయం జరగటం దేనికి ? - స్కూల్లో చేరు. చిన్నదానివి, నీ కెన్ని కల లున్నాయో....అవి చూస్తూచూస్తూ చెరిపెయ్యటం ఘోరం !'

తరువాత మీనాక్షి ఆర్టుస్కూల్లో చేరింది. ప్రిన్స్‌పాలు మీనాక్షిని చేర్చుకుంటూనే యిలాగన్నాడు - 'నీ కిక్కడ మేమివ్వగలిగేది చాలా స్వల్పమని గ్రహించుకో అమ్మాయీ. ఇది వొక దుకాణమో, కర్మాగారమో, హోటలో, అల్లాగేఅనుకో....వొళ్ళువంచి పనిచెయ్యాలి. చేస్తా వనుకో....యిక్కడకాదు మరెక్కడ యే కళాకేంద్రంలో జొరబడ్డా నీకు యిచ్చే శిక్షణ పద్ధతి సంవిధానము అనుభవాన్ని మాత్రమే యివ్వగలదు. నీలో అజ్ఞాతంగా అణుమాత్రంకూడా సృజనాత్మకమైన శక్తి లేనప్పుడు యివన్నీ వ్యర్థం. మక్కీకిమక్కీ కాపీలు కొట్టడానికి, అనుకరణలు చెయ్యడానికి యింతప్రయాస అనవసరం. నీ కా సంస్కారం వుందోలేదో తేల్చుకోవడానికే యీ ప్రయత్నమనుకో........ఇదీ దీని రహస్యం ! విద్యలా అంటించుకు తిరిగేందుకు వీల్లేదు. అభ్యాసంవల్ల వచ్చేది కాదు. జన్మాంతరాల వాసనాబలం వుంటే ఆ వాణి పలుకుతుంది. ముందేచెప్తాను. నడు - '

మీనాక్షికి గుండె గుభేలుమంది. ఆ ఆవరణలోకి కాలుపెట్టగానే - ధ్వనించిన మాటలు వినగానే! స్టూడియోలో పార్క్‌వుంది. రకరకాల చెట్లు మంటపాలు, దారులూ అక్కడాఅక్కడా షెడ్లు వేసివున్నాయి. పనిముట్లు పరిచయంచేసుకోవడం, బ్రాంజదిమ్మలను చెక్కడిమ్మలను మోసుకుని పోజుల్లో నిలబెట్టడం, కోణాలు, వెల్తురులో వాట్లను వివిధ భంగిమల్లో పోల్చుకోవడం, బొమ్మల్ని చెక్కడం నేర్చుకునేముందు ఆకారాల నకళ్ళను అన్నివైపులనుంచీ డ్రాయింగుల్లో రాసుకోవటం, ఆ లెక్కలు....పీట్లలో ఛాక్కుముక్కలు పట్టా నేర్చుకోవటానికి అహోరాత్రాలు కృషిచేయాలిసొచ్చింది. మధ్యాహ్నం, వుదయం, సాయంత్రాలు వుపన్యాసాలుంటాయి. అంతా నిశ్శబ్దం నిండిన వాతావరణం. ఎవరూ యెవరితో పూసుపోకకబుర్లాడ్డం అనేది లేదు. ప్రపంచ ప్రఖ్యాతశిల్పాల నకళ్ళు పరిశీలించడం, ఆ కదలికలు ఆ రేఖలు ఆ వొంపుల అర్థాన్ని వెతుక్కోవటం.........గొప్ప కుస్తీ పట్లు మేధస్సుకి. ఐనా శిల్పికీ, చిత్రకారుడికీ వున్న భేదం యెక్కడంటే ఒక బొమ్మ వ్రాయటానికి కావలసిన మేథాశ్రమ ఎక్కువగానూ శారీరక శ్రమ తక్కువగానూ చిత్రకారుడు పొందితే శిల్పి హెచ్చు శారీరకమైన కృషి తక్కువ మేథాశ్రమతో పనిచేస్తాడు. ఇది సులువుగా చెప్పాలంటే - ఒక రాతినుండిగాని, బ్రాంజముద్దనుండిగాని అనవసరమైన భాగాల్ని తొలగించి తనకు కావలసిన ఆకారాన్ని యేర్పరచుకుంటాడు శిల్పి. ఈ అత్యధికభాగాల్ని రాతినుంచిగాని. బ్రాంజ్‌ముద్దనుంచిగాని వేరు చేసేటప్పుడు తన చేతుల్లో బలాన్ని వినియోగించుకుంటూ సుత్తీ, శానం వులిలాంటి పనిముట్లద్వారా పనిచేస్తాడు. ఈ సుత్తిదెబ్బలు వులితో వొంపుల్నితియ్యటం చాలావరకు యాంత్రికంగానే కృషి జరుగుతుంది. చెమటపడ్తుంది. ఆ రాళ్ళముక్కలు, దుమ్ముధూళి ముఖాన్ని కొడ్తుంది. అలసిపోవటం దుస్తులు మన్నుగొట్టుకుపోవడంలాంటివి సామాన్యం. మరి సూర్యనారాయణగాని, మీరాగాని, భాగీరథిగారుకాని బొమ్మలు చిత్రించడానికి కూర్చున్నప్పుడు యింత అవస్థ పడ్డారా? లేదు.

వాళ్ళ నాజూగ్గా బట్టలువేసుకోవచ్చు. చక్కని సున్నితమైన కుంచెను చేత్తోపుచ్చుకుని బొమ్మ వ్రాయటానికి నిలబడేవారు. ఆ కుంచెను చక్కటి రంగుల్లో ముంచి తీస్తూవుండేవారు, ఆ స్టూడియోలో చిత్రరచన చేస్తూన్నప్పుడు వాతావరణం ఎంత నిశ్శబ్దంగా వుంటుంది? సుత్తిదెబ్బలు, బొళ్ళపగిలేచప్పుళ్ల వినపడవు. పాటలు, పద్యాలు పాడ్తారు. పెద్దపెద్ద వాళ్ళు వస్తే నాజూగ్గా సంభాషణలు సాగుతాయి. ఇంట్లో సుందరమైన చిత్రపటులు గోడల నలంకరిస్తాయి. ఈ సుత్తిదెబ్బలచప్పుళ్ళమధ్య ఆ ఆనందమూ విశ్రాంతి, దర్జా యెక్కడున్నాయి? రోడిన్ యేమన్నాడు - శిల్పం నిమ్నోన్నతాల సమీకరణమని. గోళాకారంగావుండే వస్తువుమీద పనిచేసేటప్పుడు ఆ శిల్పం అన్నివైపులనుంచీ చూడ్డానికి బాగుండాలి. నిమ్నోన్నతాలు కలుసుకునేటప్పుడు వాతావరణంలోంచి పడే వెల్తురు వల్ల యేర్పడే నలుపుతెలుపులుకూడా చూసుకుంటూ వుండాలి. ఐతే బొమ్మలువ్రాసే వ్యక్తికూడా యీ సాంకేతికవిషయాల్లో అశ్రద్ధగా వుండటానికి వీల్లేదు, వుండరుకూడా. ఆకారాల్ని మలచటంలో ఎగుడు దిగుళ్లుకూడా శిల్పి చూసుకోవాలి కనుక యీ విషయాల్లో చిత్రకారుడికి మల్లేనే శిల్పి కాస్త మేధాశ్రమ పడతాడు. కాని వస్తువుయొక్క భౌతికమైన స్వరూపాన్ని శ్రద్ధాసక్తులతో గమనించడంవరకే యితడి శ్రమకు పరిమితి. ఒకవేళ అశ్రద్ధగా ఎక్కువచెక్కి అవసరమైన భాగాన్ని అత్యధికంగా తొలగించినా వుంచినా ఆ నేరం అతడి అజ్ఞానానికి రుజువు. అది శిల్పానికి ప్రత్యేకలక్షణం కాజాలదు. మీనాక్షిని ఆచార్యులు, నువ్వు పాలరాయి ధ్వంసంచెయ్యటానికి పుట్టావు అని కసురుకున్నప్పుడు వలవలాయేడ్చేసేది. ఆచార్యులు మళ్ళీ సముదాయించి చెప్పేవారు - 'నువ్వు కంటితో చూసి పుజాయింపులు కట్టడం మానెయ్యి అమ్మాయి. మనస్సుతో పనిచెయ్యి! కంటికి సరిపోయినట్లున్న కొలతలు సర్వథా అవకరపు మూర్తుల్ని తయారుచేస్తాయి. నేనిల్లాగనుకున్నాను, అల్లా గనుకున్నానంటే కుదరదు. బొమ్మ తయారవుతూండగానే ఎక్కడ కక్కడ కొలతలు సరిగావున్నాయో లేదో చూసుకుంటూవుండు. బొమ్మలు

వ్రాసేవాళ్ళకు పదివిషయాలున్నాయి గమనించేటందుకు - వెలుగు, చీకటి, రంగు, పదార్థం, ఆకారం, స్థితి, దూరము, దగ్గరా, కదలిక, అపలము. ఇంత అవస్థ యెక్కడుంది శిల్పానికి. శిల్పి పదార్థం, ఆకారం, స్థితి కదలిక, అచలము వీటిలోనే సరిపుచ్చుకుంటాడు. వెల్తురు, చీకటి వీట్లకోసం తంటాలుపడనక్కర్లేదు. ప్రకృతే సమకూరుస్తుందాయె. రంగుప్రసక్తి లేదుగదా. దూరతీరాలవిషయంలోకూడా శిల్పాలు అర్థాకృతుల్లో వుంటాయిగాని బొమ్మరోలా పొకవారావరణంలో యిమిడి పోవు గదా! అంచేత యిందులో బుర్ర బద్దలుకొట్టుకోవానికేమీలేదు మీనాక్షీ.'

మీనాక్షి యెప్పటికప్పుడు రోజువారీవిశేషాలు వరహాలుచెవిని వేస్తూవుంటుంది. వరహాలు స్కూలుకి వస్తాడు. మీనాక్షి డ్రస్సింగు రూములోంచి టాయిలెట్టయి వస్తుంది. ఇద్దరూ కారుమీద చక్కర్లుకొట్టి వస్తారు. ఇది విశ్రాంతివేళ్ళల్లో. ఒకప్పుడు లోపల్నుంచే కబురు వస్తుంది, రావటానికి వీల్లేదని. హతాశుడై కాఫీడ్రుసుంటూ వెళ్ళిపో తాడు. ఆ వెళ్ళటం ఏ 'సెయింటులాజరే' స్టేషనుకో పోయి కూర్చుం టాడు. పారిస్‌లోపలా, చుట్టుప్రక్కలనుంచీ రోజూ అన్నివైపులకూ సుమారు రెండులక్షలమంది ప్రయాణీకులు యెక్కిదిగుతారు. యాభై కిటికీలదగ్గర టిక్కట్లు అమ్ముతారు, సాయంత్రము అరూయేడు గంటల మధ్య తొడత్రొక్కిడి చెప్పడానికి వీల్లేదు. ఆ ఒక్కగంటలో అరవై మూడు రైళ్లు అన్నివైపులకూ బయల్దేరుతాయి. లాజరేస్టేషన్లో యిరవై ఆరు ప్లాటుఫారాలున్నాయి. ప్రతిమూడునిమిషాలకీ ఎలక్ట్రిక్ ట్రైన్ బయల్దేరుతుంది. ఒకప్పుడు మీనాక్షి వెతుక్కుంటూ అక్కడకువస్తుంది. ఇద్దరు ఆ చుట్టుపట్ల ప్రఖ్యాత విహారస్థలాలకు వెళ్ళివస్తారు. ఫ్రాంసు యొక్క క్రీడారంగమని పేరుమోసిన 'రివేరా' చూడ్డానికెళ్లారు. ఈ 'రివేరా' ట్యులాన్‌నుంచి యిటాలియన్ సరిహద్దులవరకూ ప్రాకి వుండు గూతా పర్యటనకు అనుకూలమైన నీస్, కానెస్, మెన్టన్, ఈడెన్‌రాక్ తర్వాత మొనాకోప్రాంతంలో జూదానికి, వినోదానికి జగత్ప్రసిద్ధికెక్కిన

'మాంటికార్లో' వచ్చారు. ఈ మాంటికార్లోకి వెళ్ళడానికి నీస్‌గుండా మూడుమార్గాలున్నాయి. ఏరోడ్డున వెళ్ళినా దృశ్యాలు, కొండలు, మలుపులూ ఆహ్లాదకరంగానేవుంటాయి. బార్‌లో యిద్దరూ కాస్త చుక్క వేసుకునే బయల్దేరారు. కార్లో వరహాలు సిగరెట్టు యిచ్చి నిప్పుపుల్ల ముట్టించాడు. మీనాక్షి వొత్తుజుట్టు లుంగలుగా భుజాలమీద పడ్తోంది. సిగరెట్టుపీలుస్తో 'నా ప్రయత్నాలన్నీ పాడవుతున్నాయి. ఇంతశ్రమా వృథా అనిపిస్తోంది. నా ప్రతిబొమ్మలోనూ తప్పులు కొల్లలుగా వస్తు న్నాయి. కాపీచెయ్యాలనొచ్చినపుడు యాంత్రికంగా అన్నీ కుదురు తున్నాయి. ఫరవాలేదని ధైర్యంకలుగుతుంది. మళ్ళీ ఏదన్నా ఐడియా తీసుకుని పనిచెయ్యబోతే ఎక్కడా తలాతోకా అందకుండావుంది.'

వరహాలు నవ్వాడు 'నీకు సొంతంగా బొమ్మలుచేసి పేరు అప్పుడే సంపాదించాలనుంది. తొందరవల్ల పాడుచేసుకొంటున్నావు. నేను ఫుట్‌బాల్ ఆడేవాణ్ని. ప్రతిమాచ్‌లోనూ నేనే గోలుకొట్టాలనుకునే వాణ్ని. ఆ బంతి నా కందగానే యే స్తంభాన్నో బైటకో తన్నేసి అపహాస్యంపాలయేవాణ్ని.'

'నువ్వు చెప్పేది టీమువర్క్. అందరం కలిసి పనిచేసేటప్పుడు యేలోటూ వుండదు. బస్టు పనికూడా చక్కగా జాగ్రత్తగాచేస్తాను. సొంతంగా వూహించి మనస్సంతా లగ్నంచేసి యేదన్నా రూపాన్ని దించుదామంటే సవాలక్షలోపాలు....'

'శిల్పి అంటే యించుమించు కూలీఅనుకో - వొళ్లువంచి కష్టపడ కుండా అందులో మనస్సు పెట్టకాడూ యెందుకు లగ్నంచెయ్యటం?'

'చాల్లే....నువ్వు నోరుమూసుగుందూ. ఏదన్నా శిల్పం నిలబడ్డంత కాలం పెయింటింగు వుంటుందీ? విగ్రహానికి నిప్పూనీరూ భయమన్నది లేదు.'

'ఐతే శిల్పాలు చెక్కుదరకుండా వుండటంకూడా మీ ప్రతిభే నేవిటి? జాతికిగాని భ్రాంతికిగాని ప్రకృతిసిద్ధంగా ఆ లక్షణం వుంది.

దానిమీద ప్రజ్ఞ చూపెట్టేశిల్పులు ఆ జాతియొక్క గుణాన్ని తమప్రతిభగా చెప్పుకోవటం సిగ్గుచేటు.'

'శిల్పం చిత్రకళకన్నా తక్కువరకం అంటావు ?' అంది మీనాక్షి వుక్రోషంగా.

'తప్పకుండా ! నీకు జామెట్రీ రాదనుకుంటాను. పోనీ పెర్‌స్పెక్టివ్ అంటారుతెలుసునా' వేళాకోళంగా నవ్వాడు.

'అబ్బే, నేను వట్టి మొద్దుని.'

'మీ శిల్పాలకు రెండుపైపులే వుంటాయి - ముందూ వెనుకా. కాని దృష్టికి యెన్నికోణాల్లో వస్తువు అనుతుందో అన్నీ తెలిసి వ్రాస్తాడు బొమ్మను యే ప్రఖ్యాతచిత్రకారుడన్నా. ఒక గొప్పశిల్పంలో దృష్టి భేధాలన్నీ సమైక్యత చెందుతాయి. పోనీ చెప్పు - ఒక అమ్మాయిని నిలబెట్టి బొమ్మను చేస్తున్నావనుకో - ఆ వొంపులు సొంపులు కొలతలు ముందూ వెనుకా సరిపోతే నీ పని తృప్తికరంగావుంటుంది అవునా ?'

'అంతే - అన్నీ సమంగా వచ్చితీరాలి.'

'ఇక విభిన్నకోణాల్నుంచి అనేకరకాల కాంతుల్లో అదే వస్తువుని వివిధపరిసరాల్లో యేది నూతనం అత్యుత్తమమో యెంచుకుని అదే విధంగా బొమ్మరాసే చిత్రకారుడు మీకన్నా చాలా గొప్పవాడు. ఎక్కువ మేధస్సునుపయోగిస్తాడు. అందుచేతే చిత్రకారుడికి శిల్పం త్వరగా వస్తుందంటారు.'

'పోనీ నీ తలతిక్క అంతా వుపయోగించి చిత్రకళమీద యేదన్నా అవకతవకగ్రంథం రాసిపారెయ్యకూడదూ ?'

'వొద్దు. మనచేష్టలతోనూ మన అభిప్రాయాలతోనూకూడా యితరులని బాధపెట్టడం నాకు గిట్టదు.'

'శిల్పి బొమ్మలో ఏదన్నా తప్పు చేశాడనుకో, అదిక సరికాదు. చిత్రంవేసేటప్పుడు లక్షమార్లు చెరిపి రాసుకోవచ్చు.'

'పొరబాట్లు సరిచేసుకోవటానికి వీల్లేకపోవడంచేత శిల్పకళ గొప్పదంటావు ? లక్కగాని మరో ముద్దలాటిదానితోగాని ప్రతి తయారు

చేసేటప్పుడు అతకడాలు తగ్గించడాలు అయాకే విగ్రహాలు పోతపోస్తారుగా - నాకు తెలీనట్లు చెబుతావు ? పాలరాతిశిల్పానికి నీవు చెప్పిన కష్టం వుంటుంది. కాని నువ్వు వెయ్యిచెప్పు, లక్షచెప్పు, చిత్రకళకున్న ప్రత్యేకలక్షణాలు, విశిష్టత శిల్పానికి ఒక్కనాటికీరాదు. వ్రాసినబొమ్మ చూడ్డానికి చాలా అందంగా వుంటుంది, రంగుల్తో. దాంట్లో వూహా కౌశల్యం కనుపిస్తుంది. తనలో ప్రకృతిలోని అనంతమైన వస్తుజాలాన్ని వివిధనన్ని వేశాల్ని యిముడ్చుకోగల్గుతుంది. చిత్రకళలో ఎన్నో గారడీ లున్నాయి. దూరంగావున్న వస్తువును దగ్గరిగా చూపించవచ్చు. అనంతమైన ఆకాశాన్ని, మేఘాల్ని, వర్షాన్ని, తుఫానుని ఎన్నైనా వూహించి నిర్మించవచ్చు. మరిక మాట్లాడకు-'

'అవున్లే....యిందులో శాస్త్రమేమీలేదు. గారడీల్లేవు. నాలాటి బండవాళ్ళకు సరిపోతుంది.'

'తప్పకుండా ! పదార్థంలోంచి అవసరాన్ని మినహాయించి తతిమ్మావి తొలగించి శిల్పి వస్తువుని నిర్మిస్తాడు. చిత్రకారుడు సర్వం అర్పించవలసిందే - ఖాళీకాగితమో. అట్టముక్కో, గుడ్డో - దానిమీద సాము - అస్తమానూ కొత్తకొత్త వర్ణాల్ని చేరుస్తూనే వుంటాడు.'

'నీకిన్ని లోగుట్లు ఎట్లాతెలుసు నా వరహా—'అంది చెంపమీద రాస్తూ.

'ఒక ముద్దియ్యి చెబుతాను.'

'కారులోనా....'

'మోంటికార్లో-'

'అప్పుడేవచ్చేసిందే - నీబాకీ అల్లావుంచు. ముందు దిగు-'

'అల్లదే మధ్యధారాసముద్రం - అదుగో కాసినో....'

'ఏవిఁ మిలమిలలు ? ఏవిఁ తళతళలు ?'

'లోపలంతా స్ఫటికశిలలు అద్దాలతో బిగించారు. ఏ హోటలుకి పోదాము చెలియా ?'

'హోటల్ డి పారిస్.'

'ఆతర్వాత చేయునదేమి?'

'రివేరాబీచ్చి పొడుగూతా ఊతాలాడ్డం, నౌకావిహారం, నీకిష్టమైతే నువ్వు చేపలు పట్టొచ్చు.'

'పడవపాటలేమన్నా జ్ఞాపకమున్నాయా?'

'నట్టనడిసంద్రాన నావలోవున్నాను....'

'చాల్చాలు. పద-పద!'

'ఎక్కడకు?'

'హోటర్ డి పారిస్-'

'కొవ్వొత్తి రెండుకొసల్నుంచీ కాల్తోంది.'

'నువ్వేకొవ్వువి, నేను వత్తిని-'

'ఐతే నేను కరిగిపోతున్నాను.'

'నేను కాలిపోతున్నాను.'

'ఇద్దరం వెలిగిపోతున్నాము.'

'ప్రపంచమును పరిహసిస్తాం!'

'భవిష్యమును పరిపాలిస్తాం-'

'హా ప్రేయసీ-'

'శ్రీశ్రీని గేటుబయట వదిలెయ్యి. హోటల్ డి పారిస్‌లో కొచ్చాం.'

'నువ్వు చెప్పినవాళ్ళందర్నీ వదిలేస్తూనే వచ్చానుగదా!'

'నార్మండీ వెళ్ళి రోన్‌లో జోనాఫ్ ఆర్కును తగులబెట్టినచోటు చూసిరావద్దూ?'

'ఇందాక పడవపాటన్నావు-'

'అవును.'

'నీకూ నీ వారు లేరూ - నాకూ నా వారు లేరూ....'

'చల్ మోహనరంగా - అట్లా దారికి రా!'

'ఇదేవిటీ టేబుల్ మీద - ఆర్డరు చేశావా ?'

'అక్కర్లేదు. నైటుక్లబ్బుల్లో చాంపైన్ బాటిల్ ప్రతిటేబులు మీదా వుండాల్సిందే. బ్రాందీ జాతీయమైన పానీయం! ఫ్రెంచివైన్, చాంపైన్, బ్రాందీలకు ప్రపంచంలో సాటిలేదు.'

'అంత మరీఎక్కువగా పట్టించకు.'

'నీకుచాలా....లే పియానో వాయిద్యం కెలటాల్లాతరుముకొస్తోంది.'

'ఏదీ, నీ చేయి కాస్త నాజూగ్గా అందియ్యి....'

'నుంచో, నడుంచుట్టూ చెయ్యి వెయ్యి! అడుగులు పడ్తున్నాయా ?'

'ఇదేమి భరతనాట్యమా - కథాకళీ అ....ఈ లైట్లు దేదీప్యమానంగా వున్నాయి.'

'తప్పించు - ఆ నీడలోకి నడుద్దాం - అడుగులు పడ్తున్నాయి! మన్నిచూసి యెవళ్లా నవ్వటంలేదుగదా ?'

'ఏడిచారు, ఏదీ, వోముద్దిలా పారెయ్యి....'

'జాగ్రత్త - మూతిమీద మరకలుపడేను.'

'దానిసిగ్గోసిరి .... నిలబడు. ఈ బుజాలు ఎంత నున్నగా వున్నాయో....'

'వికారాలుచాలించు-'

'పద, యీహాల్లోంచి బైటపడదాం - మెల్లెక్కు!'

'హాఁ, రడీ-'

'గదిలోకొచ్చామా ? మరోపెగ్గు బ్రాందీ వేసుకుందాం!'

'రైటో....'

'అదేవిటి యీగది తగలబడిపోతూవుంది ?'

'మనవిప్పుడీ లోకంలో లేము.'

'అమ్మదొంగా - గదంతా చీకటి చేసేశావ్ ?'

'లోకముతో మనకేటికి లోలాక్షి రా పోదము.'

'అదేమిటీ హోరు - సముద్రం పిలుస్తోంది.'

'కాదు - అది మన వలపు.'

'కిటికీలోంచి చూడు అవేమిటా దీపాలు పూగుతున్నాయి ?'

'పడవలు - పడవలు -'

'పాపం ! మానాన్నేమనుకుంటున్నాడో ....మాఅమ్మ నన్ను తిట్టి పోస్తోంది గామాలు ! ఎందుకట్లానవ్వుతావు ?'

'ఓసి....నా మీనా ?'

'నాకు నిద్రపడితే మాయింటికలలే వస్తాయి. నా చిలక అక్కా-అక్కా అని పిలుస్తోన్నట్లు - మా కాలవ - అమ్మా నేనూ చెరోబిందా పుచ్చుకు నీళ్ళకెళ్ళినట్లు....ప్రసాదు-'

'వాడెవరు ?'

'అప్పుడు నాటకం వ్రాయలే - ఆ కుర్రాడు.'

'ఆ పొడుగ్గా కొంగలా వుంటాడు !....'

'ఆ కొంగలా వున్నాయన శాస్త్రిగారు మా గురువుగారు,'

'అదేలే, వాడిమీద కన్నేసింది మీరా-'

'ఛా....ఛా....నీ నోటికి సుద్దీబద్ధం లేదు.'

'సరేలేచెప్పు....ఆ నీప్రసాదు-'

'ఆ-నా ప్రసాదు....నన్ను తప్పకుండా పెళ్ళాడేవాడు.'

'పెళ్ళాడి వాడి నాటకాల్లో నీచేత వేషాలు వేయించేవాడు. బ్రతికి పోయావు.'

'మేవిద్దరం వుత్తరాలు రాసుకునేవాళ్లం-'

'అంతేనా. మరేమైనా చేశాడా ?'

'తర్వాత నన్ను కుక్కముట్టుకుపోయింది.'

'ఎవరాకుక్క ?'

'కంగారుపడకు - వుట్టినే సామెతకన్నా !'

'నన్ను కుక్క- అంటావూ ?'

'అరె అంతకోపమైతే ఎల్లాగ ? శాంతం ! శాంతం !'

'ఛీ ! నీకు విశ్వాసంలేదు.'

'బాగుంది. నీకు విట్టు ఎంజాయి చెయ్యడం తెలీదు.'

'బోడివిట్టు - యిదేంవిట్టూ....'

'కంట్రీసైడు యిల్లాంటి విట్లే విసుర్తారు-'

'చెంప బద్దలుకొడ్తారు.'

'మరే పాపం - నువ్వేదో స్పోర్ట్సుమన్ వనుకున్నాను.'

'ఇదేవిస్పోర్టు....'

'మనం ఇటలీ వెళ్ళడం యేం చేశావ్ ?'

'నాశ్రాద్ధం-'

'మనకి తద్దినాలు మనవాళ్ళే పెట్టేసుంటారు.'

'నోరుమూసుకు పడుకుంటావా - తన్నమన్నావా ?'

# 21

రాకరాకవచ్చిన దీపావళి - వీణాపబ్లికేషన్స్ కార్యాలయంలో అంలా జంబుఖానాలు పరిచి కూర్చుని బేస్తాడుతున్నారు. మస్తాను, సూర్యనారాయణ, శ్రీహరి, ప్రసాదు, శాస్త్రి పేకాటప్రపంచంలో మునిగిపోయారు. బయట మతాబాలవెల్తురు, టపాకాయలు, జువ్వలు, ఆటంబాంబులప్రేలుళ్ల చప్పుళ్లు, కోలాహలం - వీట్ల ప్రసక్తే యెవరికీ పట్టినట్లులేదు.

మస్తాను తురపు చెప్పి రెండాటలు గెల్చుకున్నాడు. సూర్యనారాయణ తప్పాడి బేస్తుమీద కుదేలయి డబ్బులు పంచిపెట్టాడు. శాస్త్రికి

లాభంలేదు నష్టమూలేదు. శ్రీహరి రెండుసార్లు జేబుతిరగేసి చూపించి అరువుపెట్టమన్నాడు. పండగపూటా అరువుపనికిరాదన్నాడు మస్తాను. ప్రసాదు ముక్కలు చూపిస్తున్నాడని కాస్సేపు తగూలాడుకున్నారు. ఊరు మాటుమణిగేవేళకు డబ్బంతా మస్తాను ప్రక్కకు చేరింది. శాస్త్రి గొంతు సవరించుకుని పాడ్డం మొదలెట్టాడు—

'గుండెమీద గునపంపోటో - మానాయనా !
నిన్నెవరు కొట్టారే మా నాయనా !
కాదంటె ఖంగపూరో ....మా నాయనా —'

మస్తానుచిరాగ్గా - 'పంతులూ - ఎప్పుడూ యేడుప్పాటలే పాడ్తావు?'

'నీకేం తీపు దిగదీసింది. ఆటలన్నీ గెల్చుకుంటున్నావుగా-'

సూర్యనారాయణ ముక్కల్ని పంచుతున్నాడు. శ్రీహరి ఆవులిస్తూ- 'టైమెంత ?'

శాస్త్రి - 'బోడిటైము. పేకాటకి కూర్చునే టైముగాని లేవటానికి టైమంటూవుండదు.'

ఉన్నట్లుండి టెలిఫోను గణగణా మ్రోగింది. ప్రసాదు లేవబో యాడు.

శాస్త్రి రెక్కపుచ్చుకులాగి - 'దెయ్యం-' అన్నాడు.

'కాదు, సైతాను' అన్నాడు మస్తాను.

సూర్యనారాయణ - 'ఈ అర్ధరాత్రి వొంటిగంటప్పుడు యెవరు పిలుస్తున్నారు చెప్మా -' అని సంశయంగా గొణిగాడు.

'రాంగ్‌నంబరు.' అన్నాడు శ్రీహరి. ఎవరూ కూర్చున్నచోటు నుంచి మాత్రం కదల్లేదు. ఫోను ఆగకుండా చప్పుడు చేస్తున్నది. శాస్త్రి- 'తురకదయ్యం పట్టుకుంటే వోపట్టాన వదలదు.'

సూర్యనారాయణలేచి బల్లదగ్గరకు వెళ్ళి రిసీవరు నందుకున్నాడు. అంతే - 'హ్హో ! హ్హో :' అని బిగ్గరగా అరిచాడు. ఆకేకలకు వులిక్కిపడి అంతా లేచారు. 'వస్తున్నా - వస్తున్నా ....' అని ఫోను వదిలేశాడు. 'ఏవిటేవిట'ని అంతా చుట్టుముట్టారు.

'ఇంటికి నిప్పంటుకుందిట-' అంతా ఒక్కమాటు అరుచుకుంటూ కంగారుగా వీధిని పడ్డారు. కొంతదూరం పరిగెట్టాక మస్తాను తెలి వొచ్చి ఆఫీసుకి తాళాలువేసి వస్తానని వెనక్కి దవుడు తీసాడు.

అంతా పరుగులెత్తున్నారు. పెద్దపెద్ద మంటలు ఆకాశానికి లేస్తు న్నాయి. పొగచుట్టేస్తోంది. సూర్యనారాయణ 'అరవిందా! - అరవిందా!' అంటూ గుండెలుబాదుకుంటూ గుంపులోకురికాడు. ఎవరెవరో చేతి కందిన సామాన్ను బయట గిరాటుపెట్టి బిందెలతో నీళ్లు పోస్తున్నారు. శ్రీహరి ప్రసాదూ జనాన్ని త్రోసుకుంటూ గాలిస్తున్నారు. మస్తాను బిందెకు తాడుగట్టి నూతిమీద నిలబడ్డాడు నీళ్లు తోడేందుకు. సూర్యనారా యణ తెల్లమొహంవేసి గుడ్లనీరు కుక్కుకుంటూ 'అరవిందా-అరవిందా' అని జాలిగా అరిచాడు. శాస్త్రి కంగారుగా - 'లోపలపడుకుందా - గదిలో.' సూర్యనారాయణ తల 'వ్వూ' యించాడు. అంతే - అందరూ చూస్తూండగా శాస్త్రి మంటల్లో కురికాడు. దుంగలు, దూలాలు ఫెటేలు ఫెటేలుమని విచ్చిపోతున్నాయి. పెంకులు టపాటపామని యెగుర్తున్నాయి. రంగు రంగులమంటలు ! - జనం హాహాకారాలు చేస్తున్నారు. ప్రోగుపడ్డ గుంపు తోటంతా విరగత్రొక్కేసారు. దక్షిణపుగోడ పెద్ద చప్పుడు చేసుకుంటూ కూలిపోయింది. జనం పళ్లంతా కళ్లుచేసుకుని చూస్తున్నారు. నీళ్లు పోసేవాళ్లు పోస్తున్నారు. రెండు నిమిషాలు - మూడు నిమిషాలు గడిచింది.

'అక్కా - అక్కా - అక్కా - :' ఎక్కడో పంజరంలో చిలక అరుస్తోంది. సూర్యనారాయణ పంజరంపున్నవైపుకు పరుగెట్టాడు. అర వింద కళ్లుతిరిగి పడిపోయివుంది రోడ్డుమూల తూముగట్టుమీద. 'అయ్యో- శాస్త్రి ! శాస్త్రి !' మస్తాను బిందెను నూతిలో జార్చేసి రొప్పుకుంటూ వచ్చాడు. సూర్యనారాయణ చొక్కా పీక్కుంటూ అరుస్తున్నాడు : 'శాస్త్రిని పిలవండర్రా - కేకెయ్యండి. అరవింద బయటేవుంది ! శాస్త్రీ! శాస్త్రీ ! వచ్చెయ్యి —'

అంతమందీ జోరుగా తోసుకుంటూ అన్నివైపులనుంచీ శాస్త్రీ ! శాస్త్రీ ! అని ఒక్కుమ్మడిని గోలపెట్టారు. సర్వభక్షకుడు వికటాట్టహాసం చేస్తున్నాడు. గాలి వున్నట్లుండి వెర్రిగా వీచింది. ఐదు నిమిషాలు

గడిచాయి. మంటలు తగ్గటంలేదు. మనిషి కదులుతున్న అలికిడికూడా లేదు. శాస్త్రి యేమయినట్టు ?

గంటలు గణగణా మ్రోగించుకుంటూ అగ్నిమాపకదళం వచ్చింది. నిచ్చెనలు తీశారు. ఓలదిలా మనుష్యుల గొట్టాల్ని ఎసిరాడు - సేవ్వరు లైన శిక్షితులు కొంతమంది మంటల్లోకి దారిచేసుకుని యింట్లోకి వెళ్లారు శాస్త్రిని రక్షించేందుకు.

అంతా వచ్చిన అరగంటకు వ్యవహారం సద్దుమణిలోకొచ్చింది.

సూర్యనారాయణ అరిచీ అరిచీ మూర్ఛపోయాడు. జనం తిరగేసిన నులకమంచంమీదకు పుభయుల్నీ జేర్చి పోమూల వడుకోబెట్టారు.

మంటలు సర్దుకున్నాక దూరాలకు పడిపోయిన గోడతాళ్లకు సందునుంచి ముద్దకట్టి మసిబారిన శాస్త్రిదేహాన్ని అగ్నిమాపకదళంవారు బయటకుతీసి స్ట్రెచరుమీద పడేశారు. జుట్టంతా కాలిపోయింది. కమురువాసన - మస్తాను - 'తురకదెయ్యాన్నేంచేశావు పంతులూ-!' అని తల నేలకేసి బాదుకొంటున్నాడు. శ్రీహరి, ప్రసాదూ బిక్కచచ్చిపోయారు. శాస్త్రి కాలిపోయిన లాల్చీజేబులోనుంచి ఆఫీన్ఆసు రాజా మణేలా ముక్కలు సగంకాలినవి తొంగిచూస్తున్నాయి. అంబ్యులెన్సు కారులో మూడుశరీరాల్ని చేర్చి శ్రీహరీ, ప్రసాదు గవర్నమెంటు జనరలాసుపత్రికి పరిగెట్టుకెళ్ళారు.

# 22

'ఆరనితోతునీటి కొలనకన్నట,
పూచిన తమ్మికిన్ విధిప్రేరణ
రాలిపోయినవి రేకులు తొందిరితొమ్మి.
దిప్పుడా వీరజమంచు తా మిగులునే....'

మీరా చనిపోయింది. కృష్ణమూర్తిగారు చనిపోయారు. శాస్త్రి చనిపోయాడు. అంతా మృత్యువాతపడ్డారు.

నేషనల్ ఫోటోస్టూడియో వెళ్ళిపోయింది, వీణా పబ్లికేషన్స్ మూలపడింది, వరహాలుతో మీనాక్షి లేచిపోయింది, సూర్యనారాయణ కొంప కాలిపోయింది, అరవిందకు వున్నమతికాస్తా పోయింది.

మస్తాను 'జంట్స్ అండ్ లేడీస్ అవుటు ఫిట్టర్సు' షాపుమాత్రం అక్కడే వుంది. వెనక సూర్యనారాయణ పాతించిన లాంతరు స్తంభం కూడా యింకా అక్కడేవుంది. వీణాపబ్లికేషన్స్ బోర్డు దిగిపోగానే అక్కడ వో సుముహూర్తాన 'వయోల్బాగు స్టోరు' వెలిసింది. ప్రస్తుతం ఆ స్టోరులో శ్రీహరి నెలకు ముప్పైరూపాయలజీతానికి సేల్సుమన్‌గా కుదురుకున్నాడు.

ప్రసాదు హైస్కూల్లో మేష్టరుగిరీ సంపాదించాడు. ఇటీవల అతనికి అడపాతడపా పెళ్ళిసంబంధాలు వచ్చి వస్తున్నాయి. ముందూ వెనకా యెవరూ పెద్దదిక్కు లేకపోవటంవలన వచ్చినసంబంధాలు వెనక్కి నడుస్తున్నా, కేవలం 'పెళ్ళిమాని ఖుషీవాలా లగుట మేలు!' అన్న స్థితికి అతడింకా దిగజారటంలేదు.

సూర్యనారాయణా అరవిందా పురాణదంపతులుమాత్రం వీధిని వడ్డారు. కుండబొచ్చెలు వచ్చాయి. ఇటికరాళ్ళమీద గంజి వారుస్తున్నారు. గంజిలో కాస్త వుప్పుగల్లు వేసుకుని పచ్చిమిరపకాయ కొరుక్కుతింటే - ఎక్కడి ఆకలైనా పుంజాలుతెంపుకు పోవలసిందే....మస్తాను పిళ్ళి హమేషా యీ దంపతులను వెంటాడుతున్నా. అరవిందమాత్రం 'సాయిబూ, గంజివారుస్తున్నాను రామాకు' అని అటకాయిస్తోవుంటుంది. ఒకప్పుడు ఆ మహాయిల్లాలు అన్నం మూటగట్టుకుని సూర్యనారాయణను వెతుక్కుంటో, పొలాలు చేలగట్లు, రైలుకట్టలన్నీ చుట్టి రావలసివచ్చేది.

పైగలు రికార్డులు, కృష్ణమూర్తిగారి గ్రామఫోను, స్కెచ్చి పుస్తకం డ్రాయింగుబిల్లా రంగులూ మోసుకుంటూ మనుష్యులకు దూరంగా తప్పించుకొంటూ. ఏకాంతాన్ని వెదుక్కుంటూ, నిశ్శబ్దంగా అనిర్దేశపథాల్లో సంచరించే అతగాడ్ని పట్టుకోలేక అన్నంమూటతో తిరిగివచ్చేస్తే, మస్తానువెళ్ళి సూర్యనారాయణను తోలుకొచ్చేవాడు.

ఈ కుటుంబం ప్రస్తుతం తలదాచుకొంటూన్నయిల్లు మీరాది.

అంతా నిష్క్రమించాక ఒకేఒక ప్రియమైనవస్తువు సహా సూర్య నారాయణను అంటిబెట్టుకొనివుంచన్నది. అది డ్రాయింగుబల్ల—

అతను రాసుగొచ్చిన బల్లమీది కాగితాలన్నీ అరవింద వూడలాగి చుట్టూ తనకు తోచినట్లు ఆ పాకలోని గోడలకు తగిలిస్తుంది. సంసారం యిప్పుడు మహావైభవంగా సాగుతోంది. ఎండుగడ్డి తెచ్చి నేలమీద యెత్తుగా పేర్చారు. దానిమీద గోనెగుడ్డ కప్పగా హంసతూలికాతల్పం తయారయింది. కానీకి రెండు కొవ్వొత్తులు యిస్తారు. ఇటికరాయి నిలబెట్టి అందుమీద రాత్రిళ్ళు కొవ్వొత్తి వెలిగిస్తారు. నూతిలో నీళ్ల సమృద్ధిగావున్నాయి. చేటబుచ్చుకుని అప్పుకు వెళ్ళడం నామోషీగా వుంటుంది. అందుకని అరవింద చెంగుచాపి నాలుగు గడపలు ముష్టికి వెళ్ళగానే నాలుగుగుప్పెళ్లు బియ్యపుగింజలు వస్తాయి. ప్రసాదు గురువు గారికి రంగులు డ్రాయింగుకాగితాలు పెనసళ్లు కొని పట్టుగెళ్ళి యిచ్చి వస్తూంటాడు. మస్తాను ఒక చొక్కా కుట్టించి యిచ్చాడు సూర్య నారాయణకు. శ్రీహరి 'దయాల్బాగుస్టోరు'లో తనపేరను వొక వంచెల చాపు కొని పట్టుకెళ్ళి యిచ్చాడు. అరవిందకు చాలాకాలంనించి వొక్కటే చీర. అదీ బాగా చీలికలూ వాలికలూ అయింది. సూర్యనారాయణ తెల్లారిలేస్తూనే గోచిపెట్టుకుని నూతిదగ్గర నీళ్ళోసుకోవడానికి వెళ్ళాడు. ఆ అదనుచూసుకుని అతడి రెండోపంచె కట్టేసుకుని గోనెపట్టామీద కూర్చుంది అరవింద. సూర్యనారాయణ లోపలికొచ్చి వంచెకోసం తడుముకొంటున్నాడు. అరవింద పకపకానవ్వింది.

'అదేవిటి రెండువంచెలూ చుట్టేసుకున్నావు—'

'మీకేమండి—ఎవరన్నా తెచ్చియిస్తారు కోరి అడిగి; ఆడ బడుచును నా సంగతి కనుక్కునేవారెవరున్నారు?'

'పరేలే—' సూర్యనారాయణ ఆ చీరను మడతలుగాపోసి చుట్ట బెట్టుకుని మీద చొక్కా వేసుకున్నాడు. డ్రాయింగుబల్ల, స్టాండు వీపున వేసుకున్నాడు. గ్రామఫోనుసంచీ చేతుల్లోకి తీసుకున్నాడు. నేలమీద

పడివున్న బొమ్మలను తీసి అరవింద చూరులో దాచింది. గుమ్మందాటి బయటకొచ్చాడు. 'నేనూ వస్తున్నాను- మూలిగింది. 'వూ(-' అని అతను నడకుచ్చుకున్నాడు. అరవింద తలుపు గొళ్ళెంపెట్టి అందులో ఒక వెదురుబద్దను తోసి భర్తవెనకాలే బయల్దేరింది.

చేలకడ్డంబడి చెరువులూ గట్లూ పుంతలూదాటి విజనప్రదేశాని కొచ్చి సూర్యనారాయణ స్టాండు నిలవేశాడు. అతనికి బాగా దూరంగా చెట్టుకింద అరవింద గ్రామఫోనుపెట్టెను దించి పాటవేస్తున్నది. అరిగి పోయిన గాట్లలోంచి యిబ్బందిపడుతున్నట్లుగా సైగలు మూలుగు తున్నాడు.

ప్రొద్దు గడుస్తోంది. ఎండకరకరమని పొడుచుకొచ్చేవేళకు చెరిగుస కట్టిన మూటవిప్పి అటుకుల్ని పట్టుకెళ్ళి యిచ్చింది భర్తకు. ఒక గుప్పెడు తిని 'యిహ నాకు చాలు - చూస్తూండు, మంచినీళ్ళు త్రాగి వస్తాను.' మంచినీళ్ళు త్రాగటానికి వెళ్ళాడు సూర్యనారాయణ. కుంచెను రంగుల్లోముంచి స్కెచ్చిపుస్తకంమీద అడ్డంగా బరుకుతోంది అరవింద. మళ్ళీ సూర్యనారాయణ తనపనిలో లగ్నంకాగానే చెట్టుక్రింద ముడిచి పెట్టుకుని అదేపని నిద్రపోయింది బొమ్మసిలినట్లు. ఒకప్పుడు బజారులో కెళ్ళి నిలబడ్డాడు. మనుష్యులు భిన్నభిన్నవ్యాపృతుల్లో వివిధపరిసరాల్లో అనేక మనస్థితుల్లో చిత్రవిచిత్రంగా కనపడసాగారు. ఈ ప్రపంచం మామూలుగా కనపడ్డం మానేసి రసజగత్తు వొకటి క్రొత్తగా తెరుచు కున్నట్లయింది.

ఈ విధమైన స్థితిలో సూర్యనారాయణకు మరొక క్రొత్త స్నేహి తుడు తారసపడ్డాడు, ఆ పిచ్చివాడు నాలుగురోడ్లమధ్యనూ, చెత్తడబ్బాలు, మురికికుండీలమీద బొగ్గూ యిటుకరాయితో బొమ్మల్ని గీస్తున్నాడు. ఇంకా పూళ్ళోని పార్కు_దిమ్మలూ, పాడుపడినగోడలూ యితగాడి కళా విన్యాసానికి చోట్లు. పురాణగాధలూ, రవివర్మబొమ్మలూ, గంగావతరణం నుంచి ద్రౌపదీవస్త్రాపహరణందాకా విసుగూవిరామం లేకుండా ఒక చేత్తో పండో, కాయో, రొట్టెముక్కో కొరుక్కుంటూ గీస్తాడు. అతడి ప్రేక్షకులుకూడా చాలామట్టుకు కుర్రవాళ్ళు, పనీపాటూలేని సోమరులు.

ఈ అఘాయిత్యాన్ని ప్రసన్నముఖంగా చూస్తూ వూరుకోలేదు. ఒకరోజు మిట్టమధ్యాహ్నం యిద్దరుపోలీసులు యితగాడ్ని జుట్టుదొరకపుచ్చుకుని వుచితరీతిని సత్కరిస్తూండగా సూర్యనారాయణ అడ్డుపడి తనతో తీసుకెళ్ళాడు. అరవింద యిద్దరికీ గంజికాచి పోసింది. సూర్యనారాయణ తన పాకలోని కవిలికట్టల్ని తీసి చూపించాడు. పిచ్చివాడు కేరింతాలు కొడ్తూ గంతులేశాడు. 'బాగున్నాయా?' అని అడిగితే. 'ఓహ్హో....' అని వెకిలిగా నవ్వాడు. తరువాత సూర్యనారాయణ పిచ్చివాణ్ణి నడిపించుకుని వూరుబయటకు తీసికెళ్ళాడు. అక్కడ తాతలనాటి శిధిలమైపోయిన సత్రం వొకటి వుంది. అందులో బండరాతిపలకలు, పోయినవిపోగా వున్న కూలిపోయిన స్తంభాలూ చూపించి యిక్కడ రాసుకోమని సలహాయిచ్చాడు. రెండురోజులుపోయాక మళ్ళీ వెళ్ళి చూస్తే అక్కడ వాడు కనిపించలేదు. దాని జాగా అంతా 'కాళింగమర్దనం', 'రాసలీల' 'సీతావనవాసం', 'శకుంతల - దూర్వాసుడు', 'అహల్యా శాపవిమోచనం'తో నింపేశాడు. రైల్లో ఎటో వెళ్ళిపోయివుంటాడని నిర్ధారణకొచ్చాడు సూర్యనారాయణ. అతడు గ్రహించిన మరోవిషయమేమిటంటే. అతగాడికికూడా బొమ్మల్ని వ్రాసేందుకు నలుగురూచేరి చూసి మెచ్చుకునే చోటు కావాలి. విజనపథంలో చిత్రరచనకు అతగాడు యిష్టపడలేదు. సూర్యనారాయణ పగలబడి నవ్వుకున్నాడు.

ఇల్లాంటిసందర్భంలోనే ప్రసాదుకి పెళ్ళయింది. పెళ్ళికూతుర్ని వెంటబెట్టుకుని ప్రసాదు గురుదర్శనానికి వచ్చాడు. సూర్యనారాయణ మూటలోంచి ఒకబొమ్మను తీసి చేతులోపెట్టాడు. ప్రసాదు యాభై రూపాయ లివ్వబోయాడు. సూర్యనారాయణ ససేమిరా వప్పుకోలేదు. శ్రీహరి ప్రసాదు కూడబలుక్కుని ఆ కవిలికట్టలన్నీ పట్టించుకునివెళ్ళి వాట్లకు చాలామట్టుకు ఫ్రేములు కట్టించుకొచ్చి యిచ్చారు. ఆ బొమ్మలన్నీ చుట్టూతా వప్పుకుని గడ్డిపరుపుమీద వుభయులూ పార్వతీపరమేశ్వరులు కైలాసంలో వున్నట్లు బ్రహ్మానందంగా కాలక్షేపంచేయసాగారు.

మస్తాను పూరుకోపటంలేదు. సూర్యనారాయణను మళ్ళీ యెల్లా గన్నా నిలబెట్టాలనే తాపత్రయంలో నలుగురి కాళ్ళావేళ్ళాబడి యేవిధంగా నన్నా సహాయనిధి యేర్పాటుచేయాలని విశ్వప్రయత్నాలు చేయసాగాడు.

# 23

సూర్యనారాయణ చితికిపోయాడని లోకం అనుకుంటుంది. సర్వ విధాలా భ్రష్టుడుకావడమంటే యిదేనని కొందరు వ్రేలెత్తి చూపించారు. చేసుకున్న పెళ్ళాం వీధుల్లోపడి ముష్టెత్తుతోంది. కూతురు కానివాడితో పోయింది. స్టూడియో దివాలాతీసింది, పుస్తకాలవ్యవహారం హళ్ళికి హళ్ళి - సున్నకి సున్నా - ఏవ్యవహారానికన్నా చాణక్యుడిలా పనికొచ్చే 'శాస్త్రి' మంటల్లో కలిశాడు. కొంప కాలిపోయింది. ఇహ యిన్ని అయ్యాక జీవితంలో యేముంటుంది ?

వినండి : సూర్యనారాయణ శిరస్సుచెప్పే రహస్యం యిది—

'నేను నా జీవితంతో యిష్టంవచ్చినట్లు ఆటలాడుకున్నాను. ఒక దారపువుండ తెచ్చి పిల్లికూనముందు పడేస్తే అది క్షణంలో యెన్ని చిక్కులు ముళ్లు పడేస్తుందో, ఎంత హుషారుగా గెంతుతుందో అల్లానే యెగిరాను. కాని అలిసిపోయాననుకుంటున్నారు. నాకు నిరాశా నిస్పృహా లేకుండాచేసినవాళ్లు నా మీరా, శాస్త్రీ. నేను ప్రమాదాల్ని కోరి మెడకు తగిలించుకున్నాను. కేవలం బాధ్యతల్ని సక్రమంగా నిర్వహించటం ఆదర్శప్రాయమైన జీవితం కానేరదు. అందుచేత నా జీవితంలోని అరాచకాన్నంతా నలుగురికీ కాస్త కాస్త రుచిచూపించాను. నాకు తెలిసినంతమట్టుకూ జీవితంలో మానవుడికి సంతృప్తిని మించిన శత్రువు మరొకటిలేదు. నేను నిలబడ్డకొమ్మనే నరుక్కుంటున్నానని నాకు తెలుసు. నా కూతురు లేచిపోయినందుకు నేను నిజంగా చాలా ఆనం దించాను లోలోపల. నా శాస్త్రీ మీరా చావలేదు. ఆ చైతన్యాన్ని నాకు పోసిపోయారు. కొంపకాలిపోవడంతో వీధులోకొచ్చి పడ్డాక - నేనూ

అరవిందా యెంత అన్యోన్యంంగా వుంటున్నామో చెప్పలేను. ఒంటి బట్ట - గడ్డిపరుపు- కొవ్వొత్తిదీపం - గంజిమెతుకులు....అన్నీ అణగారిన కోరికల్లోని వేడిమినీ కలబోసుకున్నజీవితం పాదరసంలా ప్రవహిస్తుంటే-యిప్పుడే కళ్లుతెరిచి యీ లోకాన్ని చూస్తున్నానా అనిపిస్తుంటుంది నామట్టుకు నాకు. మనుష్యుల ముఖాల్లో ప్రసరించే ఆవేదనలు, ఆశలు- సంతోషాలు. కోపాలు, పరాజయం, ఆ యీ అనుభూతుల్ని కుంచెలో నింపుకొని రాస్తున్నాను. నేనిప్పుడు నిజమైన చిత్రకారుడికి లభించే ఆనందాన్ని పొందగలుగుతున్నందుకు నా జీవితం ధన్యమైందని నిస్సంశయంగా చెప్పగల్ను. నా కుంచెను రాగద్వేషాల్లో ముంచుతున్నాను. క్రోధాగ్నిస్ఫుటలు విస్ఫులింగాల్లా చిమ్ముతున్నాను. పురిటినొప్పులు నాకు తెలుసు. రసావస్థలన్నీ పట్టుబడ్డాయి. నేనెవరికోసం రాయటం లేదు. నాలోనే విశ్వసౌందర్యాల్ని వెదుక్కుంటూ ప్రయాణం చేస్తున్నాను. నాలో యిమిడిన జగత్తును పోల్చుకుని నేను పొందే రసానందాన్ని వెలిగ్రక్కే భంగిమలు, ఆకృతులు,వస్తువులు, చేతనాచేతనాలు పుంఖానుపుంఖంగా కన్నుమూసినా, తెరిచినా, నడచినా, కూర్చున్నా నా మనోనేత్రాంచలాలముందు నాట్యమాడుతున్నాయి. నాకింకేం అక్కర్లేదు. మీ అకాడమీలు, పరిషత్తులు. మేడలు, మిద్దెలు, భోగాలు, కోటానుకోట్ల ద్రవ్యం, విలాసాలు, గ్రుద్దులాటలు మీరే అనుభవించండి. నా నరుములు పడిపోవచ్చు, నా చేతులు విరిగిపోవచ్చు, నా తల ప్రేలిపోవచ్చుగాక! నేను నా శరీరాన్ని ముక్కలుముక్కలుగా కోసియిస్తాను, నేను సందర్శించిన జగత్తును నలుగురికీ చూపించేటందుకు! చాలు! చాలు! ధన్యుడ్ని!!!'

## 24

అనగనగా ఒకరోజు మిట్టమధ్యాహ్నం 'అన్నదానసమాజం' దొడ్లో 'బట్టలవర్తకుల సంఘం' వారు బీదలకు అన్నసంతర్పణ చేస్తు

న్నారు. కుంటివారు, గుడ్డివారు. కుష్టురోగులు, సోమరులు, దొంగలు ఆడా-మగా, పిల్లలు, పసికందులు త్రొక్కుకుంటూ, త్రోసుకుంటూ, అరుచుకుంటూ, తిట్టుకుంటూ ఎండలో బారులుదీర్చి కూర్చున్నారు. గంగాళాలతో పులుసుచేశారు. రాసులకొద్దీ అన్నం వార్చారు. ఆ దొడ్డి ప్రక్కనున్న చెత్తడబ్బాలచాటున మురికికాలవలోని పందులు మోరలెత్తి అరుస్తున్నాయి. ఆ పులుసువాసన మైలున్నదూరానికి కొడ్తోంది. ఆ వాసనకు తండోపతండాలుగా వచ్చిపడ్తున్నారు అన్నాతురులు. పులుసు వచ్చేలోగా అన్నం దాచేసుకుంటున్నారు. తీరా పులుసువచ్చాక దొక్క-లతో తాగేస్తున్నారు. గుమ్మడికాయముక్క-లు, అనపకాయ, వంకాయ ముక్క-లు పిల్లలకు దాచి పెట్టున్నారు. ఎంతసేపటికీ వచ్చేవాళ్ళ రద్దీ యెక్కు-వగా వుంది. కాని కూచున్నవాళ్లు లేవడంలేదు. తిన్నవాళ్ళే తింటు న్నారు. మూటలు కట్టుకుంటున్నారు, అన్నదానసమాజ కార్యకర్తలకు విషమసమస్య వచ్చిపడింది. 'బట్టలవర్తకులసంఘం' వారు సద్దెస్త్ర చేస్తున్నారు. తర్జనభర్జనలు జరిగాయి. మనం చేయిచేసుగోవడం బాగుండదు, పోలీసుల్ని పిలవండన్నారు. దొంగవెధవలు అన్నాలు మూట గట్టుకుపోతున్నారు.. యీ దోపిడీని అరికట్టాలని నిశ్చయించారు. అన్నం యెన్నిరోజులకు యెవరుగాని పట్టుకుపోగలరు ? ఒకపూటా రెండు పూటలు - ఈ విషయాలు యెవరాలోచిస్తారు ? సరే - పోలీసువాళ్ళు వచ్చారు. 'లా అండ్ ఆర్డరు' నిలబెట్టడంకోసం. బిచ్చగాళ్ళకు ఆశగా వుంది - ఆడవాళ్ళకు చీరెలూ. మగవాళ్ళకు బనీనులు పంచిపెడ్తారని వాళ్లు విన్నారు. పాపం 'బట్టలవర్తకులసంఘం' వారు అందుకుసిద్ధంగానే వున్నారు. కాని బిచ్చగాళ్లు భోజనాలదగ్గరే అమర్యాదగావున్నారాయె. పోలీసులు వచ్చిగానే లాఠీచార్జీ చేస్తున్నారు. జనం మూటగట్టుకున్న అన్నాలతో, చేతుల్లో పులుసాదొక్కు-ల్తో పరుగులుపెట్టున్నారు.

ఈ గుంపులోనే వొకమూల నిలబడి యెట్లాగో సంధుచేసుకుని అన్నం మూటకట్టుకుంది అరవింద. దొక్కు-లో పులుసుపోయించుకుని జనాన్ని తప్పించుకుంటూ యెట్లా బైటపడ్డమా అని ఆలోచిస్తున్నట్లుంది. ఇంతలో ఒక దెబ్బ బుజంమీద పడింది. ఒక దుశ్శాసనుడు కొంగు

పుచ్చుకులాగాడు - బట్ట పూడిపోయింది - అన్నం నేలమీద పడిపో యింది. పులుసంతా కారింది మీద. ఆ గుడ్డముక్కను మీదకు లాక్కుంటూ పరుగుచ్చుకుంది. బిచ్చగాళ్లు నాలుగు వైపులనుంచీ రావడంతో తొడత్రొక్కిడి యేర్పడి పూపిరిసలపక దొర్లిపోయి రోడ్డు వారన పడిపోయింది. ఎవరెవరో ఆ హడావిడిలో త్రొక్కుకుంటూ వెళ్లిపోయారు. మర్యాదస్థులు తలలు ప్రక్కకు త్రిప్పుకొని నడుస్తు న్నారు. ఒక జోడు కుక్కలుమాత్రం దూరంగా నిలబడి ఆశ్చర్యంగా చూస్తున్నాయి. అరవింద పారేసుకున్న అన్నపుకరుడుమీదకు కలియబడ్డా నికి కూడా వాటికి సాహసంరాలేదు.

ఆ రోజురాత్రి పదీపదకొండుగంటలప్రాంతాన ఒక చిన్నకారు, మోడలు క్రొత్తదే, శరవేగంతో పరిగెట్టుకొని పూర్వపు నేషనల్ ఫొటో స్టూడియో వున్నచోట, లాంతరు స్తంభందగ్గరకు వచ్చి ఆగింది. అందులోంచి యూరోపియన్ దుస్తుల్లోవున్న ఒక యువతీ యువకుడూ దిగారు. మస్తాను కొట్టుముందు చాలాసేపు నిలబడి కేకలుపెట్టారు. ఎవరూ పలకలేదు. ప్రక్కయింట్లోని కిటికీ నెమ్మదిగా తెర్చుకొంది. ఎవరో విసుగ్గా - 'ఇప్పుడిక్కడ యెవరుకావాలి ?'

'నేషనల్ ఫొటో స్టూడియో వుండాలి యీ మీదన....' యింకా వాక్యం పూర్తిగాకుండానే 'అంతా యెత్తేసారు. యేమయ్యారో తెలీదు.' కిటికీ చప్పుడుచేసుకుంటూ మూసేసుకున్నారు. ఆయిద్దరూ కారు త్రిప్పు కుని సూర్యనారాయణ యింటికిపోయే దారిలో కారు ఆపుజేసి తాళాలు వేసుకుని చీకట్లో సన్నటి కాలిబాటగుండా చిరపరిచితుల్లా నడువసాగారు. తీరా సూర్యనారాయణ యిల్లువుండేచోటుకు చేరగానే వాళ్ళకక్కడ కని పించినవి పాడుబడి కాలిపోయిన గోడలు, దర్వాజాలు కిటికీలు యెత్తుకు పోయిన బోళ్లు! అగ్గిపుల్ల గీశాడు యువకుడు. ఆ యువతిముఖంలో నెత్తురుచుక్కలేదు. ఇద్దరూ ఆమొండిగోడల్లో కాస్సేపు తిరిగి వచ్చి ప్రశ్నార్థకంగా ఒకరిచేతుల్నొకరు పట్టుకుని గుంజాయించారు. ఆతర్వాత కారు తిన్నగా సందులూ, గొందులూ, బజార్లూ తిరిగి విజనప్రదేశంలో వున్న మీరా పూరిపాకముందు వచ్చి ఆగింది.

కారులోంచి యిద్దరూదిగి వొకర్నొకరు గట్టిగా పట్టుకొని నిశ్శబ్దంగా అడుగుల్లో అడుగులు వేసుకుంటూ పాకగుమ్మంముందుకొచ్చి నిలబడి తలుపును గెంటారు బలంగా. కిర్రుమని చప్పుడుచేసుకుంటూ తలుపు విడిపోయింది. వరహాలు గుమ్మందాటి అగ్గిపుల్ల గీశాడు—

చూరున వ్రేళ్ళాడుతున్నాయి ఏవేవో చిత్రాలు. మళ్ళీ మరోపుల్ల గీశాడు. వెలిగి ఆరిపోయిన కొవ్వొత్తిమాత్రం ఒకటి యిటుకరాయిమీద నిలబడివుంది. నేలమీద అడుగెట్టడానికి సందులేకుండా బొమ్మలకాగితాలు పడి దొర్లుతున్నాయి.

ఈ మారు కొవ్వొత్తి వెలిగించాడు. ఆ వెలుగులో ఆ గజిబిజిలో ఒక గడ్డిపరుపుమీద గోనెగుడ్డలు కప్పుకొని యిద్దరు లుంగలుచుట్టుకొని పరున్నారు.

ఇంకా కొన్ని డొక్కులు పింగాణీపగిలిపోయిన కంచాలు వున్నాయి. మారుమూలల్లో ఒకవైపున పాతభోషాణంమీద గ్రామఫోను పెట్టె, సైగలురికార్డులు, మూడుసంచులు. అందంగా ఫ్రేముకట్టబడిన మీరా చలువజాతి కొండల చిత్రాలు వున్నాయి.

మీనాక్షి నిలుచున్నపాళాన వంగి ఆ మీదను చుట్టుకున్న గోనెను లాగుతూ 'అమ్మా! అమ్మా!' అని అరిచింది.

సూర్యనారాయణ అమ్మా, అమ్మా!' అంటూ బిడ్డను మీదకు లాక్కున్నాడు, ఆ ప్రక్కమీది రెండోజీవంమాత్రం గొడ్డుపూలిగినట్లు మూలగసాగింది. 'తతిమ్మావాళ్ళంతా యేరీ?' అన్న వరహాలుప్రశ్న చూరుల్లోంచి దూసుకుని ఆ వాకనుదాటి విశ్వాంతరాల్లోకి ప్రయాణం చేయసాగింది.

